PELLI DĀNI PUTTUPOORVOTHARALU By Thapi Dharmarao

ప్రథమ ముద్రణ : 1960

ప్రచురణ నెం. : 2310

ప్రతులు : 1,000

పదమూడవ ముద్రణ : మార్చి, 2002



టైటిల్ డిజైన్ : బాపు

**వెల: రూ.40-00**

ప్రతులకు: **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
4-1-435, విజ్ఞాన్‌భవన్, బ్యాంకు స్ట్రీట్
హైదరాబాదు - 500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: విశాలాంధ్ర ప్రెస్, హిమాయత్‌నగర్, హై.

# ఈ ముద్రణ గురించి ఒక్కమాట

పూర్వ ముద్రణ ప్రతులన్నీ చెల్లిపోయిన వెంటనే ఈ ముద్రణను ప్రచురించలేకపోయినందువల్ల పాఠక మహాశయులు ఆదరంతో ఈ ప్రతులు కోరడమూ, వారి కాశాభంగం కలగడమూ సంభవించాయి. జరిగిన ఆలస్యానికి మమ్మల్ని క్షమించి, పూర్వంలాగానే ఆదరాభిమానాలతో ఈ ప్రచురణల నాదరించమని ప్రార్థిస్తున్నాం.

ఈ కూర్పులో కొన్ని కొత్త విషయాలు చేర్చాలనుకున్నాం. కాని తీగ కదిపితే పొద అంతా కదులుతుంది. అందుచేత ఈ విషయాలను పుస్తకంలో అక్కడక్కడ దూర్చడం మంచిది కాదని, ఆ విషయాలను అనుబంధ రూపంగా జతపర్చామని మనవి చేస్తున్నాము.

పెళ్ళి విషయాలు అధ్యయనం చేసినందువల్ల మనం అనవసరంగా పెళ్ళితంతును పెంచి పెంచి, పెద్ద భూతంగా తయారుచేశామని తేటపడుతుంది. దేశకాల పరిస్థితులబట్టినీ, ఇరుగు పొరుగు జాతులవారి ఆచారాలు అనుకరించడం బట్టీ కొన్ని ఆచారాలు మనం పూర్వం ఎప్పుడో అవలంబించాం. ఆ పరిస్థితులు మారాయి. ఆ జాతులవారి అభిప్రాయాలు తెలియకుండానే ఆచారాలు మాత్రం అర్థరహితంగా పాటిస్తున్నాము. ఇకనైనా ఈ అనవసర బెడదంతా విడిచిపెట్టి ఋణాలపాలు కాకుండా వివాహాలు చేసుకోవడం మంచిది కాదా?

"నాకు పని పాటలలో సాయం చేయడానికీ, సంతానం కనడానికీ నీ కూతురిని ఇవ్వవలసింది" అని వరుడో అతని పక్షంవారో కన్యాదాత నడిగిన తంతులో బాల్యవివాహాలకు తావు కనపడదు.

అగ్నిదేవుడు, గంధర్వులు పెళ్ళాడిన తరువాతే వరుడు వివాహం చేసుకుంటాడని సిద్ధాంతం. కాబట్టి క్షతయోని అయినంతమాత్రాన వివాహానికి అనర్హ అవుతుందనలేము. కాబట్టి స్త్రీ పునర్వివాహానికి అభ్యంతరం ఉండకూడదు.

మనవారి పెళ్ళి, శోభనం మొదలైన తంతులో కొన్ని హాస్యాస్పదమైన విషయాలుగూడా ఉన్నాయి. వాటిని ఎంత త్వరగా విసర్జిస్తే అంత మంచిది. శోభనపు గదిలో వధువు "ఓ ప్రియుడా! నీవు నా యందు పుట్టుము" అంటుంది. దానికి బదులుగా వరుడు "ఓ పుత్రులను కోరుతున్న ప్రియురాలా! నేను నీకు పుత్రరూపముగా పుట్టుదును" అంటాడు*; ఈ మాటలలో అంతరార్థాలు ఏమున్నా, ఈ దినాలలో అనడానికీ, వినడానికీ కొంత చీకాకుగానే ఉంటుంది. ఈలాంటివే కొన్ని ఆడంబరాలు అనవసర ధనవ్యయముతో-జరుగుతుంటాయి. ఇటువంటి పద్ధతులను 1971 లో గూడా అవలంబిస్తున్నామంటే ఎంత లజ్జాకరమో చెప్పనక్కరలేదు; యువకులు గట్టిగా ఉద్యమించినట్లయితే విజయం సాధించడం కష్టకార్యం కాదు. శాసనాల మూలంగా ప్రయత్నించడం నిరర్థకం.

హైదరాబాదు,
1971 ఫిబ్రవరి 20.

- తాపీ ధర్మారావు

* ఈ వాక్యోపవాక్యాలు మా గురువులు కీ.శే. బంకుపల్లె మల్లయ్య శాస్త్రిగారు ప్రచురించిన "వివాహతత్త్వము" గ్రంథములోనివి. పుట 19.

# పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు

## చిన్న మనవి

సృష్టిలో మానవుడు నిన్న మొన్నటివాడు కాడు. కొన్ని వేల - లక్షల (అందామా?) - సంవత్సరాలనుంచి వున్నవాడు. ఆదినుంచి నేటి వరకు వాడు ఒక్కలాగే ఉన్నాడని గాని; ఒక్క విధమైన అభిప్రాయాలతోనే జీవించాడనిగాని, ఒక్కరీతిగానే ప్రవర్తించాడనిగాని ఎవ్వడూ అనలేడు. తాను మారాడు. తన జీవిత పద్ధతి మారింది. తన భావాలు మారాయి. తన విజ్ఞానం మారింది. ఇవన్నీ ఇంకా మారుతూనే వున్నాయి. మారుతూనే ఉంటాయి గూడా. ఇది అందరు అంగీకరించవలసిన సిద్ధాంతము.

స్వల్ప విషయం: మానవుడి బట్టకట్టు సంగతి చూడండి. ఈనాడు పాశ్చాత్య దేశాలలో జోడు, మేజోడు, లాగు, పంట్లాము, బనియను, చొక్కా, వెయిస్టుకోటు, కోటు, చేతిరుమాలు, కాలరు, నెక్‌టై, టోపీ - ఇన్నింటితో ఉంటేనేగాని బయటికిరారు. ఈ విధానం ఒక్కనాడు వచ్చిందనగలమా? ఆది మానవులు ప్రకృతి బిడ్డలై, బైబిల్‌లోని ఏడమ్ - ఈవ్‌లలాగా దిగంబరులుగా ఉండేవారు. ఆకులు అడ్డుపెట్టుకొని, పట్టలు చుట్టుకునీ, గోచీలు బిగించుకొనీ ఎన్నో అంచీలలో మార్పులు చెంది, ఈనాడు ఈ రూపంలోనికి వచ్చారు. పరిణామం ఈ అంచీలలో జరిగిందని రుజువు చేయడానికి ప్రపంచంలో ఆయా దేశాలలోని దుస్తుల విధానం పరిశీలించి చూస్తే తేటపడుతుంది.

అలాగే పెళ్ళి సంగతి కూడాను. ఆదిలో పెళ్ళిళ్ళు ఈనాటి పెళ్ళిళ్ళలాగా పురోహితుల మంత్రాలతో అగ్నిసాక్షిగా, "నాతిచరామి" అన్న ప్రమాణాలతో జరుగుతూ ఉండేవని అంటే నలుగురూ నవ్వుతారు.

పెళ్ళికి సంబంధించిన అభిప్రాయాలూ, అచారాలూ అంచీలు అంచీలుగ మారుతూ వచ్చాయి. అవసరాలను బట్టీ, అవకాశాలను బట్టీ ఆయా దేశాలలో ఈ మార్పులు కలుగుతాయి. కొన్ని దేశాలు మూడో అంచీలో ఆగివుంటే, మరికొన్ని దేశాలు మరి నాలుగు అంచీలు ముందుకు పోయి ఆగివుంటాయి. ఇంకా కొన్ని ఇంకా ముందుకు సాగి ఉంటాయి.

పరిశోధకుడు ఆయా దేశాలలో ఈనాడున్న ఈ అంచీలను శ్రద్ధగా గ్రహిస్తాడు. ఏ అంచీ ముందుదో, ఏది వెనుకదో తర్కిస్తాడు. అప్పుడు అంచీల వరుస ఒకటి ఏర్పడుతుంది. మానవ వివాహం ఈ అంచీలమీద పరిణామం పొందింది అని నిర్ధారణ చేస్తాడు. అలాంటి నిర్ధారణలే మన రచనలకు ఆధారములు. వీటిలో పరిశోధకులకు అభిప్రాయ భేదాలుంటే ఉండవచ్చును గాని, కాదని చెప్పవలసింది ఉండదు.

ఈ విధంగా అంచీలలో మార్పు చెందుతూ ఉన్నప్పుడు, ఒక్క సంగతి జరుగుతూ వుంటుంది. కింద అంచీలో చాలా ప్రధానంగా వుండే కొన్ని అంశాలూ, లాంఛనాలూ పై అంచీలలో గూడా నిలిచి వుంటాయి. కాని, వాటి ప్రాధాన్యం పోతుంది. క్రమంగా, ఆ అంశాలూ, లాంఛనాలూ పెళ్ళిళ్ళలో జరుగుతూ వుండినా, అవి ఎందుకు వచ్చాయో, వాటి అర్థం ఏమిటో తెలియకుండా పోతుంది. కేవలం అర్థంలేని ఆచారం మాత్రం మిగిలి వుంటుంది. ఈలాంటివి ఈనాటి పెళ్ళిళ్ళలో చాలా ఉన్నాయి. పెళ్ళిళ్ళలోనే కాదు, మానవజీవితంలో జరిగే అన్ని విషయాలలోనూ, శుభకార్యాలలోనూ, అశుభకార్యాలలోనూ, ఈ అర్థం తెలియని గోల కనబడుతుంది. పరిశోధనవల్ల అలాంటి అనర్థకాలు కొన్నయినా అర్థమవుతాయి.

మహా మేధావులయిన విదేశీయ పరిశోధకులు, అభిమానాలకు లొంగిపోకుండా, భిన్న భిన్న నాగరికతలను గురించి అనేక గ్రంథాలు వ్రాశారు. వారికి సాధారణంగా, భారతీయ సంప్రదాయాలూ, ఆచారాలు

తెలియవు. మన పరిశోధకులు; చాలామంది, స్వాతిశయముతో, ఇతర నాగరికతలను లెక్కలోనికి తీసుకోరు. తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం. ఈ రెంటిని సమన్వయము చేయడమూ, సమ్మేళనకు ప్రయత్నించడమూ అవసరమనే నేనీ రచనకు పూనుకున్నాను.

ఒక్క విషయము మాత్రము గట్టిగా మనవి చేస్తాను. దీనిలో చూపిన ఆయా జాతుల విషయాలు కల్పితాలుగానీ, అతిశయోక్తులుగానీ కావు. ప్రత్యేక పరిశోధనలు చేసిన సుప్రసిద్ధులు ప్రకటించినవే. నూటికి నూరుపాళ్ళు సప్రమాణమయిన విషయాలే. సత్యాన్ని పాఠకుల కందించాలనే గాని, వారిని మోసపుచ్చాలని ఈ రచనకు పూనలేదు. ఈ మాట నమ్మవలసిందని ప్రార్థిస్తున్నాను.

ఇది ఎదురీత; తలలో నాటుకున్న విషయాలకు విరుద్ధం. ఈ పరిణామక్రమము మరపున పడకుండా, సుబోధంగా ఉంచడంకోసం, చెప్పినవే మరల మరల చెప్పవలసి వచ్చిందని మనవి చేస్తున్నాను.

# నేను సంప్రదించిన గ్రంథాలలో ముఖ్యమైనవి


Westermark : History of Human Marriage.

Havelock Ellis : Psychology of Sex.

Briffault : Mothers.

Frazer : Golden Bough Volumes.

Malenovsky : Works of Research.

Thurston : Castes and Tribes of Southern India.

Crawley : Mystic Rose.

Hastings : Encyclopaedia of Religion & Ethics.

Summer : Science of Society.

# సూచిక

# పెళ్ళి: ప్రశ్నపరంపరలు

పెళ్ళంటే సందడి; పెళ్ళంటే సంతోషం. ఒక మగవాడు ఒక ఆడది (ముఖ్యమయినవాళ్ళు) కొంత తంతు, కొంత వేడుక, కొంత విచారం.... పెళ్ళంటే తెలియని వాడెవ్వడు?

అయినా, పెళ్ళి సంగతి తెలిసినవారు చాల తక్కువ అని అంటే సాహసంలాగ కనబడుతుంది. సృష్టి ఆరంభం దగ్గర నుంచి ఇప్పటికి ఎన్ని పెళ్ళిళ్లు జరిగాయో--దేవతల పెళ్ళిళ్ళ సంగతి వదలిపెట్టినా-కొన్ని కోటానుకోట్లు జరిగుండాలి. ప్రతిరోజూ-ఇప్పటికీ-వందలూ వేలూ పెళ్ళిళ్ళు ప్రపంచం అంతటా జరుగుతున్నాయి. పెళ్ళిళ్ళు చేసుకొని జీవిస్తున్నవారు ఉండనే ఉన్నారు. పెళ్ళి చేసుకొని వియోగంలో పడ్డవారు మళ్ళీ పెళ్ళిళ్ళకు తలపడుతున్నారు. పెళ్ళికానివాళ్ళు పెళ్ళిళ్ళ కోసం తొందరపడుతున్నారు. అందుకూ చాలనివాళ్ళు బొమ్మల పెళ్ళిళ్ళతో తరిఫీదవుతున్నారు. చూడగా చూడగా ప్రపంచం అంతా పెళ్ళి కోసమే బతుకుతున్నట్టు కనిపిస్తుంది. అలాంటప్పుడు పెళ్ళంటే తెలిసినవాళ్ళు చాల తక్కువంటే సాహసం కాదా?

అవును. ఆ సాహసం కావాలి. అలా సాహసించి అడిగేవారు ఉండాలి. అడుగుతేనేగాని, అసలు సంగతి బయటపడదు. అడగడం అజ్ఞాన లక్షణం అన్న రోజులు పోయాయి. అటూ ఇటూ తొణకకుండా ఉంటే అంతా తెలిసిన మహామహుడు అని అనుకునే దినాలు గడిచిపోయాయి. అడిగినవాడే జ్ఞానానికి ఆదరువు. చెప్పగలిగినవాడే గొప్పవాడు. తక్కిన గొప్పతనం అంతా షిగహపుష్టే

అలా అడగడానికే పూనుకుంటే ప్రశ్నలు శరపరంపరలు. దీనిని పెళ్ళి అని ఎందుకన్నారు? పెళ్ళంటే ఏమిటి? ఎందుకు ఆ పెళ్ళి చేసుకోవాలి? పెళ్ళంటూ ఒకటి లేకపోతే కాదా? దానికిన్ని లాంఛనాలూ; ఆచారాలూ ఎందుకొచ్చాయి?.....ఇలాగ వందలూ వేలూ అడగవచ్చును.

వీటిలో అనుభవంమీద చెప్పవలసినవి కొన్ని; ఆలోచనచేసి విప్పవలసినవి కొన్ని; శాస్త్రాలు చూడవలసినవి కొన్ని; చరిత్రలు తడవవలసినవి కొన్ని. అంతా బీరకాయపీచు. అంతేగాని సులభంగా తేలేది ఏదీ కనబడదు.

దీనికి పెళ్ళి అన్న పేరెందుకు వచ్చింది - కాకపోతే వివాహం, పరిణయం, కల్యాణం ఏదయినాసరే - అన్న ప్రశ్న శబ్దశాస్త్రజ్ఞులు చెప్పవలసింది - చెప్పుతారు గూడాను; అతికినా అతకకపోయినా "కుంతీ పుత్రో వినాయకః" అని. ఆ వ్యుత్పత్తులూ వాటి సంగతీ, ముందు ముందు మనమూ చూద్దాం.

తరువాతి ప్రశ్న పెళ్ళంటే ఏమిటి? అంటే చదువుకున్నవారి భాషలో పెళ్ళికి నిర్వచనం చెప్పాలన్నమాట. నిర్వచనం చెప్పడం అన్నది చాలా కష్టమయిన పని. మనిషి అంటే ఏమిటి అని అడిగి, నిర్వచనం చెప్పలేక చచ్చారు, మహా మహా పండితులు.

ఒక మహాజ్ఞాని చెప్పిన నిర్వచనం ఇంకొక సర్వజ్ఞుడు ఖండించేవాడు. ఒక పండితుడు ఇచ్చిన నిర్వచనం మరొక విద్వాంసుడు ఎగతాళి చేసేవాడు. రాత్రింబగళ్ళు మహాజ్ఞానులంతా ఆలోచనలు చేశారు. విమర్శకు తాళగలిగిన నిర్వచనం ఏదీ చిక్కలేదు. మహారాజు నిరుత్సాహం ప్రకటించారు. అంతలో ఒక మహావిద్వాంసుడు లేచి "మహారాజా! సృష్టిలో వెంట్రుకలు లేని రెండు కాళ్ళ జంతువు మనిషి అని నిర్వచనం చేయవచ్చుననుకుంటాను" అన్నాడు.

మరునాడు ఒక కొంటెకోణంగి విద్వాంసుడు 'ఈకలు దూసిన ఒక కోతిని తెచ్చి నిండు సభలో "ఇదిగో మహారాజా, మన మహా పండితుడు నిర్వచించిన మనిషి" అని ఆ కోతిని చూపించాడు. సభవారందరు నవ్వి గోలచేశారు.

అలాంటప్పుడు పెళ్ళి అంటే ఏమిటి అన్న ప్రశ్నకు నిర్వచనం అంత సులభంగా దొరుకుతుందా? ఫ్రాన్సు పండితులు, జర్మను విద్వాంసులు, ఇంకా చాలామంది పెళ్ళంటే ఏమిటో చెప్పాలని ఎన్నో సంవత్సరాల నుంచి ప్రయత్నాలు చేస్తున్నారు. ఎంత చేసినా గురికి బారెడు దూరంలోనే ఉంది సమాధానం. ఎందుచేతనంటే- ఈ పెళ్ళి అన్నది ప్రపంచంలో ఒక దారినా, ఒక తెన్నునా ఉన్నట్టు కనబడదు.

క్రిందటికి ఒక రాజకుమారుడు ఏనుగుమీద అంబారీలో కూర్చొని ఛత్రచామరాలతోనూ, బాజాభజంత్రీలతోనూ, బాణాసంచాలతోనూ, భోగంమేళాలతోనూ, దండూ రాణువతోనూ "డెబ్బయి నిఘాలా" పెళ్ళి హడావుడితో ఊరేగింపు చేసుకుంటూ వస్తున్నాడు. ఒక సందులో ఒక గుడిసె దగ్గర రెండు దివిటీలతోనూ, రెండు డప్పుల బడబడలతోనూ, నలుగురు మనుష్యులతోనూ కొంచెం సందడి కనిపించిందట రాజు కొడుక్కి. అదేమిటి? అని ప్రక్కనున్న ఉద్యోగిని అడిగాడు. పోలిగాడి పెళ్ళి మహారాజా అని ఉద్యోగి జవాబు చెప్పాడట. రాజకుమారుడికి పెద్ద నవ్వు వచ్చింది. "హ హ్హా హ్హా! అదిగూడా ఒక పెళ్ళేనా?" అన్నాడట.

పాపం! రాజు కొడుకును ఏమీ అనకూడదు. పెళ్ళి అంటే, తన అనుభవం వేరు: తాను విన్నదీ చూచిందీ వేరు. పోలిగాడి పెళ్ళి అలాగా లేదు. దాన్ని పెళ్ళని ఎలా అనుకుంటాడు? ఇంగ్లీషువారి పెళ్ళి మన చెయిన్లుగారికి పెళ్ళిగానే కనబడుతుందా? యజ్ఞోపవీతం పట్టుకొని చెప్పమనండీ అది పెళ్ళే అని. ససేమిరా! అంగీకరించడు. రష్యాలోని పెళ్ళి ఇంగ్లీషు స్త్రీ కి ఎలాగుంటుంది? పెళ్ళి అన్నట్టే కనిపిస్తుందా? మన పెళ్ళిళ్ళు చూచి నవ్వలేక చచ్చినవారెంతమంది?

ఇవన్నీ నాగరకులం అని అనుకుంటున్న మన సంగతులు. ఇంకా నాగరకత చాలనివి ఎన్ని జాతులు, ఎన్ని తెగలు, ఎన్ని దేశాలు ఉన్నాయి? వాళ్ళకు గూడా పెళ్ళిళ్ళున్నాయి. ఆ పెళ్ళిళ్ళు చూస్తే ఏమంటారు? వింటే ఏమనుకుంటారు?

ఇంత ఎందుకు? శ్రీరామచంద్రుడి కాలంలోను, శ్రీకృష్ణుడుండిన కాలంలోనూ పెళ్ళిళ్ళు చేయించిన మహామహులను, పెద్ద పెద్ద పురోహితులను ఒక్కసారి పిలిచి, ఇప్పుడు జరుగుతున్న మన పెళ్ళిళ్ళు చూడమనండి? కడుపు చెక్కలయినట్లు నవ్వనయినా నవ్వుతారు; కళ్ళూ, చెవులూ మూసుకొని ఏకాయెకిని తిరుగు ప్రయాణానికి బండి కట్టించనయినా కట్టిస్తారు. "ఇదిగూడా పెళ్ళేనా" అన్నమాటే వాళ్ళ హృదయాలలో మారుమోగుతూ ఉంటుంది.

అన్ని వ్యత్యాసాలతో ఉన్నప్పుడు పెళ్ళంటే ఏమిటో చెప్పమంటే ఎవడి తరం? మనం చెప్పగలమా? పెళ్ళి చేసుకొని గౌరవంగా బతుకుతూ

ఉన్నట్టు కనబడేవాళ్ళని ఒక్క పదిమందిని రహస్యంగా అడగండి - "పెళ్ళంటే ఏమిటండీ?" అని. పదిమందీ పదిరకాలుగా బదులు చెప్పకపోతే, ఇది ప్రపంచమేకాదు. ఒకడి దారి ఒకడిది కాదు. ఒకతె అనుభవం ఇంకొకతెది కాదు.

చేతులారా మెడకు ఒక బండ కట్టుకోవడమే పెళ్ళి అంటాడు ఒకడు. కామ భోగాలకు-ఇతరులకు ఎలాంటి హక్కులూ లేకుండా- గుత్త తీసుకోవడం అంటుంది ఒకర్తె. ఇష్టం ఉన్నా లేకపోయినా ఇల్లు గడుపుకోవడం అంటుంది ఒకర్తె. పగలంతా పరమ చాకిరీ, రాత్రంతా రాద్ధాంత రణరణలు పెళ్ళి అంటాడు ఒకడు. ఇంటిపేరు నిలబెట్టుకోడానికి ఇదొక సాధనం అంటా డొకడు. స్వర్గారోహణకు పెళ్ళి ఒక నిచ్చెన అంటాడొకడు. సంప్రదాయం అంటుం దొకర్తె. అదొక సందడి అంటుంది ఒకర్తె ...

ప్రశ్న కఠినమయిందే. ఇంత వేగం ఆ ప్రశ్న అడగడం ధర్మం కాదు. ముందు ముందు అడగక తప్పదు; పెద్దలు పె ప్పె పె, మెమ్మెమె అనక తప్పదు. ఇప్పటికి మాత్రం తక్కిన ప్రశ్నలను గురించి ఆలోచించవచ్చును. ఒక్కమాట మాత్రం మరిచిపోకూడదు. ప్రపంచం విశాలం. ఒకచోట ఉన్నట్టే మరొకచోట ఉండదు. కాలం నిరవధి. దీనికి ఆదీ అంతమూ లేదు. మొన్నమున్న మోస్తరు ఈవేళ లేదు; ఈవేళది రేపుండదు. సత్యం తెలుసుకోవాలిఅంటే పూర్వనిశ్చయాలూ దురభి మానాలూ కొంచెందూరంగా ఉంచాలి. నిష్కల్మషంగా సంగతులు వినాలి. ఆపయిని విమర్శించాలి.

**వినదగు నెవ్వరు చెప్పిన వినినంతనె వేగపడక వివరింపదగున్**
**కని కల్లనిజము తెలిసిన మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!**

# మగ-ఆడ తెగలు

పెళ్ళెందుకు చేసుకోవడం అన్నది గూడా పెద్ద ప్రశ్నే. నాలుగు వేల సంవత్సరాలకు ముందూ అది ప్రశ్నే: ఇప్పుడూ పెద్ద ప్రశ్నే. మరి వెయ్యేళ్ళ తరువాతనూ పెద్దప్రశ్నే - దీనికి సరియైన జవాబు దొరకదూ-లేదు కాబట్టి. తల్లి ముసలిదని ఒకడు, ఇంట్లో దక్షతలేదని ఒకడు, కామంకోసం అని ఒకడు, ప్రేమకోసం అని ఒకడు, పిల్లలు కనడానికని ఒకడు, మొదటి పెళ్ళాం పిల్లలని పెంచడానికని ఒకడు....ఇలాగ ఎన్నో కారణాలు చెప్పతారు. తండ్రులు, తాతలు, వారి తాతలు పెళ్ళి చేసుకున్నారనే ఆచార కారణం ఒకటి ఉండనే ఉందికదా!

ఈ ఆచారంవల్ల పెళ్ళి అన్నది జీవితంలో ఒక అంచి అయి పోయింది. పదో ఏడు అయిన తరువాత పదకొండో ఏడు రాదూ? అలాగే. కొంత వయసయిన తరువాత పెళ్ళి కావాలి. ఆడపిల్ల రజస్వల అయినట్టే, పెళ్ళి కూడా కావాలి. బాల్యం తరవాత యౌవనం, తరవాత ముసలితనం వచ్చినట్టే, చిన్నతనంతరవాత పెళ్ళి, ఆ తరవాత పిల్లలు సంసారం అంతా అవశ్యం ఉండవలసినవే. అంత ప్రబలం ఐపోయింది ఈ ఆచారం.

కాబట్టి, ఈ రోజులలో పెళ్ళి ఎందుకు చేసుకోవాలి అని అడగడం చాల తెలివితక్కువగా కనిపిస్తుంది. అందుచేత మనం కొంచెం జాగ్రత్తగా ఉండాలి.

ఇప్పుడు మనం చేసే ప్రయత్నం మరచిపోకూడదు. ఈ పెళ్ళి ఆచారం ఎందుకు వచ్చింది? ఎందుకు రావాలి? అని పరిశీలిస్తున్నాం.

ఆచారం ఇలా వుంది అని చెప్పడం ఆ ప్రశ్నలకు సమాధానం కాదు. ఎందుకు దొంగతనం చేశావు? అన్న ప్రశ్నకు, చేశాను అన్నది జవాబు కాదుగదా!

అలాగే ఆ ప్రశ్నలను గురించి మాటలాడినప్పుడు, ఇప్పుడున్న ఆచారాలమాట ఎత్తకూడదు. ఈ మాటమాత్రం బాగా జ్ఞాపకం ఉంచుకోవాలి. ఆచారాలను దూరముంచి, చూపు వెనక్కి మరలించాలి. అప్పుడుగాని, నిజం బయట పడదు.

ఈ పెళ్ళిగోల అంతా రావడానికి మొదటి కారణం ప్రపంచంలోనే వుంది. దీనిని ప్రకృతి అనండి; సృష్టి అనండి; ఏమన్నా ఫర్వాలేదు. ఈ ప్రకృతిలో మగ, ఆడ అని రెండు తెగ లున్నాయి. "ఎమీబా" మొదలయిన ప్రాణులలో వున్నట్టు అందరూ ఒక్క తెగగానే వుంటే, ఈ పెళ్ళిగోలే రాకుండా వుండేది. కాక, రెండు తెగలుగా వుండడానికి బదులు మూడు తెగలుగానో, నాలుగు తెగలుగానో మనుషులుగూడా వుంటే ఏమైవుండేదో (కొన్ని పుర్రుగులలో ఇలాగే మూడురకాల పురుగులుంటాయి.)

అంతటితో తీరిపోలేదు; ఈ ఆడ తెగ అంతా ఒక కోస్తానూ మగ తెగ అంతా ఇంకొక కోస్తానూ - చాలా దూరంగా - పడివుండినా ఒకలాగా జరిగేది. కాని అలా లేదు. ఆడ మగ తెగలు రెండూ కలిసి మెలిసి ఒక్క దగ్గరే వుండడం తటస్థించింది. అందువల్ల సంపర్కాలూ, సంబంధ బాంధవ్యాలూ తప్పవు.

అంతేకాదు; ప్రకృతిలో ఒక రహస్యంవుంది. తన చెట్లూ చేమలూ, పురుగులూ, మృగాలూ, మనుష్యులూ అన్ని జాతులూ నశించకుండా వుండాలి. ఆ జాతులు, అలా పారంపర్యాభివృద్ధి పొందుతూ ఎడతెరిపి లేకుండా వుండాలి. అదే ప్రకృతిలోని ఆత్మసంరక్షణ లేక జాతి సంరక్షణ అంటారు. ఇప్పుడున్న పులులు అన్నీ చచ్చిపోయేసరికి, కొత్త పులులు కొన్ని ఉండాలి. పులిజాతి పోకూడదు-అంటే ఏదో ప్రళయం వంటి కారణం లేకుండా వున్నప్పుడు. మామిడిచెట్టు అన్నది లేకుండా వుండకూడదు; అంటే కొత్త మామిడిచెట్లు పుడుతూనే వుండాలి.

సృష్టికి కానీ, ప్రకృతికిగానీ, ఈ జాతి సంరక్షణే ప్రధాన కార్యం. దీనికోసమే జీవితం అంతా. తినడం, నిద్రపోవడం యిలాంటి పనులన్నీ ఈ జాతిని నిలబెట్టడానికే సాధనాలు. చెట్టు పెరగడం పువ్వు కలగడానికి, పువ్వు కలగడం అంతా పండు పండడానికే. పండు విత్తనమయి మళ్ళీ చెట్టు పుట్టించడానికే. ఇది ప్రకృతి జాగ్రత్త. ఈ పనిని ప్రకృతి

దయాదాక్షిణ్యం లేకుండా సాగిస్తుంటుంది. ఎక్కువగా సాగిస్తుంది. ఇన్ని మాటలెందుకు? పుట్టించడమే ప్రకృతి పని.

ఆ పని నిర్విఘ్నంగా సాగడానికి తీసుకోవలసిన జాగ్రత్తంతా ప్రకృతే తీసుకొంటుంది. కదలడానికి వీలు లేకుండా ఒక్కదగ్గరే వుండే చెట్లు చేమలు పుడుతూవుండడానికి తగిన ఏర్పాట్లు చేసింది. జీవ జంతువులు పుడుతూ వుండడానికి కొన్ని ఉపాయాలు చూపించింది. ఈ ఉపాయమే ఆడా, మగా జతకట్టడం. జతకట్టడమనే అందాం; సంయోగం, సంభోగం, సంగమం ఇలాంటివన్నీ పెద్దల మాటలు - బూతులయిపోయాయి గూడాను. జతకట్టడం అన్నమాట నిజాయితీ ప్రకృతిమాట.

తిన్న తిండి అరిగిపోయినప్పుడు ఆకలి వేస్తుంది. అలసిపోయిన తరువాత నిద్రవస్తుంది. అలాగే తగినంత బలం కలిగిన తరవాత జతకట్టే బుద్ధిపుడుతుంది. తప్పదు; అప్పుడు జంతువు జతకట్టి తీరాలి. అదొక ఉద్రేకం; ఆ ఉద్రేకాన్ని ఏ జంతువూ ఆపదు. బుద్ధి వున్నవాడు ఎవ్వడూ ఆపడు గూడాను - ప్రకృతికి వ్యతిరేకంగా నడవాలంటే తప్ప.

ఎందుకు తిన్నావు అంటే, ఆకలివేసింది కాబట్టి అంటాడు. ఎందుకు నిద్రపోయావు అంటే నిదరొచ్చింది కాబట్టి అంటాడు. అలాగే ఎందుకు జతకట్టావు అంటే అది లేకుండా ఉండలేకపోయాను కాబట్టి అంటాడు.

కారణాలు, సమన్వయాలు వాడికి లేవు. ప్రకృతి సూత్రాలనుబట్టి ముక్కుకు సూటిగా పోవడమే వాడిపని. అందుకే జడకట్టడం. ఆ జతకట్టడంలో వేరే ఆలోచన లుండవు. ఇష్టము అయిష్టముతో పనిలేదు; వయసుతో సంబంధంలేదు; రూపం, గుణం ఇటువంటి వాటితో ప్రమేయంలేదు. ఎందుకు జతకడుతున్నాడో అన్నదానితో జోక్యమేలేదు. అది ఒక ప్రకృతి కార్యం. చేయక తప్పని పని.

ఈ గుణాలు ప్రకృతిలో వుండడం చేతనే పెళ్ళి అన్నది వచ్చిందంటారు కానీ, దీనికి కొంత చిక్కుంది. జతకూడే బుద్ధి ఎప్పుడో ఒకప్పుడు కలిగే ఉద్రేకం. అది అట్టే కాలం వుండేదికాదు. త్వరలో తీరిపోయే ఉద్రేకం. అటువంటి దానికోసం ఎల్లప్పుడూ వుండే పెళ్ళి

ఎలాగ కలుగుతుంది? ఎందుకు కలగాలి? జంతువులలోగూడా ఈ జతకట్టడం వుందే-అవి ఎందుకు పెళ్ళిచేసుకోవు? ఎల్లప్పుడూ కలిసి ఎందుకుండవు? వాటిలో జతకూడిన తర్వాత కొన్నాళ్ళకు మగదాని దారి మగదానిది; ఆడదాని దారి ఆడదానిది కదా! మొదట మొదట్లో మనుషుల సంగతి అంతే కదా! కాబట్టి జతకట్టడానికీ పెళ్ళికీ చాలా వ్యత్యాసం ఉంది. జతకట్టడం ప్రకృతి పని; పెళ్ళి అన్నది మన పని- ప్రకృతితో సంబంధంలేనిది.

జతకూడడంవల్ల సంతానం కలిగింది కదా! అది జాతి సంరక్షణ కదా! అందుచేత పెళ్ళి అవసరం అయింది కాదా! అని అడగవచ్చును. సంతానం కలగడం అన్ని జంతువులలోనూ ఉంది. కాని, పెళ్ళిలాంటిది ఏదీలేదు. అసలు జతగూడడానికీ సంతానానికీ సంబంధం ఉందన్నమాటే. మొదటి మొదటి మనుష్యులకు తెలుసునో తెలియదో! అది చాలా పెద్దరగడ! దాన్ని గురించి ముందు ముందు ఆలోచిద్దాం. ఇప్పటికి సంతానం సంగతి. కలిగింది కలిగినా, అది ఆడ తెగ పని. పాలు ఇవ్వడం, పెంచడం ఇలాంటిది ఆడదానివంతు. కాబట్టి, సంతానం పెరిగినంతవరకూ ఆడది దానితో ఉండాలి; కాని మగవాడెందుకు? వీడెలా వచ్చాడు ఈ జట్టులోనికి?

కొన్ని పక్షులలోనూ, కొన్ని జంతువులలోనూ సంతానం పెరిగినదాకా ఆడా మగా కలిసి జాగ్రత్త తీసుకోవడం కనబడుతుంది. ఇదయినా చాలా చాలా అరుదు. లక్షజాతులలో ఒకజాతి ఉంటే ఉండవచ్చును. ఆ జాతిలోనైనా, ఆ కలిసి జాగ్రత్తగా వుండడం, ఆ సంతానం పెద్ద అయినంతదాకే. తర్వాత ఎవరిదారి వారిది. మళ్ళీ కొత్తజోడి, కొత్త సంతానం. అంతా కొత్తే. పెళ్ళిలాంటిది ఏది?

మనుష్యులలో మనసులు కలుస్తాయంటారు గాబోలు! అది ఇటీవలి మాట. బూటకం. ఆనాటిది కాదు. డబ్బిచ్చి కొనుక్కున్నప్పుడూ, ఎత్తుకొని వచ్చినప్పుడూ, ఇంటి అందరికీ ఒక్క పెళ్ళాన్నే చేసుకున్నప్పుడూ, తల్లి తండ్రులు పెళ్ళి చేసినప్పుడూ, మనసులు కలియడానికి అర్థం ఏమయినా ఉందా?

మనసులనీ, ప్రేమలనీ అనడం నిన్న మొన్నటి మాటలు. మానవ చరిత్ర ఆరంభంలో వీటికి జాగా లేదు. ఆ ప్రేమా ఈ ప్రేమా సంగతి ఎందుకు? అసలు మాంచి గట్టిదన్న మాతృప్రేమ సంగతికూడా ఇంతే. "కన్నకడుపు" భావం అన్నది ప్రకృతి సిద్ధాంతం ప్రకారం, అంటే జాతి సంరక్షణ కోసం - జరిగినంతవరకు ఉంది. ఆపైని లేదు.

గుడ్లనో, శిశువునో కాపాడడానికి తల్లి హోరాహోరీగా పోరాడుతుంది. ఆత్మసౌఖ్యాన్ని గూడా మరిచిపోతుంది. నిజమే. కాని అది ఏమిటి? పెద్ద పేరులకు పోకుండా చూస్తే, అది ప్రకృతి విధించిన నిర్బంధన. తప్పనిసరి. జాతి సంరక్షణకోసం ఏర్పడ్డ ఒక విధి. అంతేగాని, ఈ జంతువులోని ఒక గొప్పగుణం కాదు. దీనికి ప్రేమ అనీ, మనసు అనీ మనం పెట్టిన పేరులు. చెట్లలోనూ గూడా పువ్వుకు దెబ్బతగలకుండా మొగ్గచుట్టూ గట్టి బెరడులాంటి వృంతదళా లుంటాయి. కాయలోని విత్తనం చెడకుండా పైన గట్టి తోలుంటుంది. అదిగూడా బిడ్డమీది ప్రేమే ఐతే, కొబ్బరిచెట్టుకున్నంత మాతృప్రేమ మరొక దానికి లేదని చెప్పాలి. రెండించీల మందంగా చుట్టూ పీచుతో కాపాడుతుంటుంది. గచ్చపొదకున్నంత "కన్న కడుపు" మరొక దానికి లేదనాలి.

ఇలాగా చెప్పతుంటే కొంత కటువుగానే ఉంటుంది. నిజమే. కాని పూర్వచరిత్రలు చూస్తే మాత్రం ఈ మాట నిజమని గట్టిగా తేలుతుంది. ఎన్ని ఎన్ని జాతులలో ఆడపిల్ల పుట్టినప్పుడు, తల్లి ఆ పిల్ల ప్రాణాలు తీసివేస్తుంది. అమాంతంగా పీకె నులిపి చంపిన తల్లులు ఎన్ని జాతులలో ఉండేవారు కారు? ఆ రోజులలో సంఘానికి మగపిల్లలు కావలసి వచ్చినప్పుడు పుట్టిన ఆడపిల్లల నందరిని చంపేవారు. ఆడపిల్లలు కావలసినప్పుడు మగపిల్లవాడు పుడితే పీక నులిమేవారు. ఇందులో ఆడది గూడా చేయి చేసుకొనేది. ఇది చరిత్రలోని సత్యం. ఆ రోజునాటి నిజం. కన్నబిడ్డలను కడుపునిండుగా తిని తృప్తి పొందే జంతువు లున్నాయి. బిడ్డలంటే ఎలాంటివో తెలియని జంతువులూ ఉన్నాయి.

ఇటీవల మనం నాజూకు మీరిపోయాము. ప్రేమ అని దానికి ఒక స్థానం కల్పించాము. అది వున్నట్టు ప్రవర్తించడం ఒక ఆచారమయి పోయింది. అది లేనట్టు కనబడడం పెద్ద దోషం, ఘోరపాపం అన్న

బుద్ధి వ్యాపించిపోయింది. ఆ ఆచార బలంవల్ల ఇప్పుడు అందర్నూప్రేమ చూపించేవారే. ఆ ప్రేమకోసం త్యాగం చేసేవారే. కాని ఆ రోజులలో మాత్రం ఆ మాటే లేదు. నీ బిడ్డను ప్రేమిస్తున్నావా అని ఒక తల్లిని ఆ. రోజులలో అడిగినట్లయితే, అది తెల్లపోకతప్పదు. అంటే ఏమిటో దానికి తెలియదు.

అలాగే ఆ రోజులలో పెళ్ళి చేసుకున్న మగవాడినిగాని, ఆడదానిని గాని వాళ్ళ ప్రేమ సంగతి అడిగితే, అదేమిటో తెలియక అవస్థపడేవారు. లేదా, ఇలాంటి అసందర్భపు ప్రశ్న అడిగినందుకు చావగొట్టనయినా కొట్టేవారు. కాబట్టి మనసులు కలవడం-రెండు వైపులా సుమండీ-ప్రేమ అన్న మాటలు పెళ్ళిని సమర్థించలేవు.

జతగూడడం పెళ్ళికాదు. సంతానం అన్నది ఆడదాన్ని కట్టిపడవేయ వచ్చును గాని మగవాడిని ఈడ్చుకు రాలేదు.

# స్త్రీ పురుష సంబంధం

మగవాళ్ళూ ఆడవాళ్ళూ ఒక్కదగ్గరే కలిసిమెలిసి ఉంటారు. మనుష్యులలో జతగూడడం అన్న మహోద్రేకమయిన గుణం ఒకటుంది. ప్రకృతిలో ఉన్న జంతువులు, పక్షులు, పురుగులు, ఆఖరికి పూవులుగూడా జతగూడక తప్పదు. అది మహా స్వభావసిద్ధమైన పని. మనుషులు గూడా ఆ పనే చేస్తారు. చేయక తప్పదు. అది ఒకరి ఇష్టంమీద ఆధార పడిన విషయం కాదు. ప్రకృతి సూత్రం. జాతిని నిలిపే కిటుకు. దానికి అడ్డు అన్నది లేదు అని తెలుసుకున్నాము కదా!

ఈ జతగూడడంలో ఇప్పుడు చాలా నియమాలు వచ్చాయి. ఇష్టం అయిష్టం, అందం చందం, ఆచారం గౌరవం-ఇలాంటివి ఇప్పుడు అనేకం ఆలోచిస్తారు. కాని, ఆ అనాది రోజులలో మనుష్యుల ప్రవర్తన, దగ్గర దగ్గర జంతువుల ప్రవర్తనతో సమానంగానే ఉండేది. జంతువులలో ఎంచుకోవడం అన్నది లేనట్టే, మనుష్యులలోను జతగూడడంలో ఎంచుకోవడం ఉండకుండానే ఉండాలి. విచ్చలవిడిగా, అంటే, ఆ ఉద్రేకం కలిగినప్పుడు, విహరించి జతగూడడమే జరిగేది. వావి, వరుస, నిషేధం, ఆంక్ష-ఇలాంటివి ఏవీ వుండటానికి వీలులేదు. అవి వుండేవి కావు గూడాను. కామవాంఛ కలిగినప్పుడు జతకూడడమే సహజ కార్యం.

సృష్టికి ఆరంభ దినాలలో గూడా మానవజాతి ఇంత అనాచారంగా ఉండేదంటే కొంతమంది ఆచారవంతులకు ఇప్పుడు మనసు నొస్తుంది. ఈ మడిగుడ్డలవారు సహించలేరు. మనుషులు ఎప్పుడూ అంత అనాచారంగా ఉండగలిగి ఉండరనే వారి ఉద్దేశం.

ఈ ఉద్దేశంతో పాపం, తెలివితేటలన్నీ ఉపయోగపరిచారు. అంత విచ్చలవిడిగా బతకడం అన్నది ఎప్పుడూ లేదని చెప్పడానికి ప్రయత్నం చేశారు. సిద్ధాంతాలకు గూడా దిగారు. కాని, నమ్మడం ఎలాగ? ఇప్పటికి గూడా - ఇన్ని లక్షల సంవత్సరాలు గడచిపోయిన తరవాతగూడా - ఆ విచ్చలవిడి విధానానికి చిన్నెలు కనబడుతూనే ఉన్నాయే. మరొక విధంగా

వాటిని సమర్థించడానికి వీలే కనబడదే. ఆచారాలు ఎలాగ క్రమక్రమంగా వికాసం పొందుతూ వుంటాయో తెలిసిన శాస్త్రవేత్తలు అంతా అంగీకరించినా ఈ "మడిగుడ్డలు" అంగీకరించ వెందుకు?

అది వారికి పుర్రెనుపుట్టిన బుద్ధి; అంత సులభంగా పోదు. ఇప్పుడున్న వివాహవిధానాలే ఆదినుండీ వస్తున్నాయని అనుకుంటారు. రాముడికి సీతకు జరిగిన పెళ్ళి మన పెళ్ళిళ్ళలాగే జరిగిందని ఇప్పటికీ వాదిస్తూనే ఉంటారు. పద్యాలుగూడా వ్రాసి ప్రబంధాల కెక్కిస్తారు. ఇప్పటి పెళ్ళిళ్ళ వల్ల చాలా నష్టం కలుగుతుందయ్యా అంటే ఒప్పుతారా? శ్లోకాలు ప్రమాణం చూపించి, అదే మంచిదంటారు. రంకుతనం ప్రబలిపోతూ వుందని చెప్పండి, పాతివ్రత్యం చట్టుబండలవుతూ వుందని నిరూపించండి; అన్ని విధాలా వ్యభిచారాన్ని ఈ కుంకుమబొట్టు కప్పిపెడు తున్నదయ్యా అని విప్పిచెప్పండి. పుట్టీపుట్టని బిడ్డలు ఎందరెందరు ఘోరమరణాలకు పాల్పడుతున్నారో రుజావు చెయ్యండి-ససేమిరా! ఈ పెళ్ళిళ్ళే మంచివంటారు మన మడిగుడ్డలు. అది తప్పించి ఒక్క అడుగు వేస్తే, ఆంక్ష పెడతారు. అట్టహాసం చేస్తారు. పుర్రెనపుట్టిన బుద్ధి! ఆ బుద్ధి అంత బలీయంగా వున్నవారు సృష్టి ఆరంభదశలో మనుషులు జంతువులలాగనే ప్రవర్తిస్తూ ఉండేవారంటే ఒప్పుకుంటారా? ఎంతమాట? పరువు నష్టం కాదూ!

వీరేమనినా, పరిశోధన ఆగదు, సాగిపోతూనే వుంది. ఆరంభదశలో మనుష్యులు విచ్చలవిడిగా సంచరించేవారు. ఇప్పటికీ ఆఫ్రికా పిగ్మీలలో మగవాళ్ళూ ఆడవాళ్ళూ యథేచ్ఛగా వర్తిస్తారు. కట్టుకోవడం (పెళ్ళి) అంటే ఏమిటో వాళ్ళెరగరు. ఆఫ్రికాలో కొన్ని జాతులలో ఒకడు ఏ స్త్రీతోనయినా పోవచ్చును. టిబెట్‌లోనూ, మధ్య ఇండియాలోనూ, నీలగిరులలోనూ కొన్ని జాతులలో పెళ్ళి అని, కట్టుకోవడం అని, శాశ్వతంగా కలిసి ఉండడం-ఇలాంటివి కనబడవు. బోర్నియోలో కొన్ని జాతులలో పెళ్ళి అన్నదే కనబడదు; స్వేచ్ఛావిహారమే

మలాకాలో ఒక జాతి వుంది. దానిలో ప్రతి ఆడదీ, వరసపెట్టి, ఆ గుంపులో వున్న ప్రతి మగవాడితోనూ వుండాలి. ఒక ఆవర్తం అయి, అందరివంతూ అయిన తరవాత, ఆ ఆడది మరొక ఆవర్తం ఆరంభిస్తుంది.

రష్యాలో, చాలాకాలం పూర్వం, ప్రతి మగవాడూ ప్రతి ఆడదాని తోనూ జతగూడడానికి అవకాశం వుండేది. ఆడదానికి ఒక భర్త అన్న నియమం లేదు.

మధ్యధరా సముద్రతీరంలో అనేక జాతులలో ఈ జతగూడడం అనేది కేవలం స్వేచ్ఛమీదనే ఆధారపడి వుండేది. నియమం అన్నది లేదు. అందరు స్త్రీలూ అందరు పురుషులకూ అందుబాటులోనే ఉండేవారు.

ఇలాంటి నిదర్శనాలు లక్షలకొద్దీ చూపించవచ్చును. జతగూడడానికి ఒక నియమం అన్నది లేకుండానే ఉండేది అని అంగీకరించడం తప్పని విధి. కాదని వాదించడానికి పూనుకున్నామా, రుజువుమీద రుజువులు, దృష్టాంతాలమీద దృష్టాంతాలు వర్షం కురుస్తాయి. ఆఖరికయినా అంగీకరించక తప్పదు. మడి విడిచిపెట్టక తీరదు.

మాటలకు భయపడడం ఎందుకు? సృష్టి నాటినుండి నేటి దాకా ఒక్కలాగే ఉందని అనుకోవడం చాలా పొరపాటు. పరిశీలనలో అది చాలా ప్రతిబంధకం. అందులోనూ, మన సంఘ వ్యవహారాల పరిశోధనలో ఈలాంటి భావం ఉండనేకూడదు. అందుచేతనే ఈ విషయం ఇంత విపులంగా చెప్పవలసి వచ్చింది.

మరొక్క సంగతికూడా ఉంది. విచ్చలవిడిగా ఉండేవారు అని అనగానే, ఏదో కొంప మునిగిపోయినట్టు భావించడం ఎందుకు? ఇప్పటి చూపుకి అది అసహ్యంగా కనబడవచ్చును. కాని అప్పటి వారికి అది సదాచారంగానే కదా ఉండేది! అలా అందరికీ అందుబాటులో ఉండకుండా, ఆ రోజులలో ఏ ఆడదయినా, ఊహూ! అని ముడుచుకొని కూర్చున్నట్టయితే దానిని పరమ పాపాత్మురాలుగా భావించి, ఆనాటివారు-ఆడవారూ మగవారూ అందరూ-దానిని ముక్కలు ముక్కలుగా నరికి కాకులకు వేయకుండా ఉంటారా? అనాచారపు ముండ అని అనకుండా ఊరుకుంటారా?

ఒక్క ఉదాహరణ: గోమూత్రపానం అని మహా నిష్ఠతో అతి పవిత్రంగా పాటించేవారు ఇప్పుడుగూడా ఎంతమంది లేరు? కొంచెం నాజూకుదేరిన విద్యావంతులు ఈ పనిని ఎంత అసహ్యించుకుంటారు? విదేశాలకు వారు వెళ్ళినప్పుడు ఎవరయినా ఈ ఆచారం గురించి అడిగితే,

"ఆవు హూతీ మీరు తాగి కుంటారా" అని ఎవరైనా అంటే, ఎంత తలవంపులుగా భావిస్తారు? ఎలాంటి విపరీత సమాధానాలు చెప్పబోతారు? మరి ఇరవై సంవత్సరాలయినప్పటికి ఈ గోమూత్రం కేవలం ఆవు వుచ్చ అయి అసహ్యం కాకపోతుందా? అప్పుడు ఈ ఆచారాన్ని ఎంత గౌరవిస్తారో చెప్పండి. కాని ఈనాడో! అది మహా పవిత్రమయిన పని. చేసిన పాపాలన్నీ ఆ గోమూత్ర ప్రభావంతో కడుక్కుపోతాయి. స్వర్గానికి అదే దారి చూపిస్తుంది. అంత సదాచారం. అలాగే, ఆ రోజుల స్త్రీ పురుషుల వ్యవహారాలు గూడాను అనుకోవాలి.

కాబట్టి, స్త్రీ పురుషులకు సంబంధం ప్రకృతిలోనే ఉంది. దానిని పెళ్ళి తెచ్చి పెట్టలేదు. పెళ్ళి అన్నది లేకపోయినా, ఈ సంబంధం ఉంటుంది. ప్రపంచం సాగుతుంది. అంటే ప్రకృతి జీవనానికి పెళ్ళి అన్నది కేవలం అప్రధానం. జాతి రక్షణకు పెళ్ళి ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే. సృష్టికి ఎలాంటి నష్టమూ లేదు.

అంటే అర్థం ఏమిటి? దృష్టిని గాని, లేక దేవుడి దృష్టిని గాని, పెళ్ళి అన్నదానికి ఒక స్థానం లేదని కదా! ఎవరో, ఎప్పుడో తెచ్చి పెట్టిన విషయం ఈ పెళ్ళి. నిజం ఆలోచిస్తే, ఈ పెళ్ళి ఏమిటంటే-స్త్రీ పురుషుల సంబంధాన్ని కల్పించినది కాదు; వీరిద్దరికీ ప్రకృతిలో ఉన్న సంబంధాన్ని కొంత నిరోధించేదే పెళ్ళి అని అనాలి. అందరకు అందుబాటులో ఉండే ఒక ఆడదానిని ఒక్కడికో, ఒక్క గుంపుకో మాత్రం అందుబాటులో ఉండేటట్టు నిరోధించిందే పెళ్ళి. అందరు ఆడవాళ్ళకీ ఉపయోగకరంగా ఉండే ఒక మగవాడిని, ఒక్క స్త్రీ కో, ఒక్క జట్టు స్త్రీ లకో మాత్రం పనికివచ్చేటట్టు చేసింది పెళ్ళి. అంటే స్త్రీ పురుషుల కుండే సంబంధాన్ని నిర్బంధించి, నియమాలు పెట్టి, సంకుచితంగా చేసేదే పెళ్ళి అన్నమాట. అది కొంచెం జ్ఞాపకముంచుకోవాలి.

అనేక జాతులలో బాలికలు పెళ్ళి అయినంతవరకూ, జాతిలో ఉన్న పురుషులతో యథేచ్ఛగా జతగూడవచ్చును-చాటుగా మాటుగా కాదు-బాహాటంగా. పెళ్ళి అయిపోయిన తరవాత ఆ తిరగడం కట్టిపోతుంది. కొన్ని దేశాలలో ఆడది ఒకడిని కట్టుకున్నంతవరకూ అందరికీ అందుబాటులో ఉంటుంది. మళ్ళీ ఆ భర్త చనిపోయిన తర్వాత-

తిరిగి పెళ్ళి అయినంతవరకూ—అలాగే అందరికీ ఉపకరించి ఉంటుంది.

ఇలాగా నిరోధించడం, తక్కినవాళ్ళకు కొంచెం చికాకుగా ఉండవచ్చును గదా! అందుచేతనే కాబోలు, కొన్ని జాతులలో ఒక ఆచారం ఉంది. ఆడది ఒక్కడిని కట్టుకోడానికి ముందు—అంటే పెళ్ళికి ముందు—ఆ జట్టులో ఉన్న అందరు మగవాళ్ళ దగ్గరకూ పోవాలి అన్న సనాతనాచారం ఉంది. అలాగే, పెళ్ళికొడుకు పెళ్ళికి ముందు, పెళ్ళి రోజునకూడా ఇతర స్త్రీలతో కాలక్షేపం చేస్తూ ఉంటాడు. ఆ వేళతో ఇతర స్త్రీ , పురుషుల హక్కులు పోతాయి; నిర్బంధం ఏర్పడుతుంది.

పెళ్ళికి ముందుండే ఈ స్వేచ్ఛను అన్ని దేశాలవారూ అంగీకరించారు. ఆ స్వేచ్ఛా విహారంలో ఆడది సంపాదించిన ధనం ఏదయినా ఉంటే, అది పెళ్ళయిన తరువాత దంపతులు కాపరం చెయ్యడానికి ఉపయోగించేవారు లేదా, దేవాలయాలకు దానం చేసి పేర్లు చెక్కించుకొనేవారు.*

ధనం సంగతే కాదు. పెళ్ళి కావడానికి ముందు ఆడదానికి పిల్లలు గూడా పుట్టవచ్చును. వీళ్ళనే కానీను లంటారు-కర్ణుడు మొదలయిన మహామహులు. ఈ పిల్లలను గురించి మనలోనూ శాస్త్రాలున్నాయి. పెళ్ళి మగడు అంగీకరించవచ్చును. వీళ్ళని అంగీకరించకపోవచ్చును. అందుచేత మన ధర్మశాస్త్రకర్తలు శాస్త్రం ఏర్పాటు చేశారు:

**కానీ నుండగు కన్యా**
**సూనుడు : మాతామహునకు సుతుండంద్రతనిన్**
**వాని జనని ఒరునకు నా**
**లైనను, వాడతని పూతుడగు నిక్కముగన్**

అని విజ్ఞానేశ్వరీయంలో ధర్మసూత్రం. దీనినిబట్టి పెళ్ళికాక పూర్వము పుట్టిన పిల్లలను గూడ శాస్త్రం అంగీకరించిందనాలి.

ఈ సంబంధం ప్రకృతిలోనిది. స్వేచ్ఛ మొదటిది. దానికి నిరోధం తెచ్చి పెట్టినదే పెళ్ళి. ఇది ప్రకృతికాదు—మనుష్యులు చేసుకున్న కట్టుబాటు.

---

*(నా 'దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు' అన్న పుస్తకంలో ఈ విషయం కొంత వ్రాశాను.)

# పిల్లలకోసమా పెళ్ళి?

తినాలన్న బుద్ధిపుట్టినట్టే పుడుతుంది జతకూడాలన్న బుద్ధి. ఆ బుద్ధి ఆ కార్యంతో తీరిపోతుంది. మళ్ళీ ఆ బుద్ధి పుట్టినదాకా తినడు; జత కూడడు. అంటే, ఆకలికాని, కామము కాని తాత్కాలికంగా ఉండేవే కాని, శాశ్వతంగా-కాకుంటే చాలాకాలం-కట్టిపడవేసేవి కావు.

ఆకలి ఉంది కదా అని మనిషిని, తినమని, ఒక మేకతోనో, చెట్టుతోనో కలిపి కట్టి ఒకచోట పడవేయం. దానికి మనిషిగూడా అంగీకరించడు. కామం ఉంది కదా అని ఆడదానిని మగవాడితో కట్టి పడవెయ్యాలని ఎవరు అనుకుంటారు? అలా అనుకొనేవారే అయితే, ఆరంభదశలో ఆ విచ్చలవిడి విహారాలు ఎలాగా వస్తాయి? కాబట్టి, కట్టుబడి ఉండటానికి కామం కారణం కానేరదు. పెళ్ళి అన్నది కట్టుబడి ఉంటేనే అవుతుంది.

బిడ్డలకోసం కట్టుబడాలంటారు. బిడ్డలకోసం కట్టుబడి ఉండడం జంతువులలోనూ, పక్షులలోనూ ఉంది. నిజమే. కాని, ఎలాగుందో చూడండి. ఆడవాటికే ఆ కట్టుబాటు; అదిగూడ బిడ్డ పెరిగినంత వరకే. అంతేగాని ఎక్కువ లేదు. కాని మగ జంతువు ఈ కట్టుబాటులోనికి రావడం ఎందుకు? ఎలాగ? మన పెళ్ళిళ్ళలోలాగా ఇంతకాలం ఉండడం దేనికి?

ఈ ప్రశ్నలకు బిడ్డలతో సంబంధించిన జవాబు చెప్పలేరు. ఎక్కడో ఒకరకం కోతిజాతిలోనూ, ఒకటి రెండు రకాల పిట్ట జాతులలోనూ, మగది గూడా కొంత కట్టుబడి ఉంటుందంటారు. అంతమాత్రంతో తీరిపోతుందా మన పెళ్ళి కట్టుబాటు? ఆ ఒకటి రెండు జాతులలో తల్లికి కొంత సదుపాయం కలిగినంతవరకే ఆ మగది కొంచెం కనిపెడుతూ ఉంటుంది. ఆ తరువాత ఆ తల్లే చూచుకోవాలి సంతానం జాగ్రత్త-అది గూడా బిడ్డ కొంచెం పెద్దదయినంతవరకే. ఇది మన పెళ్ళి వంటి సంగతే అంటే, నవ్వక తప్పదు.

సంతానం వల్ల కలిగిన సంసారంలోనికి ఆడది రావడం ప్రకృతి వల్ల. దీనిలోనికి మగవాడిని ఈడవడానికి ప్రకృతి బలం చాలదు. అంటే మళ్ళీ ఒకసారి-పెళ్ళి ప్రకృతి శాసించిన పనికాదు; మనుష్యులు తెచ్చి పెట్టింది. ఏ కారణం మీద తెచ్చి పెట్టారో, ఎలాగ దీనిని ప్రవేశపెట్టారో, అది ఎలాగ ముదిరి, మొసలి అయి పట్టుకుందో ముందు ముందు చూస్తాము.

కాని, మన ఆచార్యులవారు అంతవరకు ఊరుకుంటారా? అపసవ్యపు ముండా ప్రశ్న అడిగామని ఆగ్రహం వస్తుంది. జందెం పెనవేసుకుంటూ శాస్త్రాలు చూపుతారు-నిన్న వ్రాసినవీ, మొన్న వ్రాసినవీ; అందులోనూ తెలిసిన మొఱ్ఱ కొంత, తెలియని మొఱ్ఱ పదింతలు.

పుత్రుడంటే ఒక్క తల్లికేనా, తండ్రికి మాత్రం కాడా అంటాడు ఆచార్యుడు. పుత్ అని పెద్ద నరకం ఉందంటాడు; ఆ మహా నరకంలో పడకుండా రక్షిస్తాడు కాబట్టే, పుత్రుడు అంటాడు. కాబట్టి మగవాడికి గూడా పుత్రుడు వుండవలసిందే అని గద్దరిస్తాడు ఆచార్యవర్యుడు.

ఇక్కడొక చిన్న విషయం మనవి చేయవలసి ఉంది. పుత్రుడు అంటే "పుత్" అన్న పేరు గల నరకం నుంచి-ఆ నరకంలో పడకుండా-రక్షించేవాడు అని వ్యుత్పత్తి చెప్పుతారు. నరకములు ఇరవై యొక్కటి ఉన్నాయని మనమహాపండితులు-స్వయంగా చూచినట్టు-నిర్ధారణ చేశారు. ఆ జాబితా ఎన్నిసార్లు పరికించి చూచినా ఎక్కడా పుత్ అన్న (పున్నామ) నరకం కనిపించదు.

ఎందుచేత? ఆ మహాశాస్త్రజ్ఞుల నాటికి 21 మాత్రమే ఉండి, ఇటీవల మన పురోహితులకు ఇది ఇరవైరెండవదిగా కనిపించిందా? కాక, ఈ ఇరవై యొక్క నరకాల పేరులలో ఏదో ఒక పేరుకీ ఈ "పుత్" అన్న పేరుకీ బదరీ బాదరాయణ సంబంధం ఉందని వ్యాఖ్యానిస్తారా?

ఇదీకాక, హిందువులందరూ పుత్రవంతులయి పోయినందువల్ల ఆ పున్నామ నరకానికి పనేమీ లేకపోయినందున ఆ నరకాన్నే పూర్తిగా రద్దుచేసి మూసివేశారో మన ప్రబుద్ధులే చెప్పాలి.

ఆచారిగారికి చెప్పవలసింది అట్టేలేదు. ఇదంతా ఇటీవల వచ్చిన గోల. ఆచార్యులంటూ కొందరు వచ్చిన తరువాతనే మనుష్యులకు నరకం,

దానిలోని రకాలూ, అన్నీ కనబడ్డాయి. అంతకు మునుపు నరకం అంటే ఆ మనుష్యులకు తెలిసేదే కాదు. అప్పటి అమాయకపు రోజులలో నరకమనేదే లేదేమో! ప్రకృతిలో పుట్టి, ప్రకృతి ప్రకారం ప్రవర్తించినప్పుడు నరకం ఎందుకు? కాల్చనా? ఈ నరకాలన్నీ ఆచార్యుల వారితోనే దిగుమతి అయ్యాయి. మొదటి మొదటి వారికి ఈ సోదే లేదు.

మరొక సమాధానం చెప్పుతారు; పుత్రాభివృధ్యర్థం అనీ, వంశాభివృధ్యర్థం అనీ పెళ్ళి చేసుకోవాలంటారు. అంటే పెళ్ళి చేసుకుంటే పిల్లలు పుడతారు. పిల్లలు పుడితే వంశం నాలుగు రోజులు నిలుస్తుంది; కాబట్టి పెళ్ళి చేసుకోవాలంటారు శాస్త్రిగారు.

ఇది చదువుకున్న తెలివితక్కువ. ఏమంటారా? మొదటి రోజులలో తెగ అంతా ఒకటే వంశం, గుంపు అంతా ఒకటే కుటుంబం. అందులో ఎవరికి పుట్టినా వంశాభివృద్ధే. ఏ మగవాడివల్ల పుట్టినా కుటుంబాభివృద్ధే. దీనికోసం కట్టిపడవేయటం ఎందుకు వస్తుంది?

ఇందులో ఒకచిన్నరహస్యంవుంది. హాస్యం అనుకోగలరు. కాదు. సంతానానికి మగవాడి సంపర్కం వుండాలా అని ఆ రోజులలో అడిగితే పక్కున నవ్వేవారు. మగవాడు ఆడదానితో జతకూడినందువల్ల పిల్లలు పుడతారన్న సంగతే ఆ రోజులవారికి తెలియదు. వారి దృష్టిని జతగూడడం వేరు, పిల్లలు పుట్టడం వేరు. అలాంటి రోజులలో పిల్లలకోసం పెళ్లి చేసుకునేవారంటే, ఎంత హాస్యాస్పదంగా వుంటుంది?

పురాతన మానవులకు సంతాన కారణం బోధపడదు. ఎప్పుడో జతకూడతారు. మరెప్పుడో సంతానం కలుగుతుంది. మనుషులలో నయినా, జంతువులలోనయినా, పక్షులలో నయినా, ఈ రెండు కార్యాలకూ వ్యవధి ఉంటుంది. కాబట్టి సంతానానికి ఆ జతకూడడమే కారణమని చప్పున గ్రహించలేరు. ఆ సంగతి గ్రహించడానికి చాలా తెలివీ, విజ్ఞానమూ కావాలి. అది అప్పటివారికి లేదు. వారి దృష్టిని జతకూడటం, సంతానం కలగడం అన్నవి వేరు వేరు కార్యాలు. సంబంధం లేనివి. అప్పటి మనుష్యులు తిన్నట్టు, తాగినట్టుగానే జతకూడేవారు. దానితో ఆ వేదన తీరిపోయేది. ఆ పనిగూడా మరిచిపోయేవారు. అంతేగాని దానితో ఈ సంతానాన్ని ముడిపెట్టలేకపోయేవారు.

ఇప్పటికీ అనేక "అనాగరక" జాతులలో ఈ అజ్ఞానం వుంది. పిల్లలు పుట్టడానికి ఏదో గాలి కారణం అంటారు. స్నానం చేస్తున్నప్పుడు ఏదో చేప కరిచిందంటారు. ఏదో ఒక కాయ పొరపాటున తింటే పిల్లలు పుడతారంటారు మరొక జాతివారు. ఒక రకం గడ్డితింటే బిడ్డలు పుడతారని ఒక నమ్మకం.

నవ్వకండి, మన లవకుశలో కుశుడి పుట్టుక సంగతి కొంచెం చూడండి. స్త్రీ పురుష సంయోగం అక్కరలేదనే వారి అభిప్రాయం. వారికే కాదు, మన పురాణాలు కొంచెం చూడండి. సద్యోగర్భాలూ, అయోనిజలు, పిట్టలు పుట్టించిన పిల్లలు, రజస్వలకాని బాలికలకు పుట్టిన పిల్లలు, ఏసుక్రీస్తులు, కర్ణులు వగయిరాలు ఎందరున్నారు కారు? కిక్కురుమనకుండా అవన్నీ నమ్మినవారేనా మనవారు? పాయసం ఇచ్చి పిల్లలు పుట్టించిన మహా ఋషులున్నారు.

మామిడి పండుతో రెండు చెక్కలుగా పుట్టిన జరాసంధులున్నారు. సూర్యోపాసన మంత్రంతో పిల్లవాడిని కన్న కుంతి వుంది. హ్రీం, ఘ్రీం అంటూ 1008 సార్లు ఒక మంత్రం జపించినంతమాత్రాన సంతానం పొందిన నారీమణు లున్నారు. దాక్షారామ భీమేశ్వరుని ప్రార్థన మాత్రం చేత భీమకవి పుట్టాడు-వితంతుకు, పతివ్రతకు కూడా ఏమో! ఈ కథలన్నీ నిన్నటిదాకా నమ్మినవారమే. సందేహించలేదు.

అంతేనా? చెవులలోనుంచి పుట్టిన పిల్లలను నమ్మాము. నీళ్ళు తాగినందువల్ల మత్స్యవల్లభుడు పుట్టాడంటే నమ్మాము. మనం నమ్మని దేది? ఎందుకు నమ్మాం? అది అసంభవం అనిపించలేదు కాబట్టి. ఆ కారణం చేతనే, పూర్వపు మనుషులకు సంతాన కారణం తెలియలేదు. జతకూడడానికీ, సంతానం కలగడానికీ సంబంధం ఉందని అనుకోలేదు. కాబట్టి సంతానం కోసం పెళ్ళి చేసుకొనేవారనడం వట్టి దబ్బర-మోసం.

సంతానానికీ, సంభోగానికీ సంబంధం లేదనే వారు ఇప్పటికీ అనేక దేశాలలో అనేక జాతుల వారున్నారు. వారంతా వట్టి అనాగరికు లంటారేమో! మనమేమి చేశాం మొన్న మొన్నటిదాకా? రామావతారం లోనూ, కృష్ణావతారంలోనూ, భగవంతుడు సాక్షాత్తుగా మానవుడయి

తిరుగుతూ వున్న నాగరిక దినాలలో ఆ అజ్ఞానమే కనబరిచాం. కాదంటారా?

అంతెందుకు? ఇప్పటికి మనకు తెలుసునా? చెట్లకు సంతానం కలగడానికి గూడా సంభోగం అవసరం అని ఎంతమందికి తెలుసును? పువ్వులలో మగ ఆడ జతగూడడం ఉందనీ, అది లేకపోయినట్టయితే కాయ కాయదనీ, అంటే, విత్తు కలగదనీ, ఎంథరం ఎరుగుదుము? ఎవరినయినా అడగండి; పువ్వులలోనుంచి కాయలు ఎలా పుడుతున్నాయి అని? ఎందరు చెప్పతారు?

ఇవి శాస్త్ర పరిశోధనలూ, విజ్ఞాన వికాసమూ, అంతా సర్వతో ముఖంగా సాగుతూ వున్న రోజులు; దూరశ్రవణం, దూరదర్శనం, వాయు విమానాలూ ఉన్న రోజులు, నాగరికత కొలువుచేసే దినాలు. ఇలాంటి రోజులలోనే పువ్వులు సంభోగిస్తున్నాయంటే నవ్వేవా రున్నారు. అలాంటప్పుడు, ఆ పూర్వపు రోజులలో, మనుష్యులు సంతానానికి సంభోగం కారణమని గ్రహించకపోతే తప్పా? వాడిని ఏమీ అనవక్కరలేదు. ప్రకృతికి వాడు ముద్దు బిడ్డ. అటువంటివాడు సంతానంకోసం పెళ్ళిచేసుకున్నాడంటే అసంభవం, నమ్మరానిమాట.

# పెళ్ళికి ముందు స్వేచ్ఛ

ఏ విషయం గురించయినా,.. దాని లోతుపాతులు తెలుసు కోవాలంటే, దృష్టి వెనుకకు మరలించాలి. పక్షపాతం అన్నది ఉండకూడదు. అభిమానం అన్నమాటే విడిచిపెట్టాలి. సత్యం గ్రహించాలన్న బుద్ధే ప్రధానంగా ఉండాలి. అసత్యం అవమానకరంగా ఉన్నాసరే, అసహ్యంగా కనిపించినాసరే. ఇంతకూ ఈ వేళ మనకు అసహ్యం అయిన వస్తువు ఆనాడు అందరూ ఆచరించే ఉండవచ్చునుకదా! ఈనాడు మనకు అవమానకరంగా కనపడ్డ సంగతి ఆ రోజులలో మంచి గౌరవంలాగా ఉండవచ్చును. అందుచేత మరేమీ ప్రమాదం లేదు.

అలాంటి నిష్పక్షపాత దృష్టితో చూచిన పరిశోధకులు చాలామంది ఉన్నారు. మానవ చరిత్రను మూలమట్టుగా ఆకళించారు. ఆరంభంలో మగ ఆడజాతులు జంతువుల లాగానే ప్రవర్తించాయని నిర్ణయించారు. జతకట్టే బుద్ధి పుట్టడం, ఇష్టం వచ్చినదానితో కలియడం జరుగుతూ ఉండేవి అని నిశ్చయించారు. వావి, వరుస, ఇది తగును, ఇది తగదు అన్న సూత్రాలు ఆ తరువాతను కలిగాయి అన్నారు. ఈ స్వేచ్ఛను నిరోధించి నియమించినదే పెళ్ళి అన్నారు.

అందరు ఆడవాళ్ళూ అందరు మగవాళ్ళకు జతకట్టడానికి అర్హులే. అందరు ఆడవాళ్ళూ పెళ్ళాలే అని గాని, అందరు మగవాళ్ళూ మొగుళ్ళే అనిగాని అంటే, నిజమే, వెగటుగా ఉంటుంది. కాని, చూడండి మన భాషలు:- సతి అంటే స్త్రీ; భార్య; ఆలు అంటే స్త్రీ; భార్య, వైఫ్ అంటే స్త్రీ; భార్య-స్త్రీ అంటేనే భార్య అని తేలుతుంది. అలాగే పురుషుడు అంటే మగవాడు, మొగుడు. అసలు తెలుగులో మొగవాడే మొగుడయాడు. ఈ మాటలూ వీటి అర్థాలూ ఒక్క భాషలో కాదు, దగ్గర దగ్గర అన్ని భాషలలోనూ ఉన్నాయి.

ఇంతేకాదు, తండ్రికి కొడుకుకి ఒకటే మాట. తల్లికీ కూతురికీ

ఒకటే పిలుపు. మగవారందరు కొడుకులుగాను, ఆడవారందర్ని కూతుళ్ళుగాను పిలిచే జాతు లున్నాయి. పురాతన- సనాతన అనే అందామా?-ఆచారాలు ఈ మాటలలో ఇమిడి ఉన్నాయి. కోపం తెచ్చుకుంటే ఎలాగ?

కాని, మనసొప్పదు. ఇప్పుడింత డాబుదర్పాలతో, నీతి నియమాలతో బతుకుతున్నాం. మనం అంతా అలాంటి రంకుజాతికి పుట్టిన సంతతే అనడం కొంత లజ్జగానే వుంటుంది. ఈ ఉద్దేశంగల పండితులు, విద్యాధికులు, విమర్శకులు కొందరు పరిశోధనలు చేశారు. వీరూ చాలా బుద్ధిమంతులే, కాని ప్రయోజనం ఏమిటి? ఒక అభిమానంతో సత్యాన్వేషణ చెయ్యబోయారు. ఈనాటి మడిపంచెను ఆనాటి స్త్రీ పురుషులకు చుట్టపెట్టడానికి ప్రయత్నించారు. ఆడ మగ కలయికలు అంత విచ్చలవిడిగా లేవు అని నిర్ధారణ చెయ్యడానికి ప్రయత్నించారు. తప్పించుకోవడానికి వీలులేనప్పుడు ఏదో మరొక కారణం చూపించాలని చూచారు. విచ్చలవిడి అనకండి-కొంచెం నియమ రహితం అనండి అన్నారు కొందరు. అల్పనియమంతో జతకట్టేవారు అని చెప్పవచ్చును అన్నారు మరికొందరు.

ఏదయితే నేమి? విచ్చలవిడి అని చెప్పినప్పుడు నీచ భావం ఉందా? నియమ రహితం అంటేనే అది లేదా? వెర్రి, నీచ, అనీచ భావాలు కాలాన్ని బట్టి మారుతుంటాయి. ఇన్నాళ్ళు కాఫీ హోటేలుకు పోవడం నీచం: ఇప్పుడది గౌరవం. మన మేమి చేయగలం? ఇప్పటి మన భావాలనుబట్టి అప్పటి వ్యవస్థ మారదు కదా!

విచ్చలవిడిగా ఆ రోజులలో ఉండేవారు అని చెప్పడానికి ఈ వేళను గూడా-అనేక జాతులలో-నిదర్శనాలు కనబడుతున్నాయి. అనేక జాతులలో ఆడది స్వేచ్ఛగా ఇతరులతో జతకడుతూనే ఉంటుంది. తప్పు లేదు. పిల్లలు పుట్టినా మంచిదే. ఆ తరువాతను ఎప్పుడో పెళ్ళి కావచ్చును. పెళ్ళయిన తరవాత మాత్రం ఆ ఆడది వ్యభిచరించ కూడదు. ఇదీ ఆచారం. మొదటి తిరుగుడు అంతా రహస్యంగా కాదు-బాహాటంగా, తల్లిదండ్రులకు తెలిసే. అలాగా స్వేచ్ఛగా తిరగకుండా ఉండడం దోషం గూడాను. పెళ్ళినాటికి బిడ్డగూడా ఉంటే మరీ గౌరవం.

చలిప్రదేశాలలోని ఎస్కిమోలలో, జగత్ ప్రసిద్ధి నొందిన గ్రీకులలో, నాగరక దేశమయిన ఇండియాలో, అమెరికాలో, ఆస్ట్రేలియాలో, ఆఫ్రికాలో, అంతటా ఈ విచ్చలవిడి లక్షణాలు కనబడతాయి. స్వేచ్ఛగా విహరించడం ప్రథమకార్యం. తరువాత పెళ్ళి చేసుకోవడం ఆచారం అయింది. ఆ పెళ్ళిలోనుగూడా కొన్ని లాంఛనాలు జరపాలి. నీలగిరులలో పెళ్ళి నిశ్చయించడానికి వచ్చిన పెద్ద (వయసులో పెద్ద) ఒక రాత్రి పెళ్ళి కూతురుతో కలిసి ఒక్క దుప్పటి ముసుగులో నిద్రపోవాలి.

ఆస్ట్రేలియాలో ఒక జాతిలో, పెళ్ళి చేసుకోడానికి ముందు, పెళ్ళికూతురు ఆ జాతి మగవారందరితోనూ వరసపెట్టి జతకట్టుకొని రావాలి. దీనికి అంత్యగా అవకాశం లేకపోతే శోభనంనాటి రాత్రి, పెళ్ళికొడుకుకు బదులు అతని స్నేహితుడొకడు పెళ్ళికూతురుతో ఉండాలి. దీనికి వారి భాషలో "కొత్త వస్తువుల తిండి" అంటారు.

ఆఫ్రికాలో పెళ్ళికూతురు పరుగెత్తిపోతూ ఉన్నట్టు, దానిని నలుగురు (పెళ్ళికొడుకు స్నేహితులు) వెంట తరుముతున్నట్టూ నటిస్తారు. కొంత సేపటికి పెళ్ళికూతురు దొరుకుతుంది. ఆ నలుగురు దానితో జతకట్టిన తరువాతనే, పెళ్ళికొడుకు వంతూ, హక్కున్నూ. పెళ్ళికొడుకు హక్కుకంటే ముందు తీర్చవలసిన హక్కులు చాలా జాతులలో ఉన్నాయి.

"మొదటి రాత్రి" అని ఒక అలవాటు కనిపిస్తుంది. జాతి నాయకుడు, కులపెద్ద, పురోహితుడు, ఇలాంటివారు మొదటిరాత్రి జతకట్టడం ఉంది. దీనికి మత సంబంధమయిన ఒక కారణం చెప్పినా, స్వేచ్ఛా విహారానికి ఇదికూడా ఒక నిదర్శనం కాకపోదు.

కన్యాత్వం అన్న మాటకు గౌరవం లేదు. కన్య అని, ఇంకొకరిని ఎరగనిది అని, అక్షతయోని అని చెప్పడం, నేడు గొప్ప సంగతులే కావచ్చును కాని, ఆనాడు వాటికి అర్థం లేదు. పైగా, అలాగా కన్యాత్వం మూటగట్టుకొని ఉండే ఆడదానిని చూచి అసహ్యించుకునేవారు. అటువంటి ఆడవాళ్ళకు భర్తలే దొరకేవారు కారు. ఎందుకూ పనికిమాలిన య్యాభాసిగా భావించేవారు.

అంటే అర్థం ఏమిటి? జతకట్టడం నిత్యజీవనంలోని విషయం. దానికి తప్పూ నిరోధమూ ఉండకూడదు. పెళ్ళి, వ్యవహార కాండ

జరపడానికి ఒక తోడు తెచ్చుకోవడం లాంటిది. అంటే పనిపాటు చూసుకుంటూ ఉండడంలో సాయం చెయ్యడానికి. అలాంటి ఉద్దేశంలో పెళ్ళి చేసుకున్న తరువాత, సాధారణంగా ఆ ఆడది ఆ మగవాడితోనే కాలక్షేపం చెయ్యాలి. విచ్చలవిడిగా తిరగడానికి తీరిక కూడా ఉండదు కదా! అలా విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటే, మరి ఇంటిపనులు జరగడం ఎలాగ? అందుచేత పెళ్ళి తరువాత అనేక జాతులలో కొంత నియమం కనబడుతుంది.

అలా అని, పెళ్ళి తరువాత మరేమీ ఇతర సాంగత్యం లేదనిగూడా అనలేము. భార్యలను మార్చుకోవడం, అతిథులను సత్కరించడం, పండుగ పబ్బాలలో ఇతరులతో విచ్చలవిడిగా కాలంపుచ్చడం–ఇలాంటి అవకాశాలు చాలా ఉన్నాయి.

ఒక స్నేహితుడు ఇంటికివస్తే, ఇంటివాడు వెలుపలనే పండుకోవాలి. స్నేహితుడూ తన భార్యా కలిసి లోపల పండుకుంటారు. మగవాడు లేనప్పుడు, అతని స్నేహితుడు ఇంటికివస్తే ఆడది అన్ని విధాలా అతనికి ఉపకరించాలి.

ఒక ఇంటికి చుట్టపుచూపుగా దంపతులు వస్తే, కొన్ని దేశాలలో ఒక చిన్న ఆచారం ఉంది. ఈ దంపతుల జంట జోడీలు మార్చుకుంటారు. ఆగంతకుడు ఇంటి ఆవిడతోనూ, ఇంటివాడు ఆగంతకురాలితోనూ నిద్రపోతారు.

ఒక జాతిలోని ఆడపిల్లలు కొంతమంది ఒక జట్టుగా కలిసి, పొరుగు ఊరికి పోతారు విహారం కోసం. ఈ విహారం ఆ జాతీ ఈ జాతీ అంగీకరిస్తారు. దీనికి "కటుయోసీ" అని పేరుగూడాను. వీరు ఆ ఊరు పోగానే అక్కడి మగవారు కొందరు వారిని కలుసుకుంటారు. స్వయంవరంలాగా ఒక తంతు జరుగుతుంది. ఆ రాత్రి అక్కడ ఉండి, మరునాడు ఆడపిల్లలు తిరిగి ఇంటికి వస్తారు.

మగవారు పశువులను కాచుకుంటూ అడవులలో వుంటారు మరొక ప్రదేశంలో. ఆ గ్రామంలోని ఆడపడుచులు వారికి ఆహారాలు ఇవ్వడానికీ, పాలు ఇండ్లకు తీసుకొని రావడానికీ బయలుదేరుతారు. అక్కడ వీరికీ వారికీ కలయికలు యథేచ్ఛగా జరుగుతాయి.

పెళ్ళికి ముందు ఇటువంటి స్వేచ్ఛా విహారం కొన్ని దేశాలలో ఇప్పటికీ కనబడుతూ ఉన్నప్పుడు, ఈ ఆచారాన్ని అంగీకరించకపోవడం కష్టం; సబబుకాదు. ఇలా తిరగడం రహస్యంగా జరిగేది అని అనుకోరాదు. తల్లి తండ్రులకే కాదు, ఆతర్వాత చేసుకున్న మగవాడికి కూడా తెలిసిన సంగతే.

ఒక జాతిలో పెళ్ళి అయిన తరువాత పెళ్ళికూతురు తాను ఇంతకుముందు ఎవరెవరి దగ్గరకు వెళ్ళి వుండిందో వారి పేరులన్నీ పెళ్ళికొడుకుకు చెప్పాలి. అప్పుడు పెళ్ళికొడుకు వారందరిదగ్గరకూపోయి, ఒక్కొక్కడి దగ్గర ఒక్కొక్క గొర్రెనో, మేకనో తీసుకొని వస్తాడు. అది అంతా ఈ దంపతులకు ఆస్తి అవుతుంది. ఇందులో రహస్యం ఏమీ లేదు. దీనికి అప్పటి వారు, ఆ జాతులు సిగ్గుపడలేదు. మనం సిగ్గుపడడ్డం ఎందుకు? అది కాదని నిరూపించడానికి అవస్థ పడడం ఎందుకు?

పెళ్ళి అయినంతవరకూ ఆడవారు స్వేచ్ఛగా తిరుగుతూ వుండేవారన్నమాట సత్యం. ఈ సత్యం ఎంత చావగొట్టాలని చూచినా చావదు. ఎన్నివేల సంవత్సరాలు గడిచిపోయినా మాయం కాదు. ఎక్కడో, ఏ రూపంగానో కనబడుతూనే వుంటుంది. ఉత్సవాలలోనూ, పెళ్ళి ఆచారాలలోనూ, పూజా పురస్కారాలలోనూ తలచూపుతూనే వుంటుంది. అందుచేతనే ఆ రోజులలో రంకుతనం అన్నది తక్కువ. లంజెతనం కనబడనే కనబడదు. కామంతో పిచ్చి ఎత్తిపోవడం అన్నది వుండేదికాదు. జతకట్టడం అన్నది సహజంగా, సాధారణంగా సాగిపోతూ వుండే పని. అందుచేత దానికోసం తహతహ పడవలసిన అవసరం వుండేది కాదు. ఆ వేదన లేదు. ఆ ఉద్దేశంతో పెళ్ళి చేసుకోవడంలేదు. పనిపాటుల కోసం, సాయంకోసం మాత్రమే పెళ్ళి జరిగేది. అదిగూడా శాశ్వతంగా వుండేది కాదు. ఒక పిల్ల పుట్టినంతవరకూ చేసుకున్న పెళ్ళి గూడా రూఢి పడేదికాదు.

# ఈగవాలని రొట్టె!

ఈ రోజులలో ఒక ఆడది, ఒక మగవాడు జతకట్టారంటే-రెండే అర్థాలున్నాయి. వారు పెళ్ళి చేసుకొని వున్న భార్యాభర్తలయినా కావాలి; లేదా కొంచెమోగొప్పో చిల్లరతిరుగుడుకిందకయినా రావాలి. మొదటి దానికి గౌరవం, రెండోదానికి కొంత నింద ఏర్పడ్డది. అంటే జతకట్టడానికీ, పెళ్ళికీ సంబంధం ఏర్పడ్డది. పెళ్ళిలేని జతలు దూషణల పాలవుతూ వున్నాయి.

పూర్వం జతకట్టడానికీ, పెళ్ళికీ ఏలాంటి సంబంధమూ లేదు. ఈ మాట మొదట గట్టిగా దృఢపడాలి. దీనిలో ఎవరికీ ఎలాంటి అనుమానమూ వుండకూడదు. ఎందుచేతనంటే, ఈ పెళ్ళి (జత) సంబంధం మీదనే వివాహ చరిత్ర అంతా ఆధారపడి వుంటుంది. అంటే ఇది పునాది. దీనిలో ఏపాటి బలహీనత ఉన్నా దీని తరువాతి కట్టడం అంతా కూలిపోతుంది.

అంత ప్రధానమయిన విషయం కాబట్టే, మహాశాస్త్రవేత్తలు, ఉద్దండ పరిశోధకులు, యాత్రికులు, జిజ్ఞాసువులు ఈ విషయంపై గొప్ప పరిశీలనలు చేశారు. దేశదేశాల అనాగరిక ఆచారాలను శ్రద్ధతో పరికించి వాటిని ప్రకటించారు. ఆ పరిశోధనలే మనకు ఆధారం. వీరిలో కొందరు తమ అభిమానాలను మొదలంటా మరచిపోలేక పోయారు. ఏదో మెలిపెట్టి అటుతిప్పి, ఇటుతిప్పి, ఆనాడు గూడా మన రోజుల్లో లాగానే ఉన్నారని నిర్ధారణ చెయ్యడానికి ప్రయత్నించారు.

అభిమానం ఎంత పనికయినా ఈడుస్తుంది. వైర్లెస్ వచ్చిందనగానే, అదే మన కాశీమజిలీలలోని దూరశ్రవణం అన్నాము. జర్మనీవాడు పెద్ద హోవిట్జర్ తయారు చేశాడు అనగానే, ఇదే పురాణాలలో నున్న శతఘ్ని అన్నాము . టెలివిజన్ అన్నదే కళాపూర్ణోదయంలోని దూరదర్శనం అన్నాము.

ఈ ఏరోప్లేనులే మన విమానాలు. ఎక్కడయినా బంగారురంగు తామర పువ్వులు కనబడితే అదే చదలేరు, ఆకాశగంగ అని అంటాము.

"చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు"

అన్నాడు మా శ్రీనాథుడని ప్రమాణం చూపుతాం. ఎలక్ట్రిక్ దీపాలు మనకు ఉండేవని శ్రీనాథుడి ప్రమాణంమీద సాధించాం కామా?

అలాంటివి అభిమానాలు, అయినా సత్యదృష్టి దగ్గర ఇవి నిలవలేవు. ఈ అభిమానాలు చేసిన సిద్ధాంతాలకు ప్రత్యక్ష విరుద్ధంగా ఉండే పరిస్థితులు వేలూ లక్షలూ కనబడ్డవి. విద్వాంసులు ఆ అభిమాన సిద్ధాంతాలు నమ్మదగినవి కావు అని నిర్ణయించారు. మనుష్యులు, ఆరంభ దశలో జంతువులలాగా, స్వేచ్ఛగా విహరిస్తూ ఉండేవారు; ఆకలిదప్పులు కోసం ఎంత శ్రద్ధపడేవారో, జతగూడడానికి గూడా అంత శ్రద్ధనే చూపేవారు; అంటే స్వేచ్ఛా విహారం ఉండేది అని అంగీకరించక తీరదన్నారు. విచ్చలవిడి అనడానికి నోరునొచ్చేవారుంటే-జతకట్టడానికి ఆ రోజులలో నియమం అన్నది లేదనికాని, చాలా తక్కువగా నియమం ఉండేదనిగాని అనవచ్చునన్నారు.

పెళ్ళికీ, జతకట్టడానికీ లంకె ఆ రోజులలో లేదు. ఉండడంగూడా అసంభవమే. ఎందుచేతనంటే, జతకట్టడం అన్నది ఆకలి, నిద్రలాంటి ఒక శరీర అవసరం. అది నిత్యనైమిత్తికాల లాంటిది. అందరికీ కావలసిందే. ఎలాగయినా సంతృప్తిపరచవలసిన వాంఛే. వేరుకాదు. జతకట్టడం శారీరక అవసరం.

పెళ్ళీ అలాంటిదే అనలేము. దానికి సాధకాలూ బాధకాలూ చాలా ఉన్నాయి. దానికి శరీరాలతో ఉన్న సంబంధం కంటే, సంఘంతో ఉన్న సంబంధం ఎక్కువ. కొన్ని దేశాలలో పెళ్ళి అన్నది వ్యక్తి సంబంధం కానే కాదు; సమాజవాది సంబంధం-సంఘం, తెగ. వీటికే సంబంధించి ఉంటుంది. ఆ దేశాలలో పెళ్ళి వ్యక్తి ఇష్టంమీద జరిగేదికాదు; తెగ ఇష్టం మీద జరిగేది; అంతేకాదు, ఆ పెళ్ళికూతురు ఒక్క పెళ్ళికొడుకుకే

భార్య కాదు; ఆ తెగవారి కందరికీ పెళ్ళామే. వీటి సంగతి తరవాత చెప్పవలసి వస్తుంది. ఇప్పటికి జతకట్టడం అన్నది శరీరానికి సంబంధించినదనీ, వ్యక్తి వ్యవహారమనీ తెలుసుకుంటే చాలును. పెళ్ళి అన్నది సంఘ వ్యవహారమనీ, కేవలం వ్యక్తి సంబంధం కాదనీ అనుకుంటే చాలును. అదే ఇందులో ఉన్న అంతరార్థం.

అందుచేతనే పెళ్ళిముందు ఆడవారూ, మగవారూ విచ్చలవిడిగా శరీర వాంఛలను తీర్చుకోవడం ఆచారంగా ఉండేది. దానిలో తప్పు ఏదీ లేదు. పైగా, అలాగా విచ్చలవిడిగా ఉండడమే కావాలి. పిల్లలను కనవచ్చును. అలా తిరిగినందువల్ల పెళ్ళికి అనర్హత ఏమీ కలగదు. అంతేకాదు; అలా విచ్చలవిడిగా తిరిగి పిల్లలను కని ఉంటే, ఆ ఆడది మరింత యోగ్యురాలు. ఎక్కువ ఉపయోగంగా ఉంటుంది. గౌరవం!

పెళ్ళిళ్ళు అయిన తరువాతను గూడా ఆడవాళ్ళు అట్టే మడి కట్టుకోవాలన్న నియమం లేదు ఆ రోజులలో-అంటే, పండుగలకూ పబ్బాలకూ, అతిథులు వచ్చినప్పుడూ, పై చేతులు చూస్తూనే ఉండాలి-విధిగాను. అలాంటప్పుడు పెళ్ళిముందు మడి కట్టుకోవడం అన్నది ఏమిటో-ఆ దినాలలో తెలియదు. కన్యాత్వం అంతా మూటకట్టి ఉంచుకొని, పెళ్ళిచేసుకున్న మొగుడికే ఒప్పచెప్పాలన్న బుద్ధి ఆ దినాలలో ఏ ఆడదానికీ ఉండేదికాదు.

**"జన్నియగట్టియుంటి నెలజవ్వన మంతయు నేటిదాక"**

అని కన్నులమీదా, కస్తూరి బొట్టుమీదా ప్రమాణంచేసి మొగుడ్ని ఒప్పించవలసిన అవసరం ఆ రోజులలో లేదు. ఆడది గాని, మగవాడుగాని, పెళ్ళికి ముందు ఎవ్వరితో జతకట్టలేదు అన్న దృష్టిగాని, దాని తలంపుగాని వారికి లేదు. అదే జతకట్టడానికి మొదలన్న వెర్రి ఉద్దేశం ఎవ్వరికీ వుండదు. ఇద్దరికీ పూర్వ అనుభవాలున్నా యన్న సంగతి అందరికీ తెలిసిన సంగతే. అంతమాత్రంచేత పెళ్ళికి పనికిరాక పోవడం లేదు.

ఒకవేళ ఏ ఆడదయినా, ఎక్కడా ఎవ్వడికీ అందకుండా పెళ్ళిదాకా ఇనుప కచ్చడం కట్టుకొని ఉండాలన్నా, అలా ఉండడం జరిగేదికాదు. సంఘం ఉండనిచ్చేదికాదు గూడాను. ఒకవేళ అలా నడుముకట్టి

ఉందనుకుంటే, ఆ రోజులలో పైవారు ఏమనుకొనేవారు? దీనికి ఏదో పెద్దలోపం వుంది. ఎందుకూ పనికిరాని ఏభ్రాసి, ఛీ! దీనిని పెళ్ళి చేసుకోవడం తప్పు అని చాలా నీచంగా చూసేవారు. దయ్యమో భూతమో దాన్ని పట్టుకుందిరా అని ఆ ఆడదాన్ని చావగొట్టి చంపనయినా చంపేవారు.

ఆ దేశాలవారికి కన్యాత్వం గురించి ఉపన్యసించి, అక్షతయోనులను పెళ్ళి చేసుకోవడం చాలా బాగుంటుంది అని చెప్పండి. వారేమంటారో తెలుసునా?

"ఒక ఈగయినా వాలని రొట్టె-అదీ ఒక రొట్టేనా?" అంటారు. రొట్టె మంచిదయితే, ఈగలు వాలాలి. అలా వాలకపోతే. అది మంచి రొట్టె కాదు-రుచిలేని పాడురొట్టె. తర్కం బాగాలేదని మనం అనగలమా? అంటే అంటాంగాని, ఆ రోజులలో ఆ మాట అనేవాడు లేడు.

మనలో మగవారి స్వేచ్ఛా విహారాన్ని సమర్థిస్తూ-

**"ఎన్ని పూవులన్ వాలదు తేటి? యట్ల మగవా డను**

**వానికి దోసమున్నదే?"**

అన్నాము. అలాగానే, ఆ రోజులలో ఒక కవిగాడుంటే-

**"ఈగ ఒకటైన వాలదు హీ హీ హీ హీః**

**ఛీ! అదీ ఒక రొట్టెయా ఛీ ఇసీసి"**

అని చెప్పి వుండేవాడు. తర్కం బాగావుంది కాదూ?

కన్యాత్వం కోసం కక్కుర్తిపడేవారు ఆ రోజులలో ఉండేవారే కారు. ఉన్నా వారికెన్నో పాట్లు ఉండేవి. ప్రమాదం ఎక్కువ.

కాబట్టి, పెళ్ళిచేసుకున్నవాడు కన్యాత్వకోసం గానీ, కేవలం జతగూడే హక్కు కోసం గానీ పెళ్ళి చేసుకోడు అని అంగీకరించాలి. ఇంత వయసే ఉండాలి, అంత వయసే ఉండాలి అన్న నియమాలు ఉండవు. పిల్లలుండగూడదు, ఇందరే వుండాలి అన్న షరతులు ఏవీలేవు. ఇంతకు ముందు ఒకడితో ఉంది, లేదు అన్న పరిశీలన అక్కరలేదు. అవసరాన్ని బట్టి ఒక ఆడది, ఒక మగవాడు పెళ్ళిచేసుకుంటారు. అంటే, కేవలం ఉపయోగంకోసం, పనిపాట్లు చెయ్యడానికి ఒక ఆడదాన్ని తనకు సాయంగా

తీసుకుంటాడు మగవాడు; స్త్రీల పెద్దరికం ఉన్న దేశాలలో ఒక మగవాడిని తనకు సాయంగా తీసుకుంటుంది ఆడది. సాయానికి తగిన వ్యక్తి జునా కాదా అన్నదే ప్రశ్న. ప్రేమ కాదు, కామమూ కాదు, ఉపయోగం. వ్రాసుకోడానికి కలం తెచ్చుకున్నట్లు, దున్నుకోడానికి గొడ్డును తెచ్చుకున్నట్లు, పనిపాట్లలో సాయం చెయ్యడానికి మనిషిని తెచ్చుకుంటారు. అంతే పెళ్ళికి అర్థం.

అందుచేత ఉపయోగమే ప్రధానం. కాబట్టే, పిల్లతో ఉన్న ఆడదయితే మరీ మంచిది. ఈ ఉపయోగానికి తగిన లక్షణాలు చూచి ఎంచుకోవడం ఉంటుంది. ఉండక తప్పదు. పని పాట్లు చేసే ఓపికా, కండబలమూ, ఇలాంటివాటిని జాగ్రత్తగా చూచుకుంటారు. అదే ఆ రోజులలో, స్త్రీ పరీక్ష. అలాంటి లక్షణాలుండడమే ఆడదానికి అందం ఆ రోజులలో, ముక్కూ, మొగమూ కాదు. కండబలం, గట్టి ఓపిక కావాలి. అవి ఉన్న ఆడదే అందగత్తె. దానికోసమే మంచి బేరాలు వస్తాయి. ఈ గుణాలున్న తరువాత తీరిక వుంటే, ఆకార లక్షణాలకోసం చూడవచ్చు; కాని ప్రధాన పరీక్ష అది కాదు.

మన కవులూ కళారాధకులూ ఆడదానిలో అందం అంటే ఏమిటో చూపిస్తున్నారు. కనులిలా ఉండాలనీ, బొమలలా ఉండాలనీ, కురులిట్టా పిరుదు అట్టా ఉండాలనీ- వర్ణించి ఉన్నారు. ఆ లక్షణా లుంటే అందమయినదని అనుకుంటున్నాం. కాని, ఆ రోజులవారికి ఆ దృష్టి లేదు. పైగా, మనం అందమనుకున్న విషయాలు వారికి వెగటుగా ఉండేవి. వారిదాకా వెళ్ళడమెందుకు? ఇప్పుడు ఈ రోజులలోనే ఎన్నో దేశాలవారి అభిప్రాయాలకీ మన అభిప్రాయాలకీ చాలా వ్యత్యాసం వుంది. ముఖం గుండ్రంగా వుంటే మనకు పూర్ణ చంద్రవదన, కోల ముఖం వుంటే అందం కొందరికి, కోటేరులాగా ముక్కుంటే మనకు ముచ్చట; కొంచెం కొన పైకెత్తి వుంటే కొందరికి అందం. నీలవేణి కోసం కొట్టుకుంటాం మనం; దానికి ప్రాధాన్యమే ఇవ్వరు కొందరు.

ఈ రోజులలోనే ఇలా ఉన్నప్పుడు ఆ రోజుల దృష్టి వేరు విధంగా ఉండేదంటే తప్పా? నిజం ఆలోచిస్తే, ఆ రోజులవారికి శరీర

సంబంధమయిన అందం ఒకటి ఉందన్న సంగతే ఉందో లేదో అని సందేహం కలుగుతుంది. కొందరు యాత్రికులు అనాగరక జాతులను అనేక విధాల ప్రశ్నించారు; లాభం లేకపోయింది. అందం అంటే వారికి అభిప్రాయమే లేదు. కొన్ని దేశాల భాషలలో అందం అన్న అర్థం ఇచ్చే మాట లేదు. ఇలాంటివి చాలా దేశాలున్నాయి.

అందం అంటూ ఒక అభిప్రాయం వుందని అనుకున్నా, వివాహ నిర్ణయంలో అది మొదటి విషయం కాదు. ఉపయోగం అన్నదే ప్రధానం. ఉపయోగానికి కావలసిన లక్షణాలన్నీ ఉన్న తరువాత, అందంకోసం-వారి అభిప్రాయాల ప్రకారం-చూడవచ్చును. ఒక ఫవుంటెన్ పెన్ కావలసి వచ్చినప్పుడు మనం ఏమిచేస్తాం? మన డబ్బుకు తగినవాటిలో చాలాకాలం పనిచెయ్యగలది సూదిగానో మొద్దుగానో మనకు కావలసినట్టు వ్రాయగలిగేది ఎంచుకుంటాం. ఈ రెండు గుణాలు వున్న కలాలు రెండు మూడు వుంటే, వాటిలో కంటికి ఇంపయినది కొంటాం. అంతేగాని, కంటికి ఇంపుగానూ అందంగానూ ఉందికదా అని మూడురోజులలో చెడిపోయే కలం కొనం. బాగా వ్రాయని కలం ఎంచుకోము. ప్రయోజనం మొదట చూస్తాం. నజర్ తరువాత చూస్తాం. ఆ రోజులలోనూ అంతే.



# తోడి పెళ్ళికొడుకు

అంటే కటువుగా ఉంటుంది. అసహ్యంవేస్తుంది-ఇంకా, తన్నాలని కూడా బుద్ధిపుడుతుంది. కాని, నిజం అనకతప్పదు. మనుషుల మీద వున్న గౌరవంకంటే మానవ చరిత్రమీద గౌరవం ఎక్కువగా ఉండాలి. సంతోష వాక్యాలకన్నా సత్యానికి ఆధిక్యం ఉందికదా? అందుచేత చెప్పవలసిన మాట గట్టిగానే చెప్తాదాం.

ఆ రోజులలో ఆడది అంటే అందరికీ పనికివచ్చేది-అంటే, జతకలవడానికి. ఇది తగును, ఇది తగదు అన్న నిషేధం ఆ జతకట్టడంలో కనబడదు.

ఎంతమాట! అంటారు. నిజమే, తల్లీ, కూతురు అన్న విచక్షణ అయినా ఉండదా అంటారు. అలాంటి విచక్షణ ఏమీలేదు అని జవాబు చెప్తితే శ్రీహరీ! అని చెవులు మూసుకుంటారు. పాపం! అని కనికరించక తప్పదు. అది మన ఆచారబలం. వెగటుగా కనబడుతుంది. కాని; చరిత్రలు అవలోచనచేస్తే, తల్లి కొడుకును భర్తగా తీసుకొని కాపురం చేసే స్థలాలు ఉన్నాయి; కూతురిని భార్యగా చేసుకున్న వంశాలున్నాయి. మన బ్రహ్మ కూతురిని పెళ్ళిచేసుకున్నాడు. ఈజిప్టులో తల్లి కొడుకును పెళ్ళిచేసుకోవడం శాస్త్రసమ్మతమయిన పూర్వాచారం. వారి పురాణాలు అన్నీ ఈ సత్యాన్నే ఘోషిస్తాయి. ఎంతమాట! అనరేమి? చెవులు మూసుకోరేమి?

ఈ మాట మీకు వెగటుగా ఉండవచ్చు; మాకు వెగటుగా ఉండవచ్చు; అందరం కలిసి శ్రీహరీ అని చెవులు మూసుకోవచ్చు. కాని సృష్టికర్త అన్నవాడే వుంటే, అతడు చెవులు మూసుకోడు, మూసుకోలేడు. ఎందుచేతనంటే, జంతుకోటిలో తల్లీ పిల్లా జతకట్టుతూనే వున్నాయి. తండ్రీ కూతురూ జతకట్టుతూనే వున్నాయి. అక్కా తమ్ముడూ

జతకట్టుతూనే వున్నాయి. ఇలాంటివాటికే చెవులు మూసుకుంటే, సృష్టికర్తకు చెవులు వుండీ లేవన్నమాటే.

ఒక్క తల్లికి పుట్టిన పిల్లలు జతకట్టడం మొన్న మొన్నటి దాకా వుంది. అన్నదమ్ముల పిల్లలు జతకట్టడం ఇప్పటికీ వుంది. డేరయస్ హిస్టాస్పసు తన సోదరిని పెళ్ళిచేసుకున్నాడు. సింహళం కనిపెట్టిన విజయుడు తన సోదరినే పెళ్ళాడాడట. ఆదాము ఈవు అక్కచెల్లెలు; సృష్టిలో ఇది తప్పుగా భావించలేదు. అనేక గ్రంథాల ఆధారం మీద రాముడికి సీత అక్క చెల్లెలని నిరూపించినవారూ ఉన్నారు. *రోజులతో ఆచారాలు మారాయి. ఇప్పుడు ఇలాంటివి నిషేధం-దుష్ట సంబంధాలు.

తల్లి పిల్ల సంబంధాలు కొన్నాళ్ళకు బాగా లేవని నిషేధించారు. పూర్వులుగూడా "ఇన్‌సెస్టు" అన్న దీనిని గట్టిగా శిక్షించేవారు. కాని, ఇది ఆరంభం నాటి నిషేధం కాదు. చాలా సంవత్సరాలు మానవుడు జీవించిన తరువాత ఏర్పడ్డ నిషేధం. అందరికీ అందరూ అన్న విచ్చలవిడి సూత్రానికి కొంచెం విరుగుడు. ఆ సంబంధం మానుకుంటే, ఏ మగవాడయినా ఏ ఆడదానితో నయినా జతకట్ట వచ్చును అన్న మాట. అంటే, ఆడది అందరికీ పనికి వచ్చేది. ఆ ఆడది పెళ్ళి చేసుకుంటే, ఏమయింది? తక్కినవారి హక్కులకు ఆ భంగం కలిగింది. అలాంటి భంగానికి తక్కినవారు అంగీకరిస్తే, ఏ చిక్కూ లేదు. అంగీకరించకపోతే, పోట్లాడు కోవడం తప్పదు. పెళ్ళిళ్ళలో చుట్టాలందరికీ విందులూ, త్రాగుడూ అంతా సరఫరా చెయ్యడం అందుకే. ఏదో వేడుక కోసం కాదు. చాలా అవసరం అయిన పని, తప్పక చెయ్యవలసింది. అదే వాళ్లందరి అంగీకారాన్ని సూచిస్తుంది. లేకపోతే పెళ్ళేకాదు.

ఈ హక్కునీ, ఈ అంగీకారాన్నీ అనేక జాతులు ఇంకొక రూపంగా ప్రకటించాయి. పెళ్ళినాడు పెళ్ళికూతురు మొగుడుతో నిద్ర చేయదు; సంఘంలో వున్న మరి ఒకడితోనో, మరి నలుగురుతోనో నిద్ర చెయ్యాలి. ఒక్కొక్కచోట, సంఘంలో వున్న పెద్దతోనే రాత్రి గడపాలి. అలాకాకపోతే సంఘం నియమించిన ఒకడితోనో, నలుగురుతోనో ఉండాలి. ఆ తరువాతనే

*నా "జొన్నక్షర" వ్యాసం చూడండి.

భర్త దగ్గరకు వస్తుంది. అదే సంఘానికీ పెళ్ళికూతురికీ వీడ్కోలు నిద్ర. సంఘం నియమించిన ఇతడు చక్కగా సంతోషించాలి. సంతోషంతో పెళ్ళికూతురును పెళ్ళికొడుకుకు ఒప్పగించాలి-హృదయపూర్వకంగా సమర్పించాలి. వీడు అంత ప్రధాన పురుషుడు. పెళ్ళికొడుకు కంటే పెద్ద పెళ్ళికొడుకు.

ఇప్పటికీ పాశ్చాత్య వివాహాలలో "Best man" (బెస్టుమాన్) అన్నవాడు ఒకడు పెళ్ళికూతురును పెళ్ళికొడుక్కి అప్పగిస్తాడు. బెస్టుమాన్ అంటే ఉత్తముడు అని అర్థం. నిజంగా అతడే ఉత్తముడైతే ఆ పెళ్ళికూతురు ఆ ఉత్తముడినే పెళ్ళి చేసుకోకపోయిందా? ఉత్తముడు కానివాడిని ఎందుకు చేసుకుంటుంది? కాబట్టి, బెస్టుమాన్‌కు ఆ అర్థం కాదు, సంఘ ప్రతినిధి అన్న అర్థం చెప్పాలి. నాజూకు మీరిపోయాము కాబట్టి, ఈ రోజులలో బెస్టుమాన్ పెళ్ళికూతురిని అప్పగించడంతో తృప్తి పడుతున్నాడు. ఆరంభకాలంలో అంత తేలికగా విడిచిపెట్టేవాడుకాదు. వీడ్కోలు నిద్ర అంటూ పెళ్ళికూతురితో తప్పక ఉండేవాడు. లేకపోతే పెళ్ళి అగిపోయిందన్న మాటే. ఇప్పుడు ఆ నిద్ర పోయింది. ఆచారం మాత్రం నిలిచింది. బెస్టుమ్మాన్ ఇప్పుడు నిష్కామ కర్మ చేస్తున్నాడు.

మనలోనూ ఈ ఆచార లక్షణం లేకపోలేదు. అదే తోడి పెళ్ళికొడుకు తంతు. ఇప్పటికీ ఈ ఆచారం అన్ని దేశాలలోనూ ఉంది. అరవంలో "మాపిళెతోళన్" అని "తోళిమాపిళె" అని అంటారు. అన్ని పెళ్ళిళ్లలోనూ ఈ వ్యక్తి ముఖ్యంగా వుండాలి. అంతేకాదు; అతడిని పెళ్ళికొడుకు కంటే ఎక్కువగా చూడాలి. కొన్ని స్థలాలలో ఈ తోడిపెళ్లికొడుకే అసలు పెళ్లికొడుకును అలంకరిస్తాడు. కొన్ని స్థలాలలో ఈ తోడి పెళ్లికొడుకునే పంక్తి భోజనాలలో మొట్టమొదట కూర్చో పెడతారు. ఇతడే పల్లకీ మొట్టమొదట ఎక్కుతాడు. అసలు పెళ్ళికొడుక్కి ఏది ఇవ్వాలన్నా, మొదట ఈ తోడిపెళ్లికొడుకుకే అది ఇవ్వాలి. కొత్తగుడ్డలూ, కట్నాలూ చదివించినప్పుడు మొదటి కట్నం ఈ తోడిపెళ్లికొడుకుదే. ఇప్పుడు జరుగుతున్న ఆచారం ఇంతవరకు ఉంది. ఆ రోజులలో, ఈ సూత్రం ప్రకారం, పెళ్ళిలో మొదటి నిద్రకూడా ఈ

తోడిపెళ్ళికొడుకుదే. ఆ నిద్ర అయిపోయిన తరువాత మరి ఆ తోడిపెళ్లి కొడుకు ఆధిక్యం ఉండదు. అక్కడనుంచీ అసలు పెళ్లికొడుకుదే అధికారం.

రోజులు మారిపోయాయి. సంఘం అభిప్రాయాలు మారిపోయాయి. పెళ్లినాటి నిద్ర పరాయివానితో పోవాలన్నది మెల్లమెల్లగా వదులుకున్నారు. అయినా, ఒక మనిషి వుండాలనీ, అతడు సంతోష పూర్వకంగా అంగీకరించితేనేగాని ఆ పెళ్లి సక్రమం కాదనే, అభిప్రాయాలు మాత్రం మిగిలిపోయాయి. అందుకే తోడిపెళ్లికొడుకు రానురాను ఒక వినోదం కిందికి వచ్చాడు. ఇప్పుడు వయసులో వున్నవాడిని తోడిపెళ్లి కొడుకుగా పెట్టరు. చిన్న కుర్రవాడిని తోడిపెళ్లికొడుకును చేస్తారు- ప్రమాదం లేనిపని. ఈ కుర్రవాడయినా, రూల్సు ప్రకారం ఆలోచిస్తే, పెళ్లికొడుకు సంఘానికి చెందినవాడే వుండాలి. పెళ్లికొడుకు వంశానికి చెందినవాడు, వరసకు తగినవాడూ కావాలి. అంటే-అవకాశం వుంటే ఈ పెళ్లికొడుకుకు బదులు తానే ఆ పెళ్లికూతురిని చేసుకోగలిగినవాడయి వుండాలి. ఈ సూత్రం గూడా అక్కడక్కడ, ఇప్పుడు పాటించకుండా వున్నారు. ఎవడినో ఒక చిన్నవాడిని తోడి పెళ్లికొడుకుగా నిలబెడుతున్నారు.

దీనికంతకీ కారణం అసలు సంగతి తెలియకపోవడమే. ఈ తోడి పెళ్లికొడుకు ఏమిటో, ఎందుకు పెట్టారో ఆ సంగతి తెలియకపోవడమే. ఎవరికి తెలియక పోవడం? అల్పబుద్ధులమయిన మనకు కాదు! విజ్ఞానంలో పండిపోయి అన్నీ తెలుసునని పెద్దరికం వహిస్తూ ఉన్న పండితులకు......మన పురోహితులకు! వారికే తెలియదు. ఏదో ఆచారబలంతో అలా ఈదులాడుకొని పోతున్నారు-గుడ్డెద్దు జొన్న చేనులో పడ్డట్టు. ఎందుకిదంతా అని ప్రశ్నించడానికి వారికి అవసరం లేకపోయింది. ఏమిటయ్యా ఇది అని అడగటానికి మనకు దమ్ములు చాలలేదు. ఆచార పరంపరంగా ఈ తోడి పెళ్లికొడుకు వస్తూనే వున్నాడు-నానాటికి తీసికట్టు నాగంభొట్లూ అన్నట్టు తన హక్కులనన్నిటినీ ధారపోసుకుంటూ, అగ్రతాంబూలంగా వుండే ఈ తోడి పెళ్లికొడుకు ఇప్పుడు అతడొక వినోద వ్యక్తిలాగా తయారయాడు. ఇదంతా అర్థంలేని పిల్లల ఆటకిందకు వచ్చింది. కాని, సంఘానికి ప్రతి ఆడదాని మీదా వున్న హక్కుకు ఈ తంతు అంతా గట్టి తార్కాణం.

# మేనరికాలు : హాస్యాలు

మొట్టమొదట వుండిన విచ్చలవిడిగా జతకూడేపద్ధతి, రాను రాను, కొన్ని నియమాలకు లోబడవలసివచ్చింది. ఈ వ్యక్తితో జతకట్ట వచ్చును, ఈ వ్యక్తితో జతకట్టరాదు అని నిషేధాలు కలిగాయి. తల్లి పిల్లల జతలు ఈ నిషేధాల కిందికే వచ్చాయి. అక్కా తమ్ముడు నిషేధం అంత ఎక్కువగా లేకపోయింది. రాజకీయ కుటుంబాలలో, వంశమహాత్తు కోసం దేవులాడడంలో, ఇతర రక్తాలు కలియకుండా

వుంచుకోడానికి ఈ అక్కా తమ్ముడు జతలు బాగా సాగుతూనే వుండేవి. మరి కొన్నాళ్ళకు ఒక్క తల్లికి పుట్టినవారు తప్ప తక్కిన బాపతు అక్కా తమ్ములు జతకట్టవచ్చు నన్నారు.

మరి కొంత తెలివిమీరిపోయిన తరువాత మరికొన్ని నిషేధాలు గూడా వచ్చాయి. రక్తసంబంధం వుంటే జతకట్టడం మంచిది కాదన్న అభిప్రాయం క్రమంగా కలిగింది. ఆ దృష్టిని చూసేసరికి ఒక గూడెం అంతా లేక ఒక జట్టు అంతా, బీరకాయ పీచులాగా చుట్టుకొనివున్నట్టే. రక్తసంబంధం కనిపించకపోదు కదా! సాక్షాత్తుగా వున్న సంబంధం, ఒక్క వేలు విడిచిన సంబంధం, రెండూ-మూడూ-నాలుగు.....వేళ్ళు విడిచిన సంబంధం అందరూ సంబంధం వున్నవాళ్ళే కనబడుతారు.

కాబట్టి, ఒక జట్టులో ఉన్నవారు-ఆడవారు కానీ, మగవారు కానీ-ఆ జట్టులో నుండేవారిని పెళ్ళి చేసుకో కూడదన్నారు. జతల కోసం ఇంకొక జట్టుకు పోవాలి. దీనికి "ఎక్సాగమీ" అని పేరు పెట్టారు.

మరికొన్ని దేశాలలో దీనికి ప్రత్యక్ష విరుద్ధంగా వుంది నియమం. ఏ జట్టువారు ఆ జట్టులోనే జతకట్టుకోవాలి అని. దీనిని "ఎండాగమీ" అన్నారు. దీనికి  కారణం జాతి మహత్తుమీద ఆసక్తి అని వేరుగా చెప్పనక్కరలేదు.

పై జట్టు పెళ్ళి ఆ జట్టు పెళ్ళి అన్న ఈ రెండూ రెండు రకాలా, ఒకటే రకమా అనిగూడా వివాదం వుంది. పై జట్టుమీదనే ఆధారపడిపోతే, అలా జతలు కట్టడానికి అవకాశాలు ఉండవచ్చును, ఉండకపోవచ్చును. ఈ రెండు జట్టులకు ఉన్న సఖ్యాన్నిబట్టి, వైరాన్నిబట్టి కథ నడపవలసి వస్తుంది. అదే సూత్రంగా పెట్టుకుంటే, ఒక జట్టు ఇంకొక జట్టు వారితో పోట్లాడి, ఆ జట్టువారి ఆడవారిని తెచ్చుకోవలసి వస్తుంది. ఇలాంటి వివాహాలూ ఉన్నాయి. కాని, ఇదంతా చాలా బెడద వ్యవహారం. పెళ్ళికావాలి అంటే పోట్లాడాలన్న మాట వస్తుంది. నిత్యజీవితంలో ఇంత బెడద పెట్టుకుంటే చాలా కష్టం. ఆ రోజులలో వాళ్ళంత బెడద తెచ్చిపెట్టుకొని ఉంటారా?

ఒక్క జాతిలో రెండుమూడు జట్టులుండవచ్చును కదా? కొండమీద ఒక జట్టు, లోయలో ఒక జట్టు, కొండ అవతల ఒక జట్టు అన్నట్టు ఉండవచ్చును. ఈ మూడు జట్టులూ ఒక్క తెగవే. సఖ్యంతో ఉండేవే. అలాంటప్పుడు, పై జట్టునుంచే పెళ్ళి చేసుకోవాలి అని ఒక నియమం పెడితే-ఏమయింది? కొండమీది వారు లోయలోని వారితోనూ, లోయవారు అవతలివారితోనూ సంబంధాలు చేసుకోవచ్చు నన్నమాట. లోయలోనివారు, లోయలోనివారిని పెళ్ళిచేసుకోరని అర్థం. ఈ పద్ధతిని జట్టునుపట్టి చూస్తే ఇది ఎక్సాగమీ! జాతినిపట్టి చూస్తే ఇది ఎండాగమీ అవుతుంది. నిత్యజీవితానికి అడ్డు, ఆటంకమూ వుండవు.

ఇలాంటిదే మన గోత్రాల పద్ధతి. ఏ గోత్రంవారు ఆ గోత్రంలో పెళ్లి చేసుకోకూడదు. ఇతర గోత్రం వారినే చేసుకోవాలి. ఇది ఎక్సాగమీ; బయటి సంబంధం. కాని, వారందరు ఒక్క కులంవారే అవడంచేత ఇదే ఎండాగమీ; లోపలి లోపలి సంబంధం. ఈ దృష్టిని చూస్తే ఈ రెండూ ఒక్కటే అని తేలుతుంది.

బయటి సంబంధమయినా సరే, లోపలి సంబంధం అయినాసరే, జతకూడే హక్కులూ, పద్ధతులూ అన్నీ ఇంతకుముందు నేను మనవిచేసినట్టే- అందరికీ హక్కు వుంటుంది. ఒక ఇంటిలో ఒకడు పెళ్ళి చేసుకున్నాడు. అంటే, ఆ ఇంటివారు అందరూ ఆ పెళ్ళికూతురితో జతకట్టవచ్చును. ఒకడికి భార్య అయితే ఆ అన్నదమ్ముల కందరికీ

భార్యే అవుతుంది. ఒక ఆమె ఒకడ్ని పెళ్ళిచేసుకుంది అంటే, ఆమె అక్కచెల్లెళ్ళందరూ అతనితో జతకట్టవచ్చును. అతనికి పెళ్ళాం ఇతనికి పెళ్ళాం అని విచక్షణ లేదు. ఇంటందరికీ పెళ్ళామే అవుతుంది. ఇంటికోడలవుతుంది.

ఆశ్చర్యపడకండి. భారతంలో పాండవులు చేసుకున్న పెళ్ళి ఇలాంటిదే. ద్రౌపది ఇంటందరికీ ఇల్లాలే. నాయర్లలోను గూడా ఈ ఆచారం వుంది. టిబెట్‌లో ఇలాంటి ఆచారమే వుంది. నీలగిరి తోడాజాతిలో గూడా ఈ ఆచారం వుంది.

అంతేకాదు, రామాయణంలో రాముడు మాయలేడిని పట్టుకోడానికి పోయిన తరువాత "హా లక్ష్మణా" అన్న ధ్వని వినిపించినప్పుడు సీత లక్ష్మణుడ్ని వెళ్ళమంటుంది. అన్న చెప్పినమాట తప్పకూడదని లక్ష్మణుడు కదలడు. అప్పుడు సీత నిష్ఠురాలు పలుకుతూ, 'మీ అన్న పోయినట్టయితే నన్ను పొందాలనా ఇలా కదలకుండా ఉన్నావు' అని అన్నది.

సీతమ్మ అజ్ఞానురాలు కాదు. ఇంత నీచమయిన మాట ఆడదు. అయినా ఆ మాటలు వాల్మీకి అంతటివాడు వ్రాశాడు. ఏమి? అప్పటి ఆచారం; అన్న భార్యను తమ్ముడు చేసుకోవచ్చు. వచ్చుకాదు; చేసుకోవాలి గూడాను. వాలి సుగ్రీవులు చేసినపని ఇదే. తార ఇద్దరికీ భార్యయే. అన్నభార్యలను చేసుకొన్న బృహస్పతులు అనేకు లున్నారు.

మహారాజులు ఎందరెందరో తమ కూతుళ్ళను-ఇద్దరు ముగ్గురిని కాదు యాభై మందిని, నూరుమందిని, ఒక్క ఋషిగారికి ఇచ్చి వివాహాలు చేశారని మన గాథలున్నాయి. అన్ని వివాహాలూ జరపరు. ఏదో పెద్దదానికి మాత్రం పెళ్ళిచేస్తే చాలు; తరువాత పెళ్ళిళ్ళు తమంతట అవే జరిగిపోతాయి. వాటికోసం వేరే బెడద పడనక్కరలేదు.

ఈ ఆచారం ఇప్పుడు కొంచెం వెగటుగా కనిపిస్తుంది; నిజమే. కాని, ఆ రోజులలో వెగటు ఉండేదికాదు. పైగా చాలా రుచిగా ఉండేదనే చెప్పాలి. ఎందుచేతనంటే, చూడండి. అదే అసహ్యం అయినపని అయితే, దానిని వట్టి రోతతో చూచి, ఈపాటికి దాని మచ్చూమాయా కనిపించ

కుండా మరచిపోయి ఉండేవారం; దాని సంపర్కం రవ్వంతయినా కనబడకుండా చేసేవారం.

కాని, అలా జరపలేదు. ఇప్పటికీ మనలో ఈ వాసన ఉంది. బావలూ మరదళ్ళూ, వరసమాటలు ఇప్పటికీ ఉన్నాయి. వాళ్ళ హాస్యాలు చాలా దూరం పోతాయని వారి మాటలు విన్న వారందరూ అంగీకరిస్తారు. ఇంటిలో ఉన్నవారు ఎవ్వరూ ఆ హాస్యాలకు ఆక్షేపణ చెప్పరు. అంతా నవ్వేవారే ఆనందించేవారే అంటే, సంఘం ఆ వరసలను అంగీకరించిందన్న మాట. ఆ రూపంగా మన పూర్వాచారలక్షణం మనలో ఇప్పటికీ ఉన్నది.

ఇలాంటి వరసలే మేనమామ మేనకోడల వరసలు. జతకూడడానికి అవకాశం వున్న జట్టులు—పైని చెప్పినలాంటివి—మేహన జట్టులు. మేహన అన్నమాటకే జతకట్టడం అని అర్థం చెప్పడం న్యాయం. ఈ మాటను నేను "దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు?" అన్న గ్రంథంలో సూచించాను. ఎందరు ఎంత విసుగుకున్నా దానికి ఆ అర్థం తప్పదు.

మేహన సంబంధమే మేన సంబంధం—మేనరికం—అయింది. మేనరికం ఉంది అంటే జతకట్టుకోడానికి అవకాశం ఉందనికదా, మనలో అర్థం? అంతేకాదు, కొన్ని సంఘాలలో తప్పకుండా పెళ్ళి చేసుకోవాలి కూడాను. తప్పించకూడదు. పెళ్ళి చేసుకున్నా, చేసుకోకపోయినా, ఈ మేనరికం ఉన్నవారు పైని చెప్పిన బావమరదళ్ళ లాగానే పచ్చి పచ్చిగా హాస్యం ఆడుకుంటారు. వారికా అధికారం ఉంది.

ఒక ఆయన మేనమామ ఇంటికి వచ్చాడు. ఆ యింట అతనికి ఒక మరదలుంది. స్నానాలు చేసిన తరవాత ఆయన ధోవతి పెరటిలో పందిరికి ఆరకట్టాడు. మరదలు తన చీరగూడా ఆ పెరటిలోనే మరొకచోట ఆరగట్టింది. భోజనాలయిపోయాయి. తాంబూలాలు వేసుకుంటున్నారు. ఇంతలో చిటపట చినుకులు పడ్డాయి. మరదలు చటాల్నలేచి "అమ్మో! చినుకులు! నా చీర!" అని పెరటిలోనికి పరుగులెత్తుతూ ఉంది. బావ "మరదలా మరదలా, నీ చీర విప్పినప్పుడే నా ధోవతి గూడా విప్పేయి" అన్నాడు. మరదలు బావ భావం గ్రహించింది; నవ్వుకుంటూ "నా చీర

విప్పేటప్పటికి నీ ధోవతి తడిసిపోకుండా ఉంటేగదా!" అని గుడ్డలు విప్పడానికి పోయింది.

ఈ మాటలు విన్న తల్లీ తండ్రీ చుట్టాలూ అంతా సంతోషించి నవ్వుకున్నారు. మరదలు చమత్కారానికి మురిసిపోయారు. ఆ ఆనందంలో మరి రెండు తమలపాకులు వేసుకున్నారు.

అంతేగాని, ఇంత పచ్చిగా మాటలాడినారే అని ఒక్కరయినా చీకాకుపడలేదు. చీవాట్లు పెట్టలేదు. అదీ మన వరస లక్షణం.

# అక్కమగడే అందరికీ మగడు

బావా మరదళ్ళ వరసలు, ఒక్క దేశానివికావు. జాతివికావు. అన్ని దేశాలలోనూ, అన్ని జాతులలోనూ ఇవి కనబడుతూ ఉండడం చేతనే ఈ సిద్ధాంతం ఏర్పడ్డది. ఏమంటే-ఆ కాలములో అక్కమగడు అందరికీ మగడే అని.

అక్కను పెళ్ళిచేసుకుంటే చాలును. ఆమె చెల్లెండ్రను వేరుగా పెళ్ళి చేసుకోనక్కరలేదు! స్వేచ్ఛగా జతగూడ వచ్చును. అలాగే అన్నను పెళ్ళి చేసుకుంటే చాలు; స్త్రీ అతని తమ్ముళ్ళను పెళ్ళిచేసుకోనక్కర లేకుండానే జతగూడవచ్చును. ఒకవేళ ఈ అన్నదమ్ములలో ఎవడయినా ఒకడు వేరే స్త్రీని పెళ్ళిచేసుకొని వచ్చినా, ఆ స్త్రీ గూడా అన్నదమ్ము లందరికీ ఉపయోగించవలసిందే. అంతేగాని వలపక్షం పనికిరాదు.

అంటే అర్థం ఒక ఆడది పెళ్ళిచేసుకొని భర్త ఇంటికి వచ్చిందంటే ఆ ఆడది తనకు కోడలు (అంటే భార్య అనే అర్థంలెండి మొదట) తన కొక్కడికే కోడలు అవడంకాదు, ఇంటి కంతటికీ ఆమె కోడలే. అన్నదమ్ములందరికీ అది కోడలే. ఈ కోడలు అన్నమాటను మనలో చాలా వరకు కొడుకు భార్యకే ఉపయోగిస్తాము. కాని, కొన్ని జాతులలో- మన ఆంధ్రులలో గూడా, కోడలు అంటే భార్య అనిన్నీ, మామ అంటే భర్త అనిన్నీ వాడుక వుంది. బాగా వాడుకలో ఉంది.

కోడలు అన్నమాటకు రూపాంతరాలున్నాయి. కోడాలు అంటారు; కూడాలు అంటారు. కూడాలే రానురాను కోడలు అనీ కోడలి అనీ మారింది. కూడా ఉండే ఆలు. స్త్రీ అని దీనికి అర్థం. కొడుకు పెళ్ళాం కాదు; తనకే పెళ్ళాము కావాలి; లేకపోతే కూడాలు కానేరదు. కొందరు ఈలాగా కాకుండా కూడల్ అన్నమాటలో ఈ కోడలికి సంబంధం కలుపుతారు. అప్పుడు గూడా కూడల్ అంటే గుంపు (సంఘం)కి

చెందినది అని అర్థం వస్తుంది. ఈ అభిప్రాయమే మనకుగూడా మొదటిలో ఉండేది. లేకపోతే ఆ యింటికి కోడలు అని మనలో ఉన్న వాడుక ఎలాగ వస్తుంది? ఒక ఆడది కోడలు (కొడుకు భార్య) అయితే ఒక మనిషికో, ఇద్దరు మనుష్యులకో, కోడలు కాగలదు గానీ, ఇంటికి కోడలు ఎలా కాగలదు? కాబట్టి పైని చెప్పిన పురాతన ఆచారమును అంగీకరించక తప్పదు.

ఈ ఆచారం చాలా ఎక్కువగా చాల ప్రదేశాలలోనూ ఉండేది. ప్రజలు గడుసు మీరిపోయినకొద్దీ ఈ ఆచారం నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నించారు. కాని, పూర్వపు మచ్చ పోతుందా? ఉగాండాలో ఇప్పటికి గూడా ఒక ఆచారం ఉంది. ఒకడు ఒక ఆడదానిని పెళ్ళిచేసుకున్న తరువాత, ఆ ఆడదానికి చెల్లెళ్ళు ఉంటే, ఇతడు ఏమిచెయ్యాలో తెలుసునా? ఆ పిల్లలకు పెళ్ళిచేసుకునే అవకాశం వచ్చినప్పుడు, ఈ పెద్దల్లుడు ఒక్కొక్క మరదలిని "నిన్ను నేను పెళ్ళిచేసుకోను" అని నిరాకరించాలి–ఎంతమంది మరదళ్ళుంటే అందరినీ ఇలానే అప్పుడప్పుడు నిరాకరించాలి. లేకపోతే ఆ పిల్లలకు పెళ్ళికాదు. ఈ నిరాకరణగూడా అన్ని లాంఛనాలతోనూ అందరి సమక్షంలోనూ జరగాలి.

ఆస్ట్రేలియాలో ఒకని భార్య చచ్చిపోతే, ఇప్పటికీ, ఆ భార్య చెల్లెళ్ళుంటే వారిలోనే ఒకతెను తప్పక పెళ్ళిచేసుకోవాలి. అలా కాకుండా మరొకతెను పెళ్ళిచేసుకుంటే, దానికి తగినంత కారణం చూపించాలి. అవసరమైతే అపరాధం చెల్లించాలి. ఇలాంటి ఆచారాలు అన్ని ప్రదేశాలలోనూ సప్రమాణంగా చూపించవచ్చును.

ఇంగ్లాండులో గూడా ఈ ఆచారమే ఉండేది. కాని, కొన్నాళ్ళకు ఆ దేశంలో బహుభార్యాత్వం కూడదన్న నియమం పెట్టుకున్నారు . ఒక భార్య బతికి ఉండగా మరొకతెను పెళ్ళిచేసుకోకూడదు అని ఒక శాసనం చేసుకున్నారు. అక్కడగూడా, ఒకవేళ ఆ భార్య చచ్చిపోతే, ఆమె చెల్లెలిని, అవకాశం ఉంటే పెళ్లిచేసుకొనే ఆచారం ఉండేది. ఇదిగూడా కొన్నాళ్ళకు వారికి నచ్చలేదు. భార్య చెల్లెళ్ళను పెళ్ళిచేసుకోవడం చాలా ద్రోహం అన్నంతవరకు అభిప్రాయాలు పెరిగిపోయాయి క్రమంగా.

ఇది ఏదో మహా తప్పు అనుకున్నారు. కాని, దీనిలో ఉన్న సదుపాయాలు వారు గ్రహించలేకపోయారు. మొదటి భార్యకు పిల్లలుంటే ఆ పిల్లలు పడవలసిన సవతితల్లి బాధలు వారికి కనబడలేదు. ఆ భార్య చెల్లెలే అయినట్టయితే, ఆ పిల్లలకు ఎటువంటి బాధగూడా కలగదన్న రహస్యం వారికి గోచరించలేదు అంటే అర్థం ఏమిటి? ఆనాటి అనాగరిక ఆదిమ మనుష్యులకున్న తెలివితేటలుగూడా లేకుండా ఇంగ్లీషువారు భార్య చెల్లెలిని పెళ్ళిచేసుకోవడం నిషేధించారు.

మొదట ఇండియాలో ఉన్నట్టే, హీబ్రూలలో గూడా ఒక ఆచారం ఉండేది. కొడుకులు లేకుండా అన్న చచ్చిపోతే, తమ్ముడు ఆ అన్న భార్యతో జతకట్టి ఆ అన్నకు పుత్రుడిని కలిగించాలి. లేకుంటే, ఆ అన్నకు గతులుండవు . ఈ సంగతి ఓల్డు టెస్టమెంటునుబట్టి తెలుస్తుంది. అలాంటి ఆచారాన్ని అంగీకరించిగూడా, అన్న భార్యను పెళ్ళి చేసుకో కూడదు అని అన్నారు. ఆ భార్యతో ఉండవచ్చు. కొడుకు పుట్టినదాకా ఆలూమగల ఆట ఆడవచ్చు. కాని ఆమెను-ఆ తరవాతనయినా-పెళ్ళిచేసుకోకూడదట! ఎంత అపసవ్యంగా ఉందో చూడండి. అలా అన్న భార్యను పెళ్ళిచేసుకోకూడదు అన్న ఆచారం బలం అయిపోయింది.

ఏమిటీ అసందర్భం అని చాలామంది ఇంగ్లీషువారు ఆందోళన లేవదీశారు. చర్చి మతగురువులూ, పురోహితులూ ససేమిరా పనికి రాదన్నారు. అలాగా ఎవరయినా చనిపోయిన భార్య చెల్లెలిని పెళ్ళిచేసుకుంటే, వారికి పుట్టిన పిల్లలకు హక్కులు లేవన్నారు. ఆందోళన మరింత సాగింది. పార్లమెంటులో, కామన్సు సభలో అనేక సార్లు ఈ సమస్య వాదనకు వచ్చింది. ఒకసారి కామన్సు సభవారు అలాంటి పెళ్ళిళ్ళు సక్రమమే అని నిర్ణయించారు. కాని, వారిపైని మరొకసభ-ప్రభువుల సభ- ఉంది కదా, ఆ ప్రభువులు ఈ నిర్ణయాన్ని కొట్టిపారవేశారు. ఎలాగయితేనేమి 1907లో చనిపోయిన భార్య చెల్లెలిని పెళ్ళిచేసుకుంటే, పుట్టిన పిల్లలకు గూడా హక్కులు ఉంటాయి అని నిర్ణయించారు.

కాని, రెండో శాఖవారున్నారే-చనిపోయిన భర్త తమ్ముడిని ఆడది పెళ్ళి చేసుకోవడం మంచిదన్నవారు-ఈ శాఖవారి మాట ఎవడూ వినలేదు.

పార్లమెంటులోనికి గూడా ఈ వాదాన్ని రానిచ్చేవారుకారు. 1914లో లాయిడ్ జార్జిగారు ప్రధానిత్వం వహించి ఉన్నప్పుడు కొందరు ఈ ఆందోళన లేవదీశారు. లాయిడ్ జార్జిగారిని బలవంతపెట్టారు. మగని తమ్ముడిని పెళ్ళిచేసుకోవచ్చునా అన్న వాదన అయినా పార్లమెంటులోనికి రానీయండి అన్నారు. లాయిడ్ జార్జిగారు అంగీకరించనేలేదు. మొదటి పక్షం వారి వాదన అంగీకరించినందుకే చర్చి పెద్దలు మండిపడ్డారు. ఈ పక్షం వాదన గూడా పెడితే ఈ పురోహిత అగ్రగణ్యులు అగ్గి అయిపోతారని లాయిడ్ జార్జిగారి బెదురు. కాని, ఎన్నాళ్ళు ఈ అధికారం? ఈవేళ కాకుంటే రేపు, అలాంటి శాసనాలు చాలా కావలసి ఉంటాయి. వాటిని ఆపడానికి ఎవడికీ బలంలేదు.

పురోహితులకు ఇలాంటి మార్పులు పనికిరావు. వారి సూత్రాలకు వారే సంతోషించాలి-ఇతరులు కాదు. సక్రమమా కాదా అన్న చింత వారికి లేదు. ఒక్క మన దేశంలోనే కాదు, సర్వత్రా ఈ పురోహితులు, ఈ ఆచార్యులూ ఇలాంటివారే. ఎంత అనాచారం సంఘంలో ప్రవేశించిపోయినా, ఎంతమంది తమ సూత్రాలను అంగీకరించకపోయినా, వారికేమీపోదు. వారి సూత్రాలు మాత్రం అలాగే చెక్కు చెదరకుండా వుండాలి. వాటిని చూచుకొని ఆనందిస్తూ ఉంటారు. దానినే మనం ఇప్పటి రోజులలో చాదస్తం అంటాము. చాదస్తులు అంటే తలా తోకాలేని సూత్రాలలో ఉండేవారన్న మాట.

కాకపోతే, ఈ విడ్డూరం ఏమిటి? 1920లో గూడా పెద్ద నాగరక దేశం అనుకుంటూ ఉబ్బిపోతూ ఉండే ఇంగ్లండులో ఈ చాదస్తం ఉంటుందా? భార్య చనిపోయిన తరువాత, ఒకడు ఆ భార్య చెల్లెలిని పెళ్ళి చేసుకోవచ్చును అని - ఇష్టం లేకపోయినా-అంగీకరించారు; వారి బిడ్డలకు అన్ని హక్కులూ ఉన్నాయి అని ఒప్పుకున్నారు. కాని భర్త చనిపోయిన తరువాత ఒక స్త్రీ తన భర్త సోదరుడిని పెళ్ళిచేసుకో కూడదట. ఎంత అపసవ్యంగా ఉందో చూడండి ఆచార్యులవారి ధోరణి. నిజం ఆలోచించినట్టయితే, ఈలాంటి పెళ్ళిళ్ళను తప్పకుండా అంగీకరించవలసింది. పురాతన-అంటే ఆదిలో వుండే సనాతన-

ఆచారాలను పట్టి చూచినా ఇదే సక్రమముగా కనబడుతుంది. సరియైన తర్కానికి ఈ వాదమే నిలవగలదు. అయితే నేమి? ఆచార్యులవారికి నచ్చలేదు.

ఈ తిక్క ఆచార్యులకు ఎప్పుడూ ఉన్నదే. ఆనాడు బాబిలోనియా హయాములో ప్రచారంలో ఉండే 'హమ్మురబీ' సూత్రాలనాడు గూడా ఇలాంటి చాదస్తాలు కనబడతాయి. ఆచార్యులు అప్పుడూ, ఇప్పుడూ ఒక్కలాగానే ఉన్నారు. ఎవరయినా బాగుపడవచ్చును గాని ఈ ఆచార్యులు మాత్రం బాగుపడరు. మేము బాగుపడమండోయ్ అని దిక్కులు పిక్కటిల్లేలాగా ఘోషిస్తారు.

చూడండి. హమ్మురబీ సూత్రాలలో కొడుకు పెళ్ళాంతో తండ్రి జతకడితే, వాడిని నీటిలోముంచి చంపాలన్నారు. తండ్రి పెళ్ళాంతో కొడుకు జతకడితే, వాడికి తండ్రి ఆస్తిలో హక్కు ఉండదన్నారు సూత్రకారులు. వారి దృష్టిలో ఏది పెద్ద దోషంగా కనిపించిందో చూడండి. వారి తారతమ్య జ్ఞానం అలా ఉండేది.

# నిషేధాలే నిదర్శనాలు

అన్న చనిపోయిన తరువాత అతని భార్యను తమ్ముడు పెళ్ళిచేసుకోవడమూ, అక్క చనిపోయిన తరవాత ఆమె భర్తను చెల్లెలు పెళ్ళిచేసుకోవడమూ చాలా దేశాలలో ఆచారమని మనవి చేశాను- ఇంగ్లండుతో సహా. అంతటితో అది తీరిపోలేదు. ఇలాంటి పెళ్ళిళ్ళు చాలా తరచుగా చాలా ప్రదేశాలలో ఉన్నాయి. కాబట్టే, ఇలాంటి పెళ్ళిళ్ళకు ప్రత్యేకించిన పేరులు గూడా పెట్టారు.

అన్న భార్యను పెళ్ళిచేసుకోవడానికి "లెవిరేటు" అని పేరు. ఇది న్యాయసమ్మతమే కాదు, నిర్బంధకం గూడాను. మన భరత వర్షంలో గూడా ఇది బాగా అమలులో ఉంది. ఇంద్రుడి గురువు బృహస్పతికి ఈ రహస్యం తెలుసును. వాలి సుగ్రీవులు ఈ ధర్మ పద్ధతినే నడిచారు. సీత లక్ష్మణుడిని నిందించినప్పుడు ఈ సూచననే చేసింది. హిబ్రూలలో ఇది విశేషించి ఉండేది.

అక్క భర్తను చెల్లెలు పెళ్ళిచేసుకోవడానికి "సొరారేటు" అని పేరు పెట్టారు. ఇదిగూడా చాలా ప్రచారంలో ఉండిన పద్ధతే. ఇప్పుడు గూడా మనలో అనేకమంది ఈ సొరారేటు పద్ధతిని పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. కాబట్టి, ఇలాంటి వాటిని చూచి మనము గాభరా పడనక్కరలేదు. ఆ దినాలలో పెళ్ళి చేసుకోవడానికి స్వేచ్ఛ చాలా ఎక్కువ - అంటే, ఇప్పుడు మనకు చాలా అక్రమంగా కనబడే పెళ్ళిళ్ళు అనేకం ఆ రోజులలో సక్రమంగానూ, న్యాయంగానూ ఉండేవి. ఆ రోజులలో అని ప్రత్యేకించడం గూడా అక్కరలేదేమో!

ఇప్పటికి గూడా ఈ స్వేచ్ఛ చాలా జాతులలో ఉంది. బ్రిటిషు, కొలంబియాలో అన్న కూతురును పెళ్ళిచేసుకుంటారు. సాధ్యమైనంతవరకు - మనలో మేనరికం లాగా-ఇలాంటి జతకోసమే వారు ప్రయత్నిస్తారు.

ఆఫ్రికాలో ఒకడు చనిపోయిన తరువాత అతని భార్యలను అతని కొడుకు పెళ్ళిచేసుకోవచ్చును. ఆ భార్యలలో తన్ను కన్నతల్లిని తప్పించి ఇతరులను పెళ్ళిచేసుకోవచ్చును. అంటే సవతి తల్లులను పెళ్ళిచేసుకోవడం తప్పుకాదు. ఈ అలవాటు ఏదో ఒక్కచోటనే గాబోలు అనుకోకూడదు. దక్షిణ అమెరికాలో కరిబ్సు అన్న జాతివారిలో గూడా సవతి తల్లులు పెళ్ళికి పనికివస్తారు.

ఏమయ్యా ఇది అని వారిని అడిగితే వారు చక్కని జవాబు చెప్తుతారు; తండ్రి చచ్చిన తరువాత అతని ఆస్తి అంతా కొడుకుకు రాలేదా? వచ్చింది. ఈ భార్యలు గూడా ఆ తండ్రి ఆస్తిలోనివారే కదా! అవును భార్యలు, ఆవులలాగా, గొర్రెలలాగా ఆస్తికిందకు రావలసినవారే - ఆ జాతులలో, ఆ రోజులలో, అలాంటి భావంతోనే ఆ తండ్రి పదిమందిని పెళ్ళిచేసుకున్నాడు. ఆ భావంతోనే కొడుకు గూడా వాళ్ళని పెళ్ళిచేసుకుంటాడు. కాని, కన్నతల్లిని మాత్రం విడిచిపెడతాడు. దీనికి కారణం వేరే చెప్పనక్కరలేదు. అయినా రాజకుటుంబాలలో తల్లినిగూడా పెళ్ళి చేసుకోవడం ఉండేది. దానికి కారణాలు చాలా చిక్కుగా ఉంటాయి. ఈజిప్టు దేవతకు భర్త తమ్మాజ్. ఈ తమ్మాజ్ తన కొడుకే.

తల్లి వరస వారిని పెళ్ళిచేసుకున్నట్టుగానే కూతురు వరస వారిని గూడా పెళ్ళిచేసుకుంటారు. పారసీకులలోనూ, ముస్లిములలోనూ కూతురు వరసవారిని, అన్న కూతురువంటి వారిని పెళ్ళిచేసుకోవచ్చును. తప్పులేదు, శాస్త్రాలు అంగీకరిస్తాయి!

ఫ్రెంచి గయానాలో మరొక్క విశేషం వుంది. ఒక ఆడది రెండో పెళ్ళి చేసుకున్నప్పుడు దానికి ఒక కూతురుంటే, సాధారణంగా రెండో పెళ్ళికొడుకు ఆ తల్లికీ పిల్లకీగూడా పెళ్ళికొడుకు అవుతాడు. అంటే, కూతురు వరస పిల్లను న్యాయ సమ్మతంగా పెళ్ళిచేసుకుంటాడు. ఇందులో రంకుతనంగాని, మరే దోషంగాని లేదు.

రష్యా గ్రంథకర్త టాల్‌స్టాయ్ ఇటువంటి సంబంధాన్నే ఒక నాటకంలో చూపించాడు. టాల్‌స్టాయ్ నాటికి ఈ పని అసహ్యాకరంగా కనిపించింది. ఆ నాటకమే గయానావారు చూస్తే వారికి ఏలాంటి అసహ్యమూ

కలగదు. అలాగే మన మేనరికాలు చూచి అసహ్యించుకొనేవారు చాలా మంది ఉన్నారు. అయితేనేమి, మనం మానుకుంటున్నామా?

పర్యవసానం ఏమిటి? తల్లి వరస, కూతురు వరస, వదినె వరస..... ఇలాంటి అన్ని వరసల వారిని పెళ్ళిచేసుకోవడం ఆచారంగా ఉందని తేల్తుంది. కొన్ని జాతులలో నిషేధం లేక అన్ని సంబంధాలూ అంగీ కరిస్తున్నారు.

దీన్నిబట్టి చూస్తే, మొదట విచ్చలవిడిగా ఉండేదనీ, తరవాత మనుష్యులు నాజూకు మీరిన తరవాత, వారి వారి పరిస్థితులనుబట్టి, కొన్ని కొన్ని నిషేధాలు కల్పించుకున్నారనీ నమ్మవలసి ఉంటుంది. ఇది పెళ్ళిచేసుకోవడం విషయంలోనే కాని, జతకట్టడం విషయంలో కాదు.

ఆఫ్రికా బుష్‌మన్ జాతివారిలో ఎవరు ఎవరితో పోయినా తప్పున్నట్టు కనబడదు. పెళ్ళిచేసుకున్న తరవాతనయినా పెళ్ళికూతురి స్వేచ్ఛకు అట్టే ఆటంకం లేదు. టిబెట్‌లో ఒక జాతి (కవాగుచి)లో విచ్చలవిడిగా జతకట్టుకోవడం ఆచారం. మధ్య ఇండియాలో కెరయా అన్న జాతి ఒకటి వుంది. వారి భాషలో పెళ్ళి అన్నమాటకు సరియయిన పదమే లేదు.

ఇలాంటి నిదర్శనాలు లక్షలూ కోట్లూ చూచి, అనేక మంది మహామహులు తుట్టతుదకు నిశ్చయించారు. ఆరంభంలో జతకట్టడం చాలా స్వేచ్ఛా విహారంమీద జరిగేది అని అంగీకరించక తప్పదన్నారు. ఈ మాట సహించడానికి కటువుగా కనబడ్డవారు కొంచెం మార్చి చెప్పారు: ఏమనంటే; మొదటమొదటలో జతకట్టడం అన్నదానికి నియమం చాల తక్కువగా ఉండేది అని అనక తప్పింది కాదు.

ఈ స్వేచ్ఛ ఎలాంటిదో తెలుసుకోవాలంటే, ఇప్పటికీ కొన్ని స్థలాలలో పండుగలూ, పబ్బాలూ జరిగినప్పుడు చూడాలి. అన్ని నియమాలకు ఆనాడు సెలవు. ఎవరు ఎవరితో జతకడుతున్నారో అడిగేవాడూ, చూచేవాడూలేడు. ఈ పండుగలను గురించి వందలకొద్దీ పరిశోధకులు వ్రాశారు. ఇప్పటికీ ఈ స్వేచ్ఛ ఆచరణలో వుంది. కాబట్టి సందేహం అక్కరలేదు. ఇప్పటికీ అంటే, పెళ్ళీ దానితో నున్న నియమాలూ,

అన్నీ ఉన్న ఈ రోజులలో గూడా ఇలాంటి స్వేచ్ఛకు అవకాశం వుంది. ఇకను ఆ రోజులలో ఈ పండుగలు ఎలా వుండేవో ఊహించుకోవడం ఏమి కష్టం?

"ఈలాంటి ఉత్సవాలలో వీరూ వారూ అన్న విచక్షణ లేకుండా ఆడవారూ, మగవారూ జతలు కడుతూ వుంటారు.

తల్లీ పిల్లా అన్న దృష్టిగూడా వుండదు"

అని ఆస్ట్రేలియాను గురించి ఒక పరిశోధకుడు వ్రాస్తాడు. మగవాడు యుక్తవయసుకు వచ్చినప్పుడు చిన్న తంతు చేస్తారు. ఆ కుర్రవాడికి ఇష్టంవచ్చినంత స్వేచ్ఛను ఇస్తారు. తన యిష్టం వచ్చిన ఆడదానితో జతకట్టవచ్చు - పెళ్ళిమాత్రం చేసుకోకూడదు. ఈ జతకట్టడంలో నిషేధం ఉన్న సంబంధమయినా తప్పులేదు.

డియరీ అని ఒక జాతి ఉంది. దానిలో ఒక అమ్మాయికి పెళ్ళి జరుగుతూ ఉందంటే-ఊరందరికీ పెళ్ళే. ఎలాగంటే, ఆ పెళ్ళి చాలా గొప్పగా చేస్తారు. వివాహ మహోత్సవం నాలుగైదు రోజులు జరుగుతుంది. ఈ నాలుగయిదు రోజులూ స్త్రీ పురుషుల విహారాలకు అడ్డూ, ఆపూ అన్నది ఉండదు. జతకట్టడానికి ఇది తగును, ఇది తగదు అన్న విచక్షణా ఉండదు.

అందరూ అలా స్వేచ్ఛను అనుభవించాలి. తప్పు అని అన్నా, క్రోధం పొందినా, మరెలాంటి చికాకు పొందినా, అది మహా ద్రోహం. దానికి శిక్ష ఏమిటంటే, అలాంటి దుష్టభావం కలిగిన మనిషిని, మగవాడయినా, ఆడదయినా, పీకె నొక్కి ఊపిరి రానీయకుండా చేసి చంపుతారు. రోమన్ల శాటర్నేలియా ఉత్సవాలు ఇలాంటివే. ఇండియాలో గంగమ్మ జాతరలూ, కామదహనం ఉత్సవాలూ, రవికెల పండుగలు ఇలాంటివే.*

---

* "నా దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు?" చూడండి.

# పడుచువారికి ముసలిజంటలు

ఇంతవరకు చెప్పినదానినిబట్టి ఆ రోజులలో జతకట్టడానికి కావలసినంత అవకాశం ఉండేదని తేటపడుతుంది. అందుచేత దానికోసం తహతహ పడడంగాని రోజులకొద్దీ తపించడంగాని ఉండే అవసరం లేదు. అందుచేత జతకట్టడం కోసం పెళ్ళి చేసుకోవడం అకారణమే.

పిల్లల కోసం అన్న అభిప్రాయం అసలుకే లేదు ఆ రోజులలో. నేను చెప్పినట్టు జతకట్టడానికీ, పిల్లలు పుట్టడానికీ సంబంధం ఉందనిగూడా వాళ్ళకు తెలియదు. గాలివల్లా, గడ్డివల్లా, తిన్నదానివల్లా, విన్నదానివల్లా పిల్లలు పుడతారన్న ఉద్దేశమే అప్పుడు ఎక్కువ.

ప్రేమకోసం ఏమో అనుకుంటే, ఆ మనుష్యులలో ప్రేమ అంటే జ్ఞానమే ఉండేది కాదు. ఇప్పుడుగూడా అనాగరక జాతులలో ప్రేమ అన్నదానికి తావులేదు. గట్టిగా పట్టిచూస్తే, తల్లీ పిల్లా అన్న మహా ప్రేమగూడా ఆ రోజులలో బాగా వుందా అని అడగవలసివస్తుంది. తల్లీ పిల్లా, స్నేహితులూ-ఇలాంటి ప్రేమ చాలా బాగా కనబడుతూ వుందిగాని, ఆఫ్రికాలో దంపతి ప్రేమ అట్టే కనబడదు అని కుమారి కింగ్‌స్లే వ్రాసింది. భార్యగాని, భర్తగాని చనిపోయినప్పుడు, వారు చూపించిన విచారం కేవలం ఆచార రూపంగానే ఉంటుందట.

పోలినీషియా చరిత్రను ఆమూలాగ్రం జీవపాఠంగా పరికించిన మెలినోస్కీ అన్న పరిశోధకుడు వ్రాసింది చూడండి: మగడు, పెళ్ళాం అన్న ప్రేమ అసలే లేదు. భర్త చచ్చి నాలుగు రోజులయినా కాకుండానే పోలినీషియాలో "వితంతు" స్వేచ్ఛగా ఇతరులతో జతకడుతూనే ఉంటుంది అన్నాడు.

మొదటి మొదటిరోజులలో జరుగుతూవుండే పెళ్ళితంతులు చూచినాగూడా, ఆ పెళ్ళిళ్ళలో ప్రేమ అన్న విషయానికి స్థలమే లేదని

నిర్ధారణ చెయ్యక తప్పదు. మొన్న మొన్నటి వరకు మన పెళ్ళిళ్ళలో పెళ్ళి చేసుకునే వ్యక్తుల భావాలకూ, పెళ్ళిళ్ళకూ సంబంధం లేకుండానే ఉండేది. కన్యాశుల్కమనీ, ఉన్న డబ్బు ఇచ్చి కొనుక్కునే పెళ్ళిళ్ళు ఇప్పుడు దుష్టాచారాలని కొట్టివేస్తున్నాముగాని, కొన్నాళ్ళ కిందట అవే సదాచారాలుగా ఉండేవి.

మనకున్నవి ఎనిమిది రకాల పెళ్ళిళ్లు - శాస్త్రాలలో. వాటిలో ఏదో ఒకటి తప్పిస్తే, తక్కినవన్నీ వధూవరుల ప్రేమభావాలతో సంబంధంలేనివే. ఆ ఒక్కటయినా - గాంధర్వం - కామంమీద ఆధార పడినట్లు కనిపిస్తుంది కాని, ప్రేమమీద కాదు. అంతేకాకుండా ఆ వివాహాన్ని అంత ఉత్తమజాతి వివాహంగా పరిగణించలేదు. అందుచేత పెళ్ళికి కారణం-ఆ రోజులలో అనే అందాము ఇప్పటికీ-ప్రేమగూడా కాదు.

పెళ్ళికి కారణం ఉపయోగమే. సహాయం కోసం. పని పాటులు చేసుకోవడంలో తోడ్పడడానికి, చేసుకున్న ఒక యేర్పాటు. ఈ జంటలో ఒకరు పొలం పని చేస్తుంటారు. ఒకరు ఇంటిపని చేస్తుంటారు. ఒకరు కట్టెలకుపోతే, ఒకరు నీళ్ళకు పోతారు. సహకారం కావలసివచ్చినప్పుడే, ఒక్క వ్యక్తి అంత పనీ చూచుకోడానికి వీలులేనప్పుడే, ఈ పెళ్ళి తోడుకోసం చూస్తారు.

మొట్టమొదటి దశలో మనుషులు కేవలం మృగప్రాయులుగా ఉండేవారు కదా? ఆకలి వేసినప్పుడు దగ్గర ఉండే చెట్టో చేమో పట్టుకొని తినేవారు-కాదు పోదు అంటే, కప్పనో, చేపనో పట్టుకు తినేవారు. ఆ ప్రక్కనున్న వాగులో ఇన్ని నీళ్ళు తాగేవారు. నిద్రవచ్చిందంటే ఏ బండ మీదనో చేరగిలబడేవారు. జతకట్టాలని తోచినప్పుడు అటూ ఇటూ చూచి, దగ్గరలో ఉన్న ఆడదానితో జతకట్టేవారు. సరి, కోరికలు తీరిపోయాయి. ఎప్పుడయినా భయం కలిగిందా, ఏ గుహలోనికో దూరిపోయేవారు. అంతే! కాయా కసరూ దొరకకపోతే "చెలో" అని మరొక స్థలానికి మారిపోయేవారు. అది ఆ జట్టు పద్ధతి.

తరవాత, తరవాత; పచ్చిక బయళ్ళు, గొర్రెల మందలు, ఆ తరవాత వ్యవసాయము-ఇలాంటి దృష్టి మనుషులకు కలిగింది. అది

కలగగానే స్థిర నివాసాలు ఏర్పడ్డాయి. పనిపాట్లకు ఒక క్రమం కలిగింది. అవన్నీ చేయక తీరని పనులే - చాలా ఎక్కువగా ఉండేవి. అందుచేత ఒక్కవ్యక్తి చేయలేకపోయేవాడు. ఎవరయినా తోడు ఉంటే బాగుంటుందని తోచింది. అప్పుడే యీ పెళ్ళికి ఆరంభం.

ఈ పెళ్ళి ఏర్పాటంతా పనిపాటులు చేసుకోడానికే. ఒకరు చెయ్యలేని పని ఒకరు చేసుకుంటూ, పనులన్నీ పూర్తి చేసుకోడానికే. వ్యవహారంలో వంతుదారుడిని చేర్చుకున్నట్టు, అది ఒక కంట్రాక్టు లాంటిది. దీనిలో అందంతోనూ, చందంతోనూ జోక్యం లేదు. పనికి ఉపయోగంగా ఉండాలి. ఎద్దులాగా పనిచెయ్యాలి, పోతులాగా పాటుపడాలి. అటువంటి తోడే కావాలి. నాజూకుగా "అబ్బా! నా చేత కాదమ్మా" అనే తోడు అక్కరలేదు . మగ,ఆడ కలిసి గొర్రెలనో సేద్యాన్నో పూర్తిగా చూచుకోవాలి. అందుచేత పనిపాటలు చెయ్యగలిగి కొంత అనుభవం ఉన్న జంటనే చూచుకుంటారు. కాని, తళుకులు కులుకులు చూడరు. అంతకుముందు ఎంతమందితో జతకట్టి ఉన్నా తన కక్కరలేదు; తన పనిపాట్లు చూడగలిగితే చాలును. పిల్లా జెల్లా ఉంటే మరీ మంచిది.

ఇది ఒకచోట కాదు. ఒక జాతిలో కాదు. ప్రపంచం అంతటా ఇదే ఆచారం-చిత్ర విచిత్రమయిన రూపాలతో ఉంది. ఆఫ్రికాలో, అమెరికాలో, యూరపులో, ఆసియాలో, ఆస్ట్రేలియాలో అన్ని ఖండాలలోనూ ఇదే పద్ధతి. జంటను తెచ్చుకోవడం ఏదో తద్దినం తెచ్చుకున్నట్టు బెడదా బాధ్యతా కాదు; ఒక ఆస్తి, ఒక తోడు తెచ్చుకున్నట్టు. అందుకోసమే తెచ్చుకోడానికి కొంత వెచ్చించవలసి ఉంటుంది. తండ్రికో, తల్లికో, కాదంటే జాతి కంతటికో ఏదో ప్రత్యుపకారం చెయ్యాలి. మొదట తాను ఇల్లూ కాపురం ఏర్పాటు చెయ్యడానికి తగుదునని రుజువులు చూపాలి. కొన్ని పరీక్షలు- బలానికీ, ఓర్పుకీ సంబంధించిన పరీక్షలు ఉంటాయి, ఉండేవి. వాటిలో తేరాలి. ఆ పరీక్షల బాధలన్నీ సహించుకోవాలి. అప్పుడుగాని జంటకోసం దేవులాడడానికి అర్హత దొరకదు. అది దొరికిన తరవాత మంచి తోడును సంపాదించుకుంటాడు. మరొక్కసారి చెప్పదాం.....దీనిలో ప్రేమలకూ భావాలకూ పనిలేదు. అందాలకూ, ఆకారాలకూ జోక్యం లేదు.

ఒక్కొక్కప్పుడు ఈ జంటలను గూడా పెద్దలే నిర్ణయం చేస్తారు. అంటే, పెళ్ళిచేసుకునే వారిద్దరి అభిప్రాయాలతోనూ సంబంధం లేకుండానే పెళ్ళి జరిగిపోవచ్చును. ఉజ్బెక్సు జాతిలో చిన్నవయసు పిల్లలను ఎవ్వడూ పెళ్ళిచేసుకోడు. బాగా ముదిరిన తరవాత నయితే ఇంటి పనికి ఆమె పనికి వస్తుంది అని వారి ఉద్దేశం.

గయానా ఇండియనులలో ఒక చిత్రమయిన పద్ధతి ఉంది. పడుచువాడు పెళ్ళి కావాలని కోరితే, వాడికి ఒక ముసలిదానిని జంట కడతారు. ఆ ముసలిది చచ్చిపోయిన తరవాత.... కావలిస్తే ఒక పడుచుదానిని పెళ్ళిచేసుకోనిస్తారు. ఒక వయసయిన ఆడదానికి భర్త చచ్చిపోతే, అది సంఘంలో ఉన్న యువకులలో ఒకడిని కట్టుకోవాలి. ఇది పద్ధతి.

దీనిలో చిన్న రహస్యం ఉంది. పెళ్ళి అంటేనే ఇల్లు అన్నమాట. కాపురం జరగాలి అంటే, కొంత అనుభవం ఉండాలి. అంటే జంటలో ఒక్కరయినా కష్టసుఖాలు తెలిసినవారుగా ఉండాలన్నమాట. ఇద్దరు ముక్కుపచ్చలారని పడుచువాళ్ళను ఆలూ మగడూ అని కాపురం చెయ్యమంటే, ఏముంది? ఇద్దరు శుంఠలను వంతు దారులుగా పెట్టి, పెద్ద వ్యవహారం నడపమంటే ఎలా తగులబడుతుందో అలాగే కదా! యీ కాపురం గూడా అవుతుంది? అని గయానా వారంటారు. వయసయిన వారితో సహవాసంవల్ల పడుచువారు తర్ఫీదవుతారు. ఆ తరవాత కావలిస్తే చిన్న వయసువారిని పెళ్ళి చేసుకోవచ్చును. అలాగానే, చిన్నవయసు పిల్లలను మొదట ముసలివారికి కట్టబెడతారు. తర్ఫీదయిన తరవాతనే దానికి పడుచుమొగుడు దొరుకుతాడు. అంతవరకు కాదు.

ఎంతో నాగరకత ఉన్న గ్రీసు దేశంలో కూడా తళుకు బెళుకుల కోసం పెళ్ళిళ్ళు జరిగేవికావు. ఇటలీలోనూ అంతే. ఇండియాలో మాత్రం- మరొకలాగా ఉండేదా! ఇంటికి పనికిరావడం ప్రధానం, ఆ పయినే అందమూ చందమూన్ను.

బల్గేరియాలో ఒక సామెత ఉంది- "పెళ్ళాడితే, నిన్ను చంకనెత్తుకొని తిప్పగలిగే పెళ్ళాన్నే చేసుకోవాలి" అని.

పెళ్లి చేసుకుంటే పిల్ల వస్తుంది-పిల్లతో ఇల్లు అవుతుంది. అలాంటిది పెళ్ళాం. పిల్లను ద్రావిడభాషలో పెణ్ అంటారు.

పెణ్ణాసయు, మణ్ణాసయు, పొణ్ణాసయు.......అని శ్రీ కాళహస్తీశ్వర మహత్యములో ఉన్న పెణ్ణాస = ఆడుదానిమీద ఆశేగాని మరొకటి కాదు. ఆ పెణ్ ఇల్ అవుతుంది. ఇల్ అంటే ఇల్లు. పెణ్ ఇల్ అవడమే పెండిల్ (అది ద్రావిడ బాషా సంధి). అదే మన పెండిలి, పెండ్లి, ఆఖరికి పెళ్లి. ఈ మాటలో ఉన్న అర్థం చరిత్రకు, మానవ ఆచారానికీ సరియయినది.

సంస్కృత పదాలలోవున్న వివాహము, ఉద్వాహము, పరిణయము, కల్యాణము మొదలయినవాటిలో యీ పురాతన అర్థము కనబడదు. పెళ్లి మొదటి అంతస్థును ఆ మాటలు తెలియజేయలేవు. తరువాత అంతస్థులనే అవి తెలుపుతాయి. ఆయా అంతస్థులకు వచ్చినప్పుడు వాటిని గురించి మనవి చేస్తాను.

అందుచేత, పెళ్లిలో చూసేది అంతా పనిపాట్లు చేయుగల యోగ్యతే; గృహ నిర్వహణ తెలిసి ఉండడమే. అంతకుపూర్వం జతకట్టిందా లేదా? అక్కరలేదు. ఈ తరవాత జతకట్టుకోడానికి పోతూ వుంటుందా? అక్కరలేదు-అవును. మొదటిరోజులలో అదిగూడా అక్కరలేక ఉండేది-బాగా పాటుపడాలి. అలాంటి ఉద్దేశంతోనే పెళ్ళి చేసుకునేవారు.

అప్పుడే కాదు; ఇప్పటికిగూడా యీ సూత్రమే చాలవరకు వర్తిస్తూ ఉందంటే కోపం కలగవచ్చు. కాని నిజమే. గుణాలదగ్గర అందానికి స్థలం ఉండదు. మంచి గుణాలంటే-పనిపాట్లు, చదువు సంధ్యలు ఇలాంటివి-ఆపాటి యీపాటి అందం వున్నా సరే అంటాము. గుణం లేనప్పుడు రంభలాగా ఉన్నదానినయినా - గృహదృష్టి ఉన్నవారు-పెళ్ళి చేసుకోడానికి జంకుతారు. అందుచేత యీ సూత్రం ఎల్లప్పుడూ ఉన్నదే అనాలి.

# పరిణయమంటే?

ఒకరికొకరు సహాయం చేసుకొని  ఇల్లు నడుపుకోడానికి పెళ్ళి ఒక ఏర్పాటు. ఇద్దరు ఆడవాళ్ళు ఇలాటి ఏర్పాటు చేసుకోవచ్చును. ఇద్దరు మగవాళ్ళూ కలిసి ఇలాటి ఏర్పాటు చేసుకోవచ్చును. కాని అటువంటి జంటలను పెళ్ళి అనము. ఒక మగవాడూ ఆడదీ కలిసి ఈ ఏర్పాటుకి దిగాలి. అప్పుడే పెళ్ళి అంటాము. దానితో పిల్లలు, కాపురము, కుటుంబము.......అంతా బీరకాయపీచుగా బలిసి పోతుంది.

ఇలా ఇలా ప్రవర్తించాలనీ, ఆడది ఇలా ఈ పనులు చెయ్యాలనీ, మగవాడు ఇలా నడవాలనీ, పిల్లల సంగతి ఇది అనీ, తరవాత తరవాత సూత్రాలూ, ఆచారాలూ కలుగుతాయి.

మనుషులు సమయానుకూలంగా చేసుకున్న యీ సూత్రాలు - రాను రాను-మనుషులనే కట్టిపడవేస్తాయి. సూత్రాలు శృంఖలా లయిపోతాయికదా!

పెళ్లికి మొదటి కారణం-అవసరం, జతకట్టి కామం తీర్చుకోడానికి అవసరం కాదు. అది ఎప్పుడూ యథేచ్ఛగా వారికి లభించేదే. ఒకరు వేటాడుకొని జంతువును కొట్టుకొని వస్తే, దానిని ఉడికించడానికి ఒకరు అవసరం. ఒకరు పొలం దున్నుతే, ఒకరు విత్తునాటే అవసరం. ఒకరు బయటికిపోతే ఒకరు ఇంట ఉండే అవసరం. ఇలాంటి అవసరం వచ్చింది. గొర్రే గోదా కలిగిన తరవాత అన్నీ ఒకరు చూచుకోవడం కష్టం అనిపించింది.

ఇకను ఆడదానికి గూడా ఒక అవసరం ఉంది గర్భసమయంలో. అంతకుముందు ఎంత చేతికి చేయి ఇస్తూ పాటుపడినా, గర్భసమయంలో అలా కష్టపడటానికి వీలు అంతగా ఉండదు. కొన్నాళ్ళు ఇతరులమీదనే ఆధారపడవలసి వుంటుంది. ఇది ఒక అవసరమే అనాలి.

గర్భంవల్ల పనిపాటులకు ఆటంకం కలగడం ఇప్పటిలాగా నెలలతరబడిని కాదు. ఆ రోజులలో చాలా స్వల్పకాలం మాత్రమే అన్నమాట మరచిపోనక్కరలేదు. ఇప్పటికీ పాటక జనాలలో కడుపుతో ఉండడం వల్ల పనికి నాగా కలగడం చాల తక్కువ రోజులు. అయినా, ఆడదానికి అది ఒక అవసరమే. పెద్ద అవసరం.

దానిని ఆధారం చేసుకొనే, సంఘ జీవితంలో మగవాడు ఏకు మేకయిపోయాడు. ఆడదానిని పనిగొడ్డుగాను, బానిసగాను చేసి పారవేశాడు. తనకూ, తన ప్రవర్తనకూ లేని సూత్రాలతో ఆడదానిని కట్టిపడవేశాడు. అధికారాలన్నీ మగవారివనీ అరవ చాకిరీ అంతా ఆడదానిదనీ నీతులు చెప్పాడు.

ఈ అవసరం అన్నదే ఆడదానికి లేకపోతే, ఆడదాని జీవనం ఇంత అధ్వాన్నంగా మారి ఉండదు. సృష్టికీ, స్థితికీ ముఖ్య కారణం అయిన ఈ గుణం ఎంతో గౌరవించవలసింది. ఎంతో పెద్ద స్థానం దీనివల్ల ఆడవాళ్ళకు ఇవ్వవలసింది.

అదంతా పోయింది. మగవాడు దీనిని సాకుగా చేసుకొని అధికారం అంతా ఆడదాని దగ్గరనుంచి గుంజుకున్నాడు. కేవలం పనిగొడ్డుగా ఆడదానిని మార్చివేశాడు. ఈ అన్యాయానికి, ఈ ఆక్రమణకు మరొక కారణం చెప్పలేము.

ఆడవారంటే బలహీనంగా ఉంటారని, వారికి బుద్ధి, ధైర్యం ఇలాంటివి ఉండవనీ, ఏమేమో కారణాలు అల్లి చూపుతారు కొందరు. ఈ వ్యత్యాసాలు ఈవేళ కనబడవచ్చును. ఈనాటి స్త్రీ లు 'నాజూకా బీబీలు' కావచ్చును. కుసుమ కోమల శరీరులు కావచ్చును. కాని, మొదటి మొదటిలో గూడా ఆడవారు ఇలాగే ఉండేవారని అనడం చాలా సాహసం అవుతుంది. చరిత్రకు ప్రత్యక్షంగా విరుద్ధమవుతుంది.

ఈ అబలలను తయారు చేసినవారము మనమే. అసలు సృష్టిలో తయారయిన ఆడది అబలకాదు. మగవాడితో అన్ని విధాలా సరిసమానంగా ఉండేది. వ్యత్యాసం అన్నది ఏదీలేదు. బలంలో, కష్టపడి పాటుపడటంలో, శత్రువులపైబడి వారిని చంపడంలో, సముద్రాలలో మునగడంలో, పెద్ద పెద్ద చేపలను పట్టడంలో - అన్నిటిలోనూ మగా ఆడా వ్యత్యాసం

లేకుండా ఉండేది. ఇప్పటికీ కొన్ని కొండ జాతులలో నలుగురు ఆడవారు, నలుగురు మగవారూ పోట్లాడితే, మగవారు దెబ్బతినకుండా బయట పడగలగడం చాలా అదృష్టమే. ఆడవారు మగవారికి తీసిపోరు. ఆడది చేయలేని పని ఒక్కటయినా మగవాడు చేయలేడు. ఆనాడేకాదు ఈనాడు గూడాను. అయితే, మనం ఆడదానికి ఆ అవకాశం ఇవ్వలేదు. అబల అంటూ, అందం అంటూ, దానిని ఒకమూల పెట్టాము. ఆఖరికి ఆడది అబలే అయిపోయింది. ఇదంతా మనం చేసిన పనే . మగవాడు సాధించినదే ఈ మహాకార్యం.

అందం–నాజూకు–అన్న పేరులతో గూడా మగవాడు మహాద్రోహం చేశాడు ఆడదానికి. నిజంచేత ఆడది అందమయినది అని చెప్పడానికి కారణమే లేదు. కొండ జాతులలోనూ, అనాది నివాసులలోనూ, ముఖాలను పట్టి చూచినా ఆడ మగ వ్యత్యాసం కనబడదు; శరీర సౌష్ఠవం పట్టి చూచినా కనబడదు. అందరు ఒక్కలాగానే ఉంటారు. కొన్ని జాతులలో, పైగా, ఆడవాళ్ళే ఎక్కువ బలంగా ఉండి పదిమంది మగవారికి జవాబు చెప్పగలిగి వుంటారు.

ఇకను, సృష్టిలో ఏమయినా ఆడదానికి అందం వుండాలన్న దృష్టి ఉందా అంటే, అది ఏమీ కనబడదు. పైపెచ్చు, మగజంతువునే ఎక్కువ అందంగా తయారుచేసినట్టు వుంటుంది సృష్టి. పిచ్చుకలలో మగ పిచ్చుక అందం, సింహాలలో మగసింహం అందం, ఏనుగులలో మగ ఏనుగు అందం, నెమళ్ళలో మగనెమలి అందం. సృష్టిలో మగ జంతువులే ఎక్కువ అందంగా వున్నాయి.

ఉండాలి గూడాను సృష్టి తత్వం ప్రకారం.

ఇలాంటి పరిస్థితులలో మనుష్యులలో మాత్రం ఆడదానిని అందంగా చేయవలసిన అవసరం సృష్టికి ఏముంది? ఎందుకు చెయ్యాలి? లేదు. సృష్టి ఆ పనిని ఎప్పుడూ చెయ్యలేదు. మనమే శతాబ్దాల తరబడిని, ఆడదానిని తీర్చి, దిద్ది, పొగిడి ఇలాగా తయారుచేశాము. బలంలేనివాళ్ళనీ, ఏమీచెయ్యలేని అబలలని–మంత్రోచ్చారణ–మెస్మరిజం చేస్తూ, ఈ రబ్బరు బొమ్మలను తయారుచేశాం. వారికున్న హక్కుల నన్నిటినీ ఊడబెరుకు కున్నాము. ఇది మంచిపనే అంటే, ఆ ఖ్యాతి అంతా సృష్టిదికాదు,

మనదే. చెడ్డపని అంటే, ఆ మహా పాపం అంతా మగవాడిదే. ఆడదానికున్న అవసరాన్ని, ఆత్మ ఆధిక్యంకోసం దుర్వినియోగం చేసుకున్నాడు-ద్రోహి అని అనవలసి వుంటుంది.

ఈ ద్రోహం అంతటితో ఆగలేదు. తన సంతృప్తికోసం ఆడదాన్ని "ఇనుప కచ్చడాల*తో" బిగించినంతవరకు పోయింది.

పైని చెప్పినట్లు అవసరం అన్నది అటు మగవాడికీ వుంది, ఇటు ఆడదానికీ వుంది. ఆడదానికి మగ దక్షత వుండవలసిన అవసరం ఎప్పుడో ఒకప్పుడు-తాను గర్భంతో వున్నప్పుడో, బిడ్డను కన్నప్పుడో - వుంటుంది. మగవాడికి ఆడదాని అవసరం ఎల్లప్పుడూ వుంటుంది-స్థిరనివాసం అన్నది ఏర్పడ్డ తరవాత. అందుచేత ఆడదాని సాయం ఎక్కువే. ఆడది వుండడం ఇంటికి చాలా ఉపయోగం-తండ్రికయినా సరే, మగనికయినా సరే.

పెళ్ళి కాకముందు ఆడది తండ్రి ఇంట్లో వుంటుంది. పనిపాట్లు చేసుకుంటుంది. ఇష్టం వచ్చినట్టు జతకట్టుతూ వుంటుంది. ఆస్తిగూడా సంపాదించవచ్చును. ఈ వృత్తిలో పిల్లలను కంటూ వుంటుంది. ఆ పిల్లలంతా తాతగారిసొత్తు. ఆ పిల్లలు గూడా పనిపాట్లలో సాయం చేస్తూ వుంటారు. ఇలాగా పనిచేసేవారు ఎంత ఎక్కువమంది వుంటే అంతమంచిదికదా?

అలాంటి ఒక ఇంటిలో నుంచి ఒక ఆడదానిని ఇంకొక మగవాడు తీసుకోవాలని కోరతాడు పెళ్ళిలో. అంటే, తండ్రికి ఉపయోగంగా ఉండి ఎంతో పనిచేస్తున్న ఒక మనిషిని ఈ మగవాడు తాను తీసుకోవాలని వస్తాడు. దీనివలన తండ్రికి నష్టం. చేయి విరుచుకున్నట్టు అవుతుంది. పనిమనుష్యులలో ఒకరు తగ్గిపోతారు. ఇంటి కంతటికీ నష్టమే అనాలి.

అందుచేతనే ఆ రోజులలో పెళ్ళిచేసుకోవడానికి వచ్చిన మగవాడు ఆ తండ్రికీ, యింటివారికీ నష్టపరిహారం ఇచ్చుకోవాలి. నాలుగు గొర్రెలనో, మూడు పందులనో - ఆ దినాలలో అవసరం బట్టి విలువగలిగిన వాటిని - తండ్రికి సమర్పించుకోవాలి - అదే ధనం. ఆ ధనం ఇచ్చి

* నా "ఇనుప కచ్చడాలు" చూడండి.

ఆడదానిని తెచ్చుకోవాలి. ఒక్కొక్కప్పుడు ఆ యింటిలో వున్న మనుష్యులందరికీ, తల కింత అని ముడుపులు చెల్లించుకోవాలి. అప్పుడుగాని, ఈ మగవాడు ఒక ఆడదానిని పెళ్ళి చేసుకోలేడు. ఆ పెళ్ళి చేసుకున్నప్పుడయినా, దానిపిల్లలు తాతగారిదగ్గర ఉండవలసినవారే- అతని సొత్తు పిల్లలనుగూడా తీసుకోవాలంటే, ఈ మగవాడు మరికొంత ఎక్కువ ధనం-గొర్రెలో, పందులో ఏవో.....ఇవ్వాలి. అలా ఇచ్చినప్పుడే ఆ ఆడదీ, ఆ పిల్లలూ, తన సొత్తుకిందకు వస్తారు. అప్పటినించీ తన సౌఖ్యంకోసం వారంతా కష్టపడతారు.

ఈ పరిస్థితులలో తెచ్చుకున్న ఆడదానిమీద ప్రేమ ఉందని అనుకుంటే ఎలాగ అవుతుంది? ఇందులో సాధారణంగా ఆ ఆడదాని ఇష్టంతో పనే ఉండదు. ఇష్టం ఉన్నా లేకపోయినా దానిని అడిగేవాడే ఉండడు. వెళ్ళక తప్పదు. ఇకను, మగవాడయినా దీనిని ఎంచుకోవడంలో ప్రేమ సంగతి ఏదయినా చూస్తాడా అంటే అది లేనేలేదు. గట్టిగా ఉక్కుముక్కలాగా పనిపాట్లు చేసుకోగలిగి ఉండాలి. వంటా, పెంటా చేసుకోగలిగి ఉండాలి. ఇలాంటి గుణాలే చూస్తాడు. ఆడదానిలో అందమూ, చందమూ అన్న దృష్టి వాడికి అసలే లేదు. ఒకవేళ ఉండక తీరదు అని అనుకున్నా, అదీ అప్రధానంగా ఉండేదేకాని ప్రధానం కాదు. ఒక జాతి నాయకుడిని "అందచందాలను గురించి మీరు ఆలోచిస్తారా" అని అడిగితే "బాగా కష్టపడి పనిచేయగలిగి ఉండాలి; అందం అంటే ఏమిటి; అదే అందం. ఇక తక్కిన సంగతులకా, ఆడవాళ్ళంతా ఒక్కలాగే కదా వుంటారు" అని గూఢార్థంతో మాటలాడాడు. ఎంపుడులో ఆ వ్యత్యాసాలు ఏమీ ఆలోచించరు. అవసరానికి తగిన ఆడది కావాలి.

ఇప్పుడూ ఆడవారిని కొనుక్కుపోయే ఆచారం మనలోనూ ఉంది. ఇప్పుడు కేవలం విక్రయం క్రిందికి రాకపోయినా ఆ లాంఛనం అంతా జరుగుతూంది.....కొంచెం వ్యత్యాసంతో. ఇపుడు కట్నాలు అన్న పేరుతో మనలో వున్న ఆచారానికి ఈ కొనుగోలు ఆచారమే మూలం. ఈ విక్రయం జరిగిన తరవాత మగవాడు ఆడదానిని తనతో తన ఇంటికి తీసుకుపోతాడు.

ఇలాగ తీసుకుపోయే పనికాబట్టే దీనిని పరిణయము అన్నారు- అంటే నడిపించుకొని తీసుకొనిపోవడం. ఈ మాటతో సప్తపదులను లంకెవేయడం సరియైన అర్థం చెప్పలేక-చరిత్ర తెలియక. ఈ బేరం ముగిసిపోయిన తరువాత మగవాడు ఆడదానిని తనవెంట తీసుకొని, దేవతను దర్శించుకొని ఇంటికిపోతాడు. పెళ్ళికి ఇంగ్లీషులో "లీడింగ్ టు ది ఆల్టార్" (పిల్లను మతపీఠము దగ్గరకు నడిపించుకొనిపోవడం) అంటారు. ఆ నడిపించడమే పరిణయము.

# చిత్రమైన పెళ్లిళ్లు

డబ్బు యిచ్చి పిల్లను తెచ్చుకోవడం దాదాపు అన్ని దేశాలలోనూ, అన్ని జాతులలోనూ ఉంది. సాధారణంగా ఈ ధనం పశువులు, పందులు, కుక్కలు- వీటి రూపంగానే ఉంటుంది. డబ్బు తీసుకోకుండా పిల్లను ఇచ్చినట్టయితే చాల అవమానం, వంశాని కంతటికీ అవమానం. డబ్బు పుచ్చుకోవాలి ఆ రోజులలో. అలాగా పుచ్చుకుంటే ఇప్పుడు అవమానం అంటాము. ఇప్పుడయినా కానుకలు, ఎదురు కట్నాలు-ఇలాంటివన్నీ ఈ బేరానికి సంబంధించిన విషయాలే.

ఈ పెళ్ళి చూడండి: స్యూగినీలో రెండు కుటుంబాల వారికి పెళ్ళి రాయబారాలు జరుగుతాయి. ఏదో శుల్కం నిర్ణయం చేసుకుంటారు- ఇన్ని పందులనో, ఇన్ని కుక్కలనో ఇస్తామని నిశ్చయం జరుగుతుంది. ఎవరి ఇళ్ళకు వారు పోతారు. ఒకటి రెండు రోజులలో ఆడపెళ్ళివారు ఒక జట్టుగా బయలుదేరి మగపెళ్ళివారి యిల్లు ముట్టడిస్తారు. అందులో ఉన్న పందులను, కుక్కలను పట్టుకొనిపోతారు.

ఇందులోని రహస్యం ఏమిటంటే-ఆడపెళ్ళివారు ఇలాగా దండెత్తి వస్తారనీ, పందులను, కుక్కలను తీసుకుపోతారని మగపెళ్ళివారికి బాగా తెలుసును. అందుచేత, ఒప్పుదల అయినన్ని పందులను, కుక్కలను మాత్రమే ఇంట్లో ఉంచుతారు. తక్కినవాటి నన్నిటిని ఎక్కడయినా దాచేస్తారు.

ఆడపెళ్ళివారు తమకు నిర్ణయం అయిన ఆ పందులను, కుక్కలను స్వాధీనం చేసుకొంటారు. బయటివారు చూస్తే, ఎలా కనబడుతుందంటే, మగపెళ్ళివారి ఆస్తి అంతా యిచ్చి ఈ పెళ్ళాన్ని తెచ్చుకున్నట్టు కనబడుతుంది.

తరవాత పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ ఒకరివీపు ఒకరికి తగులుతూ వున్నట్టు, తూర్పు పడమరలకు ముఖాలు పెట్టి కూర్చుంటారు.

పెళ్ళి కూతురు కొంత మురిపించి, కొంత ఇష్టం లేనట్టు నటించి, అందరూ చెప్పిన హితబోధలు విని, ఒక తమలపాకును వెనుకనుంచి పెళ్ళికొడుకుకు అందిస్తుంది. ఒక్కొక్కప్పుడు తమలపాకుకి బదులుగా పొగచుట్టను తాను ముట్టించి, పెళ్ళికూతురు పెళ్ళికొడుకుకి-వెనుకనుంచే-అందిస్తుంది. పెళ్ళికొడుకు తమలపాకు నమలుతాడు: లేదా, చుట్ట కాలుస్తాడు.

దానితో మూడు ముడులూ పడినట్టే. కులపెద్దలలో ఒకడు లేచి పెళ్ళికొడుకు పేరూ పెళ్ళికూతురు పేరూ రెండూ కలిపి గట్టిగా అంటాడు. దానితో వారిద్దరూ మొగుడూ పెళ్లాం అయిపోతారు. వివాహమహోత్సవం ముగిసిపోతుంది.

మరొకపెళ్ళి: మగవాడికి పెళ్ళివయస్సు వచ్చిన తరువాత-వయసు వచ్చిందని రుజువు చెయ్యడానికి అనేక పరీక్షలున్నాయి! చాలా కష్టమయిన పనిగూడాను. వాటికన్నిటికీ ఓర్చినవాడే వయసుకు వచ్చినవాడంటారు. గడ్డాలూ, మీసాలూ వచ్చినంతమాత్రంచేతకాదు......అలాగ వయసుకు వచ్చినప్పుడు, వాడితండ్రి తన సంఘంవారినందరిని పిలిపించి, తన కొడుకుకు పెళ్ళిచెయ్యాలి, కాబట్టి పెళ్ళికూతురి కివ్వవలసిన ధనం జమ చెయ్యండి అంటాడు. తలా కొంత చందా వేస్తారు. ఇంతలో ఒక పెద్ద వెళ్ళి తగిన పిల్లను-ఇది పిల్లతల్లి అయివున్నా ఫర్వాలేదు-చూచి వస్తాడు.

ఆ పిల్ల తండ్రి దగ్గరకు పశువులూ, ధనమూ వగైరాలు పట్టుకొని ఈ సంఘంవారితో పెళ్ళికొడుకు తర్లివెళ్తాడు. పిల్లతండ్రి 'ఇంకా చాలదు. మరికొంచెం వెయ్యండి' అని పెనుగులాడతాడు. ఆఖరికి ఎలాగయితేనేం, సంతృప్తిపడతాడు.

అప్పుడు పెళ్ళికూతురు తండ్రి ఏమి చేస్తాడంటే-పెళ్ళికొడుకు తండ్రి చేతిలోవున్న పచ్చి పోకకాయల గుత్తులోనుంచి ఒక పోకకాయను తుంచి, దాని తోలును పళ్లతో ఒలిచి, లోపలి వక్కను పళ్లతో రెండు ముక్కలుగా కొరుకుతాడు. ఈ కట్నాలమీద ఆ ముక్కలను మూడుసార్లు తిప్పి పెళ్ళికొడుక్కి ఒక ముక్కను, పెళ్ళికూతురికి ఒక ముక్కను ఇస్తాడు. వాళ్లు ఆ ముక్కలను నమలడమే భార్యభర్త లవుతారు.

మామగారు కోరినంత కట్నం అల్లుడు చెల్లించుకోలేని పరిస్థితులు గూడా ఉంటాయి. అలాంటప్పుడు ఎంత కట్నం ఇవ్వాలో మొదట నిర్ణయించుకుంటారు. పది పందులు అనుకోండి. ఆ పది పందులను ఒక్కసారి ఇవ్వగలిగిన శక్తి అల్లుడికి లేదు. అయిదు పందులనే ఇవ్వ గలుగుతాడు. తక్కినది అరువుగా-అప్పుగా-వుంటుంది. పెళ్ళి జరుగుతుంది. పెళ్లాముతో కాపురం చేస్తుంటాడు. అప్పున్న పందులను సంవత్సరానికి ఒకటో, ఆరు నెలలకు ఒకటో ప్రకారం రుణం తీర్చుకుంటూ వుంటాడు.

ఆ అప్పు పూర్తిగా తీరిపోయేటంతవరకు వీరిద్దరు నిజంగా భార్యాభర్తలు కారు. ఒకవేళ వీరిద్దరికీ ఒక బిడ్డ పుట్టినా-ఈ వ్యవధిలో - ఆ బిడ్డపెళ్ళికూతురు తండ్రికి చెందవలసిందే. అంటే, పెళ్ళికాకముందు పిల్లకు పుట్టిన పిల్లలతో సమానంగా చూస్తారు. అంతేగాని, భార్యాభర్తల పిల్లలుగా చూడరు.

ఒకవేళ కట్నం చెల్లించి పెళ్లాన్ని తెచ్చుకున్న తరవాత, ఆ పెళ్ళి కూతురు ఎక్కడికయినా, ఎవరితోనయినా పారిపోతే, తానిచ్చిన కట్నం పిల్లతండ్రి వాపసు చెయ్యాలి. కట్నంవల్లనే పెళ్లాం అయింది. అందుచేత పెళ్ళికూతురికి ఎప్పుడయినా ఆ భర్త యిష్టం లేకపోతే, ఆ కట్నం అతనికి పారవేసే ఏర్పాటు ఏదయినా చెయ్యాలి. దానితో పెళ్ళి సంబంధం తెగిపోతుంది. పెళ్ళికూతురు తండ్రి తన కూతురిని మరొకడికి పెళ్ళి చెయ్యాలన్నా, ఈ పనే జరగాలి. కట్నం వాపసు ఇచ్చివేయాలి. అంటే, పెళ్ళి ఎంత సులభంగా జరిగిందో విడాకులుగూడా అంత సులభమే.

ఈ పెళ్ళిళ్ళలో మరొక చిత్రం వుంది: పెళ్ళాం ఇంకొకడిని కట్టుకోడానికి చూచినా, మరొకడు ఈ పెళ్ళాన్ని తీసుకోడానికి చూచినా, అనాడిచ్చిన కట్నాలు ఈనాడు వాపసు పుచ్చుకొని విడిచిపెట్టవచ్చును. అప్పుడు ఆ స్త్రీ మీద అన్ని హక్కులూ రెండో మొగుడివే. లేదా మొదటి భర్త నాకు కట్నాలు వాపసు చేయనక్కరలేదు; కావలిస్తే నువ్వు వాడితో పో; కాని, నీ పిల్లలను నేనే వుంచుకుంటాను అని అనవచ్చును. అలా కట్నం వాపసు తీసుకోకుండా ఇంకొక భర్తకు పోయిన ఆడదానికి, అక్కడ పిల్లలు పుట్టారనుకోండి. ఆ పిల్లలు రెండో భర్తకు చెందరు. ఆ

పిల్లలు గూడా మొదటి భర్తకు చెందవలసినవారే. దీని అర్థం ఏమిటంటే- కట్నాలు వాపసు కానంతసేపు పెళ్ళి సంబంధం తెగలేదు. ఎవరికి పుట్టినా పిల్లలు మొదటి పెళ్ళి పిల్లలే అని. ఈ సూత్రం అనేక జాతులలో చాలా పురాతనంగా అంటే, సనాతనంగా వుంది.

పిల్లలమీద-ఎవరికి పుట్టినా సరే-హక్కు ఉండడం వలననే ఒక పెద్ద విపరీతం ఆచారం లోనికి వచ్చింది. పనిపాట్లకు పిల్లలు కావాలి. ఆడపిల్లలయితే వారిని అమ్మవచ్చును. పిల్లలు కనే ఆడవాళ్ళను ఆధీనంలో పెట్టుకోవడం చాలా విధాల లాభకరంగా ఉంటుంది. ఈ సిద్ధాంతం వల్ల ఆఫ్రికాలో ఒక విడ్డూరం జరుగుతూ వుంది. అక్కడ వయసయిన ముసలివారు కూడా పెళ్ళిళ్ళు చేసుకుంటారు. ఆ పెళ్ళాలు వారి ఇష్టం వచ్చిన వారితో జతకట్టుతూ వుంటారు. ఇంటిలో పనిపాట్లు చేసుకుంటూ వుంటారు. పిల్లలనూ కంటారు. ఈ పిల్లలు ఆ ముసలివారి సొత్తు.

ఇది చూచి కొందరు ఆడవారు కూడా-బాగా వయసయిన తర్వాత, చిన్న పిల్లలను పెళ్ళిచేసుకొనేవారు. పెళ్ళి తంతు అంతా మగవారి పెళ్ళిలాగానే జరిగేది. కొందరు ఆడభర్తలకు ముగ్గురు నలుగురు కూడా భార్య లుండేవారు. ఈ భార్యలకు పుట్టిన పిల్లలంతా ఆ ఆడభర్తగారి సొత్తే. ఇలాంటి ఆడభర్త ఒకర్తె పందొమ్మిది మంది భార్యలను పెళ్ళిచేసుకొని, వారి పిల్లల సంపదతో మహావైభవంగా బతికిన దానిని ఇంగ్లీషు పరిశోధకులు ఆఫ్రికాలో చూచారు.

మరొక చిత్రం: పిల్లలు లేకపోవడం ఒక దోషం అన్న అభిప్రాయం ఆఫ్రికాలో ఇటీవల కలిగింది. దానివల్లగూడా ఇలాంటి ఆడభర్తలు బయలుదేరారు. పిల్లలు లేని స్త్రీ ఏమి చేస్తుందంటే, డబ్బు యిచ్చి ఒక పెళ్లికూతురును చేసుకుంటుంది. మగవాడిలాగానే తంతు అంతా జరుగుతుంది. ఈ ఆడభర్తకు సవతులు ఎవ్వరైనా వుంటే ఆ సవతుల కొడుకు ఎవ్వడయినా, ఈ కొత్త పెళ్లికూతురుతో జతకడతారు. సవతులు లేకపోతే ఎవరినయినా ఈ కొత్త పెళ్లికూతురుతో జతకట్టడానికి నియమిస్తారు. ఈ జతకు పుట్టిన పిల్లలు ఈ కొత్త పెళ్లికూతురి పిల్లలు కారు. ఆ ఆడకూతురును ఆ ఆడభర్త మగడే (బతికివుంటే) ఎందుకు

జతకట్టకూడదో మనకు బోధపడదు. ఆస్తి అంటే వున్న ఆశ ఎంత పనినయినా చేయిస్తుంది.

ఇలా ధనం ఇచ్చి తీసుకున్న మనిషి కాబట్టి, మగవాడికి ఈ ఆడదానిమీద కొన్ని హక్కులు ఏర్పడ్డాయి. తాను దీనిని మరొకరికి ఇచ్చివేయవచ్చును-ధనానికి, లేదా, విడిచి పెట్టవచ్చును. పనుల అవసరం ఎక్కువగా ఉంటే, మరి ఒకదానినో, మరి నలుగురినో కూడా తెచ్చుకోవచ్చును. దీనిని కొట్టవచ్చును, తిట్టవచ్చును, బుద్ధిపుడితే చంపివేయవచ్చును. ఎవ్వరూ ఏమీ అడగగూడదు. ఒకవేళ తండ్రిగాని, అన్నదమ్ములుగాని ఆ ఆడదానిని కాపాడాలంటే మొదట పెళ్లికొడుకు ఇచ్చిన ధనం అంతా అతనికి చెల్లించి, తమ పిల్లను తమ ఇంటికి తీసుకొనిపోవచ్చును. అంత అధికారం తనకుంది కాబట్టి ఈ ఆడదానిని ఇతరులతో జతకట్టనీయడు. అదంతా తనకే 'మొనాపొలీ' సర్వహక్కులు. అలాగా అని పెళ్ళయిన స్త్రీలు ఇతరులతో పోకుండా వుంటారని కాదు, పండుగలలోనూ, పబ్బాలలోనూ స్వేచ్ఛా విహారం శాస్త్ర సమ్మతమే. దానికి అడ్డులేదు. అతిథులు ఎవరయినా ఇంటికి వస్తే, వారిదగ్గరకు ఈ ఆడదానిని పంపుతారు. మగవాడు ఇంటిలో లేనప్పుడు అతిథివచ్చినా, ఆడది అతనికి ఈ సదుపాయం చెయ్యవలసిందే. లేకపోతే తప్పు. మరొక్క విధంగా గూడా ఇతరులతో జతకట్టడం వుంది.

ఒక్కొక్కప్పుడు మగవారు ఇద్దరు తమ పెళ్ళాలను మార్చుకుంటూ వుంటారు. అది స్నేహలక్షణం. అంతేకాదు, ఉపయోగానికిగూడా కొంత అవకాశం వుంది. ఒక ఆడది చేయగలిగిన పని యింకొక ఆడది చెయ్యలేకపోవచ్చును. అలాంటప్పుడు మరొక ఇంటిదానిని ఎరువు తెచ్చుకోవాలి కదా! ఒకడి పెళ్ళాన్ని ఇంకొకడికి ఎరువు ఇచ్చినప్పుడు, న్యాయంగా ఆలోచిస్తే, ఇతడి పెళ్ళాన్ని అతని దగ్గరకు పంపించడం అవసరమే కదా! ఇలాంటి మార్పులు కూడా వున్నాయి. ఇటువంటి అవకాశాలలో ఇతరులతో జతకట్టడానికి వీలుంది.

తక్కిన సమయాలలో ఆ పని తగదు అన్నారు పెద్దలు. దానికి తగినట్లుగా శాస్త్రాలు చాలా వ్రాశారు. పెళ్ళి అయిన తరవాత వ్యభిచారం చాలా దోషం అన్నారు.

# మచ్చు పెళ్ళిళ్ళు

ఈ రోజులలో ఎలాటివాడయినా పెళ్ళిచేసుకోడానికి తయారు కావచ్చును. ఎంత దుర్బలుడయినా పెళ్ళాడడానికి సిద్ధం కావచ్చును. ఎలాంటి దారుణ రోగాలతో ఉన్నవాడయినా ఒక యింటివాడు కావాలని అనుకోవచ్చును. వాడిని ఆపడానికి శాసనంలేదు. వాడిని అడ్డగించడానికి సంఘానికి శక్తిలేదు. పెళ్ళాడడం అంత సులభం-ఈ దృష్టిని సుమండి-అయిపోయింది ఇప్పుడు.

ఆ రోజులలో అది అంత తేలికయిన పనికాదు. పెళ్ళి అన్నమాట తలపెట్టడానికి ముందు మగవాడు తన అర్హతను ప్రకటించాలి-మాటలతో కాదు పనులతో; తాను ఒక ఆడదానిని సమాలించుకోగలుగుతాను, పోషించగలుగుతాను అని అందరకు తెలిసేటట్టు కొన్ని కార్యాలు చెయ్యాలి. ఆడదిగూడా ఒక ఇంటికి భార్యగా వెళ్ళినప్పుడు తాను చేయవలసిన పనిపాట్లు చేయగలుగుతాను అని తన యోగ్యతను పనిపాటలతో నిరూపించాలి.

మగవాడు చూపవలసిన అర్హత బలంతో సంబంధించింది; ఆడది చూపవలసిన అర్హత ఇంటిపనులకు మాత్రమే కాదు; పిల్లలను కనగలిగిన అర్హతగూడా కనబరచాలి. పిల్లలు పుట్టడం అంతా ఆడదానివల్లనే జరుగు తుందని వారి ఆలోచన. మొదట మొదట, పిల్లలను కనడానికీ, జత కట్టడానికీ ఎలాంటి సంబంధం లేదనే అనుకొనేవారు. గాలివల్లా, తిండివల్లా పిల్లలు పుడతారనే భావించేవారుగదా!

తరవాత కొంచెం జ్ఞానం కలిగినా, పిల్లలు పుట్టడం పుట్టకపోవడం అంతా ఆడదానిమీద ఆధారపడి ఉంటుందని గట్టిగా నమ్మేవారు. అలా పిల్లలు పుట్టకపోతే ఆ తప్పు అంతా ఆడదానిదే అని వారి నిశ్చయం. కాబట్టి ఆ రోజులలో ఆడది తన అర్హతలను ఈ రెండు రూపాలుగా కనబరచాలి.

పెళ్ళిచేసుకుందుకు పూర్వమే పిల్లలుంటే, మరే ప్రకటనా అక్కరలేదు. చాలా మంచిది. అటువంటి ఆడదానిని ఎంత ధనం, పశువులను అయినా ఇచ్చి తెచ్చుకుంటారు.

అలా పూర్వసంతానం లేకపోతే ఒక ఉపాయం వుంది. వాడుకలో ఆడది పిల్లలను కంటుందో లేదో తెలుసుకోవడానికి, మచ్చు చూడడానికి-రుచి తెలుసుకోవడానికి-పెళ్ళి చేసుకుంటారు. ఈ పెళ్ళి స్థిరమయిన పెళ్ళికాదు. కానీ, ఆడదీ మగవాడూ భార్యా భర్తలుగానే కాపురం చేస్తూ జతకట్టూతూ ఉంటారు. ఈ జంటకు పిల్లలు పుట్టినప్పుడే ఈ పెళ్ళి స్థిరపడుతుంది. ఒకవేళ పుట్టకపోతే-ఇకను పుట్టరు అన్న నమ్మకం కలిగినా సరే-ఈ మచ్చు పెళ్ళి ఉత్త ఉత్త పెళ్ళి అయి ఊరుకుంటుంది. పెళ్ళి పెడాకు లవుతుంది.

అందుచేతనే అనేక జాతులలో పెళ్ళి లాంఛనాలు అన్నీ జరిగినా సంతానం కలిగినదాకా ఆ పెళ్ళి పెళ్ళికింద లెక్కచేయరు. పిల్లపుట్టిన తరవాతనే వారికి సరియయిన పెళ్ళి అయినట్టు.

బెంగాల్ ప్రాంతంలో, ఇప్పుడుగూడా, ఒక బిడ్డ పుట్టేటంతవరకు భర్త భార్యను బిగ్గరగా పిలవడు. పిల్ల పుట్టిన తరువాతనే అతడికి భార్యను పిలిచే హక్కు కలుగుతుంది. అప్పుడయినా ఏమని పిలుస్తాడు? బిడ్డ పేరు ముకుంద్ అయితే "ఓ ముకుంద్ అమ్మా" అని పిలుస్తాడు. అంతే, ఆమె పేరు పెట్టి పిలవడు.

పిల్లలు పుట్టరు అన్న నమ్మకం కలగడం, కలగకపోవడం స్థిరమయిన సంగతులు కావు . అభిప్రాయ భేదాలు వస్తాయి. అందుచేత ఈ రుచి పెళ్ళిళ్ళకు చాలా ప్రతిబంధకాలూ, తగవులూ కలిగాయి. ఇదిచూచి, మరొక ఉపాయం ఆలోచించారు. అయిదు సంవత్సరాలు భార్యాభర్తలుగా ఉండడం-ఈలోగా పిల్లలు పుట్టారా, పెళ్ళి స్థిరం అయినట్టు; లేదా పెళ్ళి తెగిపోయినట్టు-అని ఏదో ఒక గడువు పెట్టుకొని, అన్ని లాంఛనాలతోనూ పెళ్లి చేసుకుంటారు. ఆ గడువు కాలందాకా కాపురం చేస్తారు. ఈలోగా సంతానం కలిగిందా, ఆ పెళ్ళి స్థిరం అయినట్టే, లేదా ఎవరిదారి వారిదే. వాడు ఇంకొకదానిని గడువు పెళ్ళి చేసుకోవచ్చు. ఇది ఇంకొకడిని అలాగనే పెళ్ళి చేసుకోవచ్చును.

మచ్చు పెళ్ళిలో నయినా, గడువు పెళ్ళిలో నయినా, పిల్లలు పుట్టక పెళ్ళి తెగిపోయినపుడు, మొదట పెళ్ళి లాంఛనాలలో అల్లుడు మామగారి కిచ్చిన ధనం-పశువులో ఏవో- అంతా మామగారు అల్లుడికి వాపసు ఇవ్వాలి. అంటే, శుల్కం వాపసు చెయ్యాలి. ఆడది కన్యగానే తండ్రి ఇంటికి వచ్చి చేరుతుంది.

కొన్ని జాతులలో మామ కొంత ఔదార్యం గూడా చూపిస్తాడు. ఏమిటంటే-ఇన్ని రోజులూ తన కూతురిని పోషించి ఉంచినందుకు అల్లుడికి కొంత బహుమానం గూడా ఇస్తాడు.

మగవాడు పెద్దవాడయినప్పుడు, పెళ్లికి ఉద్దేశించినప్పుడు, వాడికి చాలా కఠిన పరీక్షలు ఉన్నాయని మనవి చేశాను కదా! పరీక్ష ఎందు కంటారేమో; పెళ్ళిచేసుకోగానే, ఒక ఇంటికి యజమాని కావాలి. అంటే కొన్ని గుణాలు వాడిలో వుండాలి. ఇంకొక దానినో, పదిమందినో పోషించేశక్తి వుండాలి. ఊరికే సాయిలా పాయిలాగా తిరగడంకాదు. దానితోనూ, దీనితోనూ జతకట్టడం కాదు. ఇంటిభారం మొయ్యాలి. అందుచేతనే ఈ పరీక్షలు-చాలా కఠిన పరీక్షలు. ఇందులో కొన్ని తన బలగంవాళ్ళే చేసే పరీక్షలు, కొన్ని ఆడపెళ్ళివాళ్లు చేసేవి. ఇటు ఈ వంశం అంగీకరించాలి. అటు ఆ వంశం అంగీకరించాలి గదా?

పెద్దవాడయి పెళ్ళికోసం చూస్తున్నాడనేసరికి ఆ కులపెద్దలంతా, ఒక సభ చేస్తారు. ఆ సభలో ఈ వరుణ్ణి పెట్టరాని బాధలన్నీ పెడతారు. కొడతారు. తంతారు. తిండిపెట్టక బాధిస్తారు. కఠినమైన పనులన్నీ చెయ్యమంటారు. అన్నీ చెయ్యాలి; ఏడవకూడదు; చెయ్యలేననకూడదు. ఒక్కొక్కప్పుడు ఈ పరీక్షలలోనే-తనవారు పెట్టే పరీక్షలలోనే-ఆ కుర్రవాడు సొమ్మసిల్లిపోవడం, ఒక్కొక్కప్పుడు చచ్చిపోవడం కూడా వుంది. అంత కఠినంగా వుంటుంది. ఆ పరీక్ష. పరీక్షకు నిల్వలేనివాడు చచ్చిపోతేమాత్రం జాతికి లోటేమిటి? అన్నది వాళ్ల ఉద్దేశం. మనం పెట్టే బాధలకే ఓర్చుకోలేనివాడు, శత్రువులు పెట్టిన బాధలకు ఎలా నిల్వగలుగుతాడు? అన్నది వారి దృష్టి . పొల్లు వెధవలు అందరూ పోవలసిందే అని వారి సిద్ధాంతం.

ఇక ఆడపెళ్ళివారు చేసే పరీక్ష; పెళ్లిచేసుకోవాలి అన్న సూచన చేయడానికి ముందుగా, వరుడు తన ప్రయోజకత్వం ఆడపెళ్ళివారికి కనబరచాలి. ఒక్క శత్రువును చంపి అతని తలను తెచ్చి సమర్పించాలి. లేదా పెద్ద జంతువును దేనినయినా చేతులార చంపి, దానిని వారికి చూపించాలి.

'మనుషులను ఎందుకు చంపాలయ్యా పెళ్ళిచేసుకోడానికి?' అని ఒక సోమాల్ జాతి నాయకుడిని అడిగితే, అతడు చెప్పిన జవాబు చూడండి: "పెళ్లిచేసుకొని పిల్లను కంటే, ఆ పిల్ల ఉండడానికి జాగా ఏది? ఇంకొకడిని చంపి జాగా ఖాళీ చెయ్యాలికదా!" అని సూక్ష్మంగా జవాబు చెప్పాడు.

ఇలాంటి పరాక్రమం కనబర్చలేనివారిని ఆడపెళ్ళివారు కొన్ని పరీక్షలు చేస్తారు. మెడగాస్కర్‌లో పెళ్ళికొడుకు అవాలని వచ్చినవాడి చాకచక్యం ఎలాగ పరీక్షిస్తారంటే-వరుడ్ని ఒక దగ్గర నిల్చోపెడతారు. నలుగురయిదుగురు ఆడపెళ్ళివాళ్లు దూరంగా నిల్చుని వాడివైపు సూటిగా ఈటెలు విసురుతారు. పెళ్ళికొడుకు వాటి నన్నిటినీ చేతులతో పట్టుకొని చంకన ఇముడ్చుకోవాలి. ఒక్క ఈటె అయినా తప్పకూడదు. ఇలాంటి పరీక్షలో ఈటెను వాడు పట్టుకోలేకపోవడమూ, అది తగిలి పెళ్ళికొడుకు పరలోకానికి పోవడమూ గూడా జరుగుతుంది. పోతే పోయాడు. అలాంటి పనికిమాలినవాడు అల్లుడు కావటం ఏమిటి; సిగ్గుచేటు!

అప్పర్ ఈజిప్టులో పెళ్ళికొడుకును పట్టుకొని ఆడపెళ్ళివారు నలుగురయిదుగురు కొరడాలతో చావ మోదుతారు. ఏడవకుండా, నవ్వుకుంటూనే వరుడు ఆ దెబ్బలను భరించాలి. లేకపోతే పెళ్లాం దక్కదు.

బాగా మత్తెక్కి ఉన్న ఆబోతుకొమ్ముకు ఒక గుడ్డ కడతారు ఆడపెళ్ళివారు. దానిని రెచ్చగొట్టి విడిచిపెడతారు. పెళ్ళిచేసుకోడానికి వచ్చిన అబ్బాయి, ఆ ఎద్దుకొమ్మున ఉన్న గుడ్డను లంకించుకొని రావాలి. ఒక్కొక్కప్పుడు పెళ్ళికి రావడానికి బదులు పెళ్ళికొడుకు స్వర్గానికే వెళ్తాడు.

ఇద్దరు పెళ్ళికొడుకులు ఒక పిల్లకోసం వస్తే ఒక్క ఉపాయం వుంది. పెళ్ళికూతురు దగ్గర అటు ఒకడు, ఇటు ఒకడు కూర్చుంటారు. పెళ్ళికూతురు ముసిముసిగా నవ్వుకుంటూ ఒక చిన్న కత్తిని తీస్తుంది. ఆ కత్తిని వీడితొడలోనూ బాగా గుచ్చుతుంది, వాడి తొడలోనూ గుచ్చుతుంది. రక్తం వచ్చినా, దానికి ఏమీ అభ్యంతరం లేదు. ఎవరు ఎక్కువసేపు ఓర్చుకుంటాడో వాడిని పెళ్లి చేసుకుంటుంది.

ఒక కొండజాతిలో మరొక ముద్దయిన అలవాటుంది. పెళ్ళి కొడుకూ పెళ్ళికూతురూ ఒక పొదలోనికి వెళతారు. అక్కడ పెళ్ళి కూతురు నిప్పుచేసి, దానిలోనిది ఒక కొరివిని పట్టుకొని, దానితో పెళ్ళికొడుకును కాలుస్తుంది-భుజంమీదనో, రొమ్ముమీదనో. అమ్మో అని అన్నాడా, మరి వాడికి పెళ్ళిలేదు.

కొందరు పెళ్ళికొడుకును ఇల్లు కట్టమంటారు. మరికొందరు మామగారి ఇంటిలోనే వుండి కొంతకాలం చాకిరీ చేయమంటారు- వాడు ఎంత ధనవున్న వాడయినా సరే, కష్టపడి, కష్టాలకు ఓర్చి వుండగలిగితే పిల్లనిస్తారు; లేదా పొమ్మంటారు.

మనదేశంలో గూడా ఈ పరీక్షలు ఉండేవి. విల్లువంచడాలు, మత్స్యయంత్రం కొట్టడాలూ ఇలాంటివన్నీ ఈ పరీక్షలే. మామలు తమ కూతుళ్ళను పనికిమాలిన దేబెలకు ఇవ్వడానికి ఇష్టపడరు. అందుచేతనే ఈ పరీక్షలు. ఈ పరీక్షలలో తేరినవాడే కురూపి అయినా, క్రోధి అయినా అల్లుడు.

ఈ వివాహాలలో ప్రేమ అన్నది ఎంతవరకుందో వేరే చెప్పనక్కర లేదు. వధూవరుల ఇష్టాయిష్టాలతో అప్పుడు పనేలేదు. ఉపయోగం అన్నమాట ఒక్కటే చూచేవారు. ఆ పరీక్షలో తేరినవాడిని తప్పకుండా ఆడది పెళ్ళి చేసుకోవాలి.

నాజూకు మీరిన తరువాత, బలం పరీక్ష చేయడంపోయి, తెలివితేటలు పరీక్ష చేయడం ఆరంభించారు. మర్చెంట్ ఆఫ్ వెనిస్‌లో వున్నట్టు, ఏదో ఒక చిక్కు ప్రశ్న ఇవ్వడం; దానినిబట్టి పెళ్ళిచేసుకోవడం. లేదా, కఠినమయిన సమస్య ఇవ్వడం. దానిని పూర్తిచేసినవారిని పెళ్ళిచేసుకోవడం-ఇలాంటివి మన కథలలో లక్షలున్నాయి.

ఇప్పుడు మనకు అవన్నీ చిత్రకథలులాగానే వుంటాయి. కాని, వాటికి మానవ చరిత్రలో గట్టి స్థానం వుందని అనుకోము. వివాహము-దాని పరిణామములలో, ఒక అంచీలో అవి చాలా ఆవశ్యకమయిన విషయాలే అన్న సంగతి మరచిపోతాము. అసలు ఆ అభిప్రాయాలు మారిపోయినా, ఆ లాంఛనాలూ, ఆ చిన్నెలూ ఇంకా మనలో వున్నాయని గ్రహించలేము.

ఇప్పుడు గూడా, మన ఇండ్లలో ఈ పరీక్షలు జరగకపోలేదు. ఈ పరిశీలన లేకుండానే పెద్దలు పెళ్ళిళ్లు చెయ్యరు. పెద్దవారి పెద్దరికంతో పనిలేకుండా జరిగిన పెళ్లిళ్ళలోనుగూడా, ఇంకొకరకంగానయినా, ఏదో కొంత పరిశీలనా కొంత పరీక్షా వుంటాయి.

ఒక అమ్మాయి, తన్ను పెళ్ళిచేసుకోమని వెంట తిరుగుతూ వున్న ఒక కుర్రవాడికి ఏమి పని పెట్టిందో తెలుసునా? ఒక రంగంలో సింహాలు రెండు పోట్లాడుతూ వుంటే, తన చేతిగుడ్డను ఆ రంగంలోకి జారవిడిచింది; పెళ్ళికొడుకువైపు చూచింది-దానిని తెచ్చి నాకిస్తేనే నీ ఆశలకు వీలుంటుంది-అన్నట్టు చూచింది. బుద్ధిమంతుడు. అతడు గ్రహించాడు. సరే అని సింహాలు అటు ఎక్కడో పోట్లాడుతూవున్న సమయం చూచి, గభాలున రంగంలోనికి ఉరికి, ఆ చేతిగుడ్డను పట్టుకొని బయటకు వచ్చాడు. అమ్మాయి దగ్గరకు వెళ్లి "ఇదిగో! నీ చేతిగుడ్డ. నేను వెళ్తున్నాను" అని చెప్పి, మరి దానిముఖం చూడలేదు.

ఇలాంటి పరీక్షలు చాలా జరుగుతున్నాయి. అవి ఎప్పుడూ వుంటాయి. కాని, మన ముత్తాతలలాగా అంత దౌర్జన్యానికి పోము. ఆడవారిని గురించి గూడా ఇలాంటి పరీక్షలున్నవే. ఇప్పటికీ ముక్కూ మొగమూ చూడడమే కాకుండా, వంటా, పెంటా, పాటా, మాటా, నడకా, పడకా-ఇలాంటివన్నీ పట్టిపట్టి పరీక్ష చేస్తూ వున్నవారు లేకపోలేదు.

# తాళి - గాజులు

నాగరకత ఎక్కువ కాకముందు, ఒక జట్టు ఇంకొక జట్టుతో పోట్లాడుతూ వుండడం సహజం. మంచి నాగరకుల మనుకునే యూరోపియనులలో ఈనాడు ఈ కొట్లాటలుండనే వున్నాయి కదా! అలా పోట్లాడినప్పుడు, ఓడిన జట్టు వారి ఆస్తి ఏది దొరికినా, అది గెలిచిన జట్టువారిదే. ఈ హక్కును సమర్థించవలసిన అవసరంలేదు. కాదనడానికి వీలులేదు.

అలా ఒక జట్టును ఓడించినప్పుడు ఓడిన జట్టువారి ఆడవాళ్ళు గూడా గెలిచిన జట్టు చేతిలో పడవచ్చు. అప్పుడు ఈ ఆడవాళ్ళను ఏమి చేస్తారు? మొదటి రోజులలో, పెళ్లి బంధకాలు ఇంకా తయారుకానప్పుడు, ఇలాగా చేజిక్కిన ఆడవాళ్ళు ఈ జట్టులో వున్నవారందరికీ ఉపయోగానికి వచ్చేవారు. జట్టువారంతా వాళ్ళకు వరసవారే....జతకట్టడానికి. తమ జట్టులోనున్న ఆడవాళ్ళకన్నా వీళ్ళ అంతస్తు తక్కువగా వుండేది.

మరికొన్నాళ్ళు పోయినతరువాత అందరికీ సంతర్పణ పెట్టడం మానుకొని, ఎవడు పట్టుకొని తెస్తాడో వాడికే ఆ ఆడదానిమీద అధికారం ఇచ్చారు. ఈ పట్టుకున్నవాడి ఇష్టంమీద ఆ ఆడది ఎవరితోనయినా జతకట్టవచ్చును. అంటే, స్వేచ్ఛా విహారానికీ కొంచెం నిరోధం కలిగింది. ఇలాగా ఎందరు ఆడవాళ్ళని ఎత్తుకొని వచ్చినా తప్పులేదు. పైగా, గొప్ప గౌరవం కూడాను. ఒక ఆస్ట్రేలియా కొండజాతివాడికి ఒక్క సమయంలో 23 గురు అలాంటి ఆడవాళ్ళున్నట్టు చూచినవారు వ్రాశారు. అతడు ఒక పెద్ద వీరుడు.

ఆ రోజులలో ఇలా పట్టుకొని రావడం-ఎత్తుకొని రావడం- అన్నదే నిజమయిన ప్రత్యేకత. అలా తెచ్చుకోగలవాడే పెళ్ళి ఆడడానికిగాని, పెళ్ళాన్ని కలిగి ఉండడానికిగాని అర్హుడు. ఈ ఆచారం ఉండడంవల్ల,

ఈ జట్టువారు ఆ జట్టువారి ఆడవారినీ, ఆ జట్టువారు వీరి ఆడవాళ్ళనూ పట్టుకుపోతూ ఉండడం, పోరాటాలు సాగుతూనే ఉండడం, సాధారణంగా జరుగుతూనే ఉండేవి. ఈ ఆచార బలాన్ని చూసుకొనే, కొన్ని సంఘాలలో "ఎక్సాగమీ" పద్ధతి వచ్చిందని అనుకోవాలి. అంటే, పెళ్లి చేసుకోవాలన్నవాడు తన జట్టులోనుంచి పెళ్లిచేసుకోకూడదు; ఇంకొక జట్టు నుంచే పిల్లను తెచ్చుకోవాలి అన్న సిద్ధాంతం బయలుదేరిందని.

నిజంచేత ప్రత్యేక హక్కులను కలిగించిన అవకాశం ఎత్తుకువచ్చే పద్ధతివల్లనే కలిగిందని అనాలి. ఆ తరవాతనే ధనం ఇచ్చి పెళ్ళిచేసుకోవడం మొదలయిన పద్ధతులు ఆచారంలోనికి వచ్చాయి అని చెప్పాలి. ఈ పద్ధతి పురాతన చరిత్రలో, ఎక్కడ చూస్తే అక్కడ కనబడుతుంది. ఆఫ్రికాలో, అమెరికాలో, ఆసియాలో, ఆస్ట్రేలియాలో, యూరపులో సర్వత్రా ఇలాంటి ఆచారం ఉండేదని నిర్ధారణ చెయ్యడం చాలా సులభం.

మన పురాణాలలో ఇలాగా శత్రువులను ఓడించి తెచ్చిన ఆడవాళ్ళ నందరిని ఆధీనంలో ఉంచుకోవడం ప్రత్యక్షంగా కనబడుతూ ఉంది. నిన్న మొన్నటిదాకా యుద్ధాలు జరిగినప్పుడు ఓడిపోయినవారి స్త్రీలకు కలిగిన అవమానాలు చదువుతూనే ఉన్నాము. రాజపుత్రులలాంటి వీరులు అటువంటి అవస్థలు రాకుండా వుండాలన్న ఉద్దేశంతోనే, మొదట ఆడవాళ్ళను చంపి, తరవాత యుద్ధరంగానికి వెళ్ళేవారని అంటారు. బొబ్బిలిలో మల్లమ్మదేవి చేసిన పని ఇదే.

కృష్ణుడు రుక్మిణిని ఇలాగే పెళ్లి చేసుకున్నాడు. భీష్ముడు తన తమ్ముడికోసం ఇలాగనే భార్యలను తీసుకొని వచ్చాడు. అర్జునుడు సుభద్రను ఎత్తుకురావడం గూడా ఈ శీర్షిక కిందకు రావలసినదే-బలరాముడు ససేమిరా అని అంగీకరించకుండా ఉంటే ఇలాంటి నిదర్శనాలు వేలకొద్దీ ఉన్నాయి. వీటినిబట్టి ఆ ఆచారం ఎంత బలంగా ఉండేదో తెలుస్తుంది.

ఇక్కడ చెయ్యవలసిన పని అంతా ఏమిటంటే, ఒక జట్టులోవున్న ఆడదానిని ఎలాగయినా-నయాన్నో భయాన్నో-ఎత్తుకొని రావాలి. ఆ జట్టువారికి దొరకకుండా, సురక్షితంగా ఇల్లు చేరుకున్నాడా చాలు-అది

వీడికి పెళ్ళామే. ఎవ్వరూ ఈ హక్కును ప్రశ్నించరు. తప్పించుకొని ఎత్తుకురావడమే ప్రధానం. మళ్ళీ ఎవడయినా వచ్చి, వీడి దగ్గరనుంచి ఆడదానిని ఎత్తుకుపోయినదాకా, అది వీడి భార్యగానే భావిస్తారు. ఆ తరవాత ఆ రెండోవాడే దానికి భర్త.

రామాయణంలో సీతమ్మ, ట్రోజన్ యుద్ధంలో హెలెన్-ఇలాంటి సీతమ్మలంతా-ఈ పద్ధతి కిందకు వచ్చినవారే. గెలిచినవాడిదే హక్కు. అలాగా ఎత్తుకురావడంలో దొరికిపోయాడా? ఇకను వాడిగతి చెప్పతరం గాదు. చావగొట్టి చెవులు మూస్తారు. ఆఫ్రికాలోని కొన్ని జాతులవారయితే వాడిని ముక్కలు ముక్కలుగా కోసి తిని జీర్ణించుకొనేవారు.

ఆస్ట్రేలియాలో ఇప్పటికీ ఒక ఆచారం ఉంది: ఆడదానిని ఎత్తుకుపోయేవాడు ఎవడయినా వారి చేతికి దొరికాడా, వాడిని కొంచెం దూరంగా నిలబెట్టి, యీ జట్టువారంతా బల్లేలు విసురుతారు వాడిమీద; ఆ బల్లేలనన్నిటినీ పట్టుకొని సమాలించుకోగలిగితే బతుకుతాడు. లేదా ఆ బల్లేలకే బలి అయిపోతాడు. తిరిగి ఇంటికి రాడు.

నాజూకు మీరిపోయిన తరవాతను గూడా, పెళ్ళిళ్ళలో ఈ ఎత్తుకుపోయే లాంఛనాలు ఉన్నాయి. ధనం యిచ్చి పెళ్ళి చేసుకునే దినాలలోను గూడా పెళ్లికొడుకు యుద్ధం చేసినట్టూ, వారిని ఓడించి ఆడదానిని ఎత్తుకు వచ్చినట్టూ, ఒక నటన జరుగుతుంది. అదే పెళ్లి తంతు. ఆ తంతు జరిగిన తరవాతనే అది పెళ్ళాం అవుతుంది. అది జరగకుండా ఎంత ధనం ఇచ్చినా సక్రమంగా పెళ్ళి కాలేదన్న మాటే.

ఇది కేవలం అనాగరిక దినాలలోనే కాదు. గ్రీసు నాగరకత దినాలలో గూడా ఈ లాంఛనం ఉండేది. హీబ్రూలలోనూ, బైబిల్‌లోనూ ఇలాంటి నిదర్శనాలు అనేకం ఉన్నాయి. ఈ గల్లంతు లేకపోతే పెళ్ళే లేదు-బెర్జెల్ పరిశోధకుడు చెప్పినట్టు "కొట్టుకోకపోతే కట్టుకోవడం (పెళ్ళి) లేనేలేదు."

గ్రీసులో ప్రశాంత దినాలలో గూడా, సఖ్యంతో పెళ్ళిళ్ళు చేసుకున్నప్పుడు గూడా, పెళ్లికూతురు తలవెంట్రుకలలో ఒక బల్లెం దూర్చేవారు-బల్లెంతో సాధించి తెచ్చాము అని తెలియచేయడానికి. అదే లాంఛనం.

తార్తారులలో పెళ్లికూతురు మెడకు ఒక రుమాలు చుట్టి, తలలో ఒక బాణం దూరుస్తారు. బాణాలతో ఓడించి పశువును తెచ్చినట్టు మెడకు గుడ్డచుట్టి తీసుకురావడం అన్నమాట.

తార్తారులు చుట్టిన చేతిగుడ్డకు బదులుగా ఒక తాడు చుడితే-అదీ ఆ లాంఛనమే అవుతుంది. తాడుకు బదులు దారం వేసినా, అర్థం అంతే. అదే గళసూత్రము; అదే మంగళసూత్రం అని తరవాత గొప్పగా చెప్పుకుంటాము. ఈ మంగళ సూత్రానికి తాళిబొట్టు ఉండనక్కరలేదు. కేవలం తాడే చాలును. ఈ తాడయినా, ఈ ఇండియాలోనయినా, అన్ని చోట్లా ఒక్కలాగా లేదు. తాడున్నా, తాళిబొట్టు సంగతి ఎరుగని వారూ చాలామంది ఉన్నారు.

ఇష్టంమీదనూ, బేరసారాలమీదనూ గూడా, న్యూగినీలో పెళ్లి కూతురును రాత్రికి రాత్రి దొంగతనంగా పెళ్లికొడుకు ఎత్తుకు రావాలి. తరవాతనే పెళ్ళీ, వేడుకలున్నూ.

న్యూ హెబ్రిడీస్‌లో పెళ్ళికొడుకు స్నేహితుడు ఒకడు-వీడే బెస్టుమాన్ అనిపించుకొని, మొదటి నిద్రకు హక్కుదారుడవుతాడు-రాత్రి దొంగతనంగా పెళ్లికూతురు ఇంట్లో జొరబడి, నిద్రపోతూ ఉన్న దాని చేయి పట్టుకుంటాడు. పాణిగ్రహణం అయింది. కాని, పెళ్లికూతురు మనుష్యులంతా చిన్న చిన్న కర్రలు పట్టుకొని వీడిని తలా ఒక దెబ్బ కొడతారు. లాంఛనం రూపంగా ఉంది. కాబట్టి, ఇలా అయింది. కాని, ఇదే నిజం అయితే, చావమోదేవారనే చెప్పాలి. తరవాతనే పెళ్లి.

వోగోగో జాతిలో ఇంకొక చిత్రం ఈనాటికీ ఉంది. ఈ పెళ్ళి కొడుకు స్నేహితుడు పెళ్లికూతురిని భుజాలమీద ఎక్కించుకొని పోతాడు.

సామాలీలాండులో పెళ్ళికొడుకే ఇలా ఎత్తుకుపోవాలి. కోర్యాక్ జాతిలో ఎంత ఇష్టం ఉన్న పెళ్లికూతురయినా, పెళ్లిలో తన్నుకొని, రక్కుకొని, కొట్టుకొనిగాని మొగుడుతో పోదు.

మంగోలియా జాతిలో పెళ్ళిలో మొదటిరోజు ఆ పెళ్ళివారూ ఈ పెళ్ళివారూ చిన్న పోరాటం సాగించినట్టు నటించాలి. అస్సాంలో పెళ్ళికూతురును ఇంటికి తెస్తూ ఉండిన దారిలో ఆడ పెళ్లివారు కాచి ఉండి, మగ పెళ్ళివారిమీద పడినట్టూ చిన్న యుద్ధం జరిగినట్టూ నటిస్తారు.

దక్కన్‌లో ఒక అనాగరక జాతి పెళ్లికొడుకు ఒక పిల్లను వీపున వేసుకొని ఎత్తుకొస్తూ ఉంటాడు. పెళ్లికూతురు ఏడుస్తూ ఉంటుంది. ఆ పిల్ల స్నేహితురాళ్ళు రాళ్లు విసురుతారు. ఇంటికి తెచ్చిన తరవాత నాలుగు వీశెల బరువుగల ఇత్తడిగాజులు దాని చేతులకు తొడుగుతారు. మొదటిలో పెళ్ళికూతురికి మూడు రోజులదాకా సంకెళ్లే వేసేవారు. ఆ ఆచారమే ఈ గాజుల ఆచారంగా పరిణమించింది. ఇప్పటికీ ఓఢ్ర దేశంలో ఎంత బరువు ఇత్తడి గాజులు వేస్తే అంతగొప్ప. గాజుల విలువనుబట్టి యీ గొప్పతనం రాలేదనీ, సంకెళ్ళ సూచనవల్లనే ఆ గొప్పతనం కలిగిందనీ, వేరే చెప్పనక్కరలేదుకదా? సవర జాతిలో ఈ ఎత్తుకుపోవడమే చిరకాల ఆచారం.

కొచ్చిన్ చీనాలో పెళ్ళికొడుకు రాత్రికి రాత్రి పెళ్ళికూతురి ఇంట్లో దూరి, అమాంతంగా దానిని కౌగలించుకుంటాడు; తన పయిబట్టతో తన్నూ పిల్లనూ కలిపి కట్టుకుంటాడు-ఆడపెళ్ళివారంతా వచ్చి తిడతారు. కొడతారు గూడాను-లాంఛనంగానే లెండి. బ్రహ్మముడి వేసుకున్నా రన్నమాట.

టిబెట్, భూటాన్, కొరియా-ఇలాంటిచోట్ల యీ ఎత్తుకుపోయే లాంఛనా లున్నాయి ఇంకా.

ఈ ఆచారం ఇంత బలీయంగా ఉంది. దీనిని కాదన్నవారు లేరు. యుద్ధాలు జరుగుతూ ఉన్నన్నినాళ్లూ, ఈలాంటి పిల్లలు దొరకడానికి అవకాశం ఉంది. గెలిచినవారికి అంత నీతి ఉండడం కష్టం- ఏ జాతి వారయినా సరే, ఇది ఎప్పుడూ ఉన్న సంగతే. అందుచేత మన ధర్మ శాస్త్రాలవారు ఈ పద్ధతిని మరచిపోలేకపోయారు. ఈ పెళ్ళిళ్లను గురించి గూడా వ్రాయక తప్పిందికాదు. వీటిని రాక్షస వివాహాలన్న పేరున అంగీకరించారు. కొంచెం తక్కువగానే చూచారు. ఈ వివాహాన్ని, సాక్షాత్తు మహావిష్ణువే కృష్ణావతారం ఎత్తి ఇలాగా చేసినా దీనిని నీచ వివాహంగానే వ్రాశారు.

బ్రాహ్మణ మంత్రాలు లేకుండా పెళ్ళి జరిగిపోతూ ఉంటే చూచి ఊరుకోలేకపోయారు. నీచ వివాహం అన్నారు. ఉడుకుమోతుతనం తప్ప మరొకటి కాదు. లేకపోతే రుక్మిణి పరిణయం నీచ వివాహం అని ఎవరంటారు?

నీచ వివాహం అన్న తరువాత గూడా ఆ పెళ్ళికూతురికి పాతివ్రత్యం ఉండాలన్నారు. ఆ పెళ్ళిళ్ళతో సమానమే అన్నారు. వాటిలాగా ఇదీ శాశ్వత సంబంధమే అన్నారు. అంటే అర్థం ఏమిటి? ఈ నీచ వివాహంతో ఆ ఉత్తమ వివాహాలు సమానమే అని అంగీకరించారు. ఈ పెళ్ళి ఉత్తమం అయిపోయిందా? తక్కినవిగూడా నీచమయిపోయాయా? తలా తోకా లేని ధర్మసూత్రాలుగాని!

ఒకవేళ ఇంకొకడు కృష్ణుడ్ని ఓడించి రుక్మిణిని ఎతుకుపోయివుంటే, అతని వివాహాన్ని గూడా ఈ ధర్మపన్నాల ప్రభువులు అంగీకరించేవారేనా? అప్పుడు పాతివ్రత్యానికి అర్థం ఎలా సాగదీస్తారో?

ఎత్తుకుపోవడం చాలా ఆచారంగా వుండేది. పెళ్లికూతురును భుజాలమీద ఎక్కించుకునే పోయేవాడు-పెళ్ళికూతురు ఇష్టం లేనట్లు నటించాలి కాబట్టి సాఫీగా నడవదు-అందుచేత మోసుకు వెళ్ళాలి. తోడిపెళ్ళికొడుకయినా సరే. వాడిమీద పెళ్ళికూతురు ఎక్కవలసిందే. మొగుడి మీద ఎక్కినదే పెళ్ళికూతురు-ఆలుగూడాను. సంస్కృతంలో వరారోహ అంటే ఆలు (భార్య), వరుడ్ని ఆరోహించేది. అంటే, మొగుడు మీద సవారీ చేసేది అని రూఢి అయిన అర్థం. అంతరార్థం ఏదీలేదు. ఆచారం గూడా ఆ రోజులలో అలాగే వుండేది. కాని, కొందరికి ఇది చిన్నతనంగా కనిపించింది. కాబట్టి వర-శ్రేష్టమయిన, ఆరోహ-పిరుదులు కలది అని శృంగార రస అర్థం చెప్పారు. డొంక తిరుగుడు అర్థం అని దీనిని చదివిన వారికి తేటపడుతుంది.

ఇలాంటి డొంక తిరుగుడర్థాలు మనవారు చాలా చెప్తుతారు. మరొక్కటి మనవి చేస్తాను. ఓమం (వాము) అన్న వస్తువుకి 'అజామోద' అని సంస్కృతం. దానికీ అజమంటే మేక, ఆమోదమంటే వాసన. కాబట్టి "మేకవంటి వాసనకొట్టేది" అని దానికి అర్థం చెప్పారు. వాము మేక వాసనంటే నవ్వుతాం. అసలు సంగతి పూర్వం ఈ వాము అరేబియా దేశంలోని "అజా (ర్) మత్" ప్రాంతంనుంచి వస్తూవుండేది. దానికి ఆ ప్రాంతం పేరునే పెట్టారు.

# ముసుగులో ముచ్చట్లు

మచ్చు పెళ్ళిళ్ళు రావడం అంటే, వధూవరుల ఇష్టాలకు అయిష్టాలకు కొంత గౌరవం ఇవ్వడం అన్నమాట. దానివల్ల ఆడది మగవాడికి నచ్చడం, మగవాడు ఆడదానికి నచ్చడం తేలిపోతుంది. నచ్చకపోతే కథే ఆగిపోతుంది. కాని నచ్చినంతమాత్రాన వారిద్దరూ శాశ్వతంగా భార్యాభర్తలయి ఉండిపోతారని అనుకోగూడదు. నచ్చినంతసేపే దాంపత్యం. నచ్చనప్పుడు, భార్యలమ బదిలీ చేసుకోవచ్చు-అంటే, ఒకడు తన భార్యను ఇంకొకడికిచ్చి, వాని భార్యను తాను కట్టుకుంటాడు. లేదా, ఎవడయినా శత్రువు తన భార్యను ఎత్తుకొనిపోయి కట్టుకోవచ్చును. కాదా, పిల్లతండ్రికి ఇష్టంలేక, పెళ్లినాడిచ్చిన ధనం వాపసు చెల్లించి, పిల్లను ఇంటికి తీసుకుపోవచ్చును. కాకుంటే, మరొక అల్లుడికి "కన్యాదానం" చెయ్యవచ్చును.

ఇలాంటి అవకాశాలున్నా, ఒకరినొకరు బాగా తెలుసుకోవడం మంచిదని అనుకున్నారు. దాని విశేషమే యూరోపియనులలో ఇప్పుడు "కోర్టింగు" అన్న పేరుతో కనబడుతుంది. కాని అప్పటి కోర్టింగుకూ, ఇప్పటి కోర్టింగుకూ చాల వ్యత్యాసం వుంది. ఇప్పుడు కోర్టింగులో పైపై ముచ్చట్లు ఎన్ని జరుపుకొన్నా, జతకట్టడం కూడదంటారు-అవతల ఆ పాపం పుణ్యం వారిదే-ఆ పనిమాత్రం వద్దంటారు.

ఆ రోజులలో కోర్టింగులలో ఆ నిషేధం లేదు. ఇంకా గట్టిగా చెప్పాలంటే జతకట్టడం ఉండి తీరాలి గూడాను. పిల్లలను కనగలదో లేదో అన్న సంగతి కూడా ఈ కోర్టింగులోనే తేలిపోవాలి. వట్టి గొడ్రాలురా అన్నమాట అయినా బయట పడాలి. అంత సర్వంకషంగా ఉండేది ఆ మచ్చు చూడడం-ఆ కోర్టింగు.

ఈలాగా కోర్టింగుచేసి మచ్చు తెలుసుకోడానికి రానురాను కొంత రహస్యం అవసరమయింది. ఉండేది ఒక్క చిన్నకొంప. లేకుంటే ఒక

గుహా, చలి, గాలి, కిలకిల మంటూ జనం, వీరి మచ్చుకు మార్గం ఏది? అటువంటి పరిస్థితులలో ఒక మగవాడూ, ఒక ఆడదీ కలిసి ఉండడానికి వీలులేదు. దూరంగా అడవులలో ఏ పొదలలోనికో పోవాలి. అదే ఇతరుల కొక గుర్తు. ఆ చెట్టును చూచిన తరువాత మరెవ్వరూ ఆ దారిని పోరు. వారికి తెలుసును-ఒక మచ్చు పెళ్ళి ఆ లోపల తయారవుతూ ఉందని.

పరుల తొందరచేతనే అనండి, లేదా, బట్టబయలుగా ఉండడం చేతనే అనండి, ఈ పనికి పగలు అంతగా అమరదని గ్రహించారు. రాత్రిపూటే దీనికి ప్రశస్తంగా సరిపోతుందని అనుకున్నారు. అప్పుడయినా, ఇంటినిండా మనుషులే కదా, అందుచేత ఈ మచ్చుదంపతులు ఇద్దరూ ఒక్క దుప్పటిలో ఇముడ్చుకుపోయేవారట.

ఈ ముసుగులో ముచ్చట్లకే "బన్డ్లింగ్" అనీ, "టూరీయింగు" అనీ పరిశోధకులు పేర్లు పెట్టారు. ఇప్పటికీ కొంతవరకు ఈ ముసుగులో గుసగుసలు నీలగిరి తోడాజాతివారిలో ఉంది.

ఈ ముసుగు అలవాటు చాలా దేశాలలో - తూర్పునా, పడమటా గూడా - ఉండేది. ఎక్కడయినా పెళ్లికొడుకు పెళ్లికూతురింటికి వెళ్తే ఈ ముసుగులో దూరాలి. ఆ అదృష్టం కలగాలంటే పిల్ల తల్లిదండ్రులు ఒప్పుకోవాలి. అసలు పిల్ల ఈ మచ్చుకయినా అంగీకరించాలి; కాబట్టి ఈ ముసుగుకి గూడా చాలా ఉపోద్ఘాతం ఉందన్నమాట.

పెళ్లికొడుకు - మచ్చుకోసం - వస్తాడు. రాత్రిపడ్డ తరువాత, ఒక పాట పాడతాడు బయటినుంచి; తండ్రి అడుగుతాడు ఎవరని; పెళ్లికొడుకు పేరు చెప్పుతాడు. తనకు ఇష్టం ఉంటే, కూతురిని పిలిచి "నిప్పు ఊదమ్మాయి" అంటాడు. పెళ్లికొడుకు లోపలికి వస్తాడు. ఇద్దరూ ఒక ముసుగులో దూరిపోతారు. లేకపోతే, అసలు రావడానికే వీలుండదు.

ఒకసారి రాగానే తీరిందా? పిల్ల యిష్టాయిష్టాలు బోధపడాలికదా! అంతేగాక, ఆ పిల్లకయినా వీడి మంచిచెడ్డలు విశదం కావాలికదా? అందుచేత ఈ ముసుగులో ముచ్చట్లు కొంతకాలం జరగాలి. అప్పుడుగాని పెళ్లి స్థిరపడదు. ఈ ముచ్చట్లు కొనసాగించే కీలకం అంతా ఆడదాని చేతిలోనే ఉందట. మొదటిరాత్రి అయిపోయిన తరవాత ఆ పెళ్లికూతురు

"రేపు మళ్ళీరా" అని చెప్పాలి. ఆ అధికారం ఆడదానిదే. లేకపోతే వీడికి దేవిడీమన్నా అయినట్టే, మరొకడు ప్రయత్నం చేస్తాడు.

ఆ అనాగరకులలో ఒక నీతి ఉండేది. ఒకడు ఒక పిల్లతో ముసుగు ముచ్చట్లతో ఉంటూ ఉన్నాడు అని తెలిసిన తరువాత, మరొకడు ఎవ్వడూ ఆ పిల్లను అప్పుడు చూడడు.

ఒక్కొక్కప్పుడు పట్టపగలుగూడా ఇలాంటి ముసుగు ముచ్చట్లు జరగవచ్చును. ఇలాగా ఒక ఆడది ఒక మగవాడూ కలిసి కట్టుకోవడం వల్లనే దీనిని సంబంధం అన్నారు - అని ఒక భాషావేత్త అంటాడు. ఈ సంబంధం చాలా దినాలు సాగిన తరువాతగాని-ఒక పిల్ల పుట్టినంతవరకూ అనండి - అసలు పెళ్లి జరగదు.

మెలనీషియాలో ఈ ముసుగు ముచ్చట్ల కోసం చాలా శ్రమపడేవారు; చాలా ఏర్పాట్లు చేసేవారు. పెళ్ళి కావాలని కోరిన ఆడవాళ్ళంతా రాత్రిళ్ళు ఒక పెద్ద కొట్టంలో పడుకుంటారు. చక్కగా ఇళ్ళల్లో భోజనాలు చేసుకొని ఈ కొట్టంలోనికి చేరుకుంటారు.

ఈ కొట్టానికి వాళ్ళ భాషలో "పొటూమా" అంటారు. అంటే "కేళికా గృహం" అని అర్థం చెప్పవచ్చును. పెళ్ళికావాలని కోరిన మగవారు-యోగ్యతల పరీక్షలన్నీ అయినవారే సుమండీ - కొందరు కలిసి భోజనాలయిన తరువాత ఈ పొటూమా దగ్గరకు వచ్చి బయటనే కూర్చుంటారు. వీరిలో ఒకడు లోపలకుపోయి, "ఇదుగో, ఫలానా ఫలానా వాళ్ళు వచ్చారు. ఏమంటారు?" అని అడుగుతాడు. తరువాత ఆ పేర్లు నచ్చిన ఆడవాళ్ళు వచ్చి ఆయా పేర్ల వారిని లోపలికి తీసుకుపోతారు. తక్కిన మగవారు ఇళ్ళకి పోవలసిందే.

ఆ రాత్రి ముసుగు ముచ్చట్ల సంబంధం. తెల్లవారినప్పుడు ఎవరి ఇళ్ళకు వారు పోవలసినప్పుడు, ఆడది "మళ్లీ రేపురా" అని మగవాడికి చెప్పాలి. లేకపోతే, తన దగ్గరకు రాకూడదు. ఒకవేళ వాడు పొటూమా కొట్టం దగ్గరకు వచ్చినా, ఈ పిల్ల మాత్రం వాడిని చేరనీయదు.

రేపు రా అన్నమాట ఎప్పుడూ ఆడదాని నోటినుంచే రావాలట. మగవాడు ఎప్పుడు గూడా "రేపు వస్తాను" అని చెప్పకూడదట. అలా చెపితే చిన్నతనము; పరువు పోతుంది.

# ఒక్కసారి మననం

ఆకలి వంటిదే జతకట్టే బుద్ధి. ఆడా మగా అని రెండు తెగల వారుండడం వల్ల ఈ అవకాశం కలిగింది. దీనిమూలంగా సృష్టి తన జీవితాన్ని సాగించుకుంటూ ఉంది.

మొదటిలో ఈ జతకట్టడానికి అడ్డూ ఆపూ లేదు. బుద్ధి పుట్టడమే ప్రధానం. కాని, రానురాను కొన్ని కొన్ని నియమాలూ, నిబంధనలూ ఏర్పడ్డాయి. దానికి కూడా కారణం లేకపోలేదు. అడవులలోనూ, కొండల లోనూ, కాయా కసరూ, ఆకు అలమూ తింటూ ఆకలి తీర్చుకొనే రోజులలోనూ, చేతికి దొరికిన జంతువునో, చేపనో పట్టుకొని తింటూ ఉండే రోజులలోనూ మనుషులకు బాధ్యతలు  తక్కువ. కాబట్టి నియమాలూ, ఆశలు గూడా తక్కువే.

తరువాత మందలను పెట్టుకొని పాలూ, పెరుగూ-ఇలాంటివాటితో కాలక్షేపం చేసిన రోజులలోనూ, వ్యవసాయం - ఆ రోజులలో వారు చేసిన ప్రయత్నాలకు ఇంత పెద్ద పేరుపెట్టడం చిత్రంగానే ఉంటుంది-చేసుకుంటూ గింజా గిట్రా పండించుకొనే రోజులలోనూ, ఒక మార్పు కలగక తప్పింది కాదు.

ఇన్నాళ్ళలాగా దేశదిమ్మర్లుగా ఉండకుండా, స్థిరనివాసాలు ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది. గూడెం గూడెంగా ప్రజలు ఉండవలసి వచ్చింది. ఒక గూడేనికి మరొక గూడేనికి సంబంధాలూ - స్నేహమో, విరోధమో - కలగక తప్పాయి కావు. ఒక గూడెంలోని ప్రజలలో ఒక చుట్టరికం వంటిది ఏర్పడింది.

అలాంటప్పుడు ఇల్లూ సాయమూ అన్న అభిప్రాయాలు కలిగాయి. ఆడదాని అవసరం మగవాడికీ, మగవాడి అవసరం ఆడదానికీ కలిగింది. గొడ్డూ, గోదా చూచుకోవడం మొదలయిన పనులు ఎక్కువ అయి పోయినాయి. "ఇది నాది" అన్న బుద్ధి అంకురించింది.

ఇల్లు చూసుకోడానికి ఒక పిల్ల (అంటే ఆడది అన్న అర్థంలోనే-వయసుతో సంబంధం లేదు) కావలసివచ్చింది. అదే పెళ్ళికి ఆరంభం.

ఒక గూడెంవారిని ఇంకొక గూడెంవారు గెలిచినప్పుడూ, వారితో పోట్లాడినప్పుడూ ఏమి జరిగేదంటే, ఆ గూడెంవారి ఆస్తిపాస్తులతో పాటు, వారి ఆడవాళ్ళూ వీరిచేతికి చిక్కేవారు. వీరుకూడా ఆస్తితోపాటు, వారి గొర్రెలతోపాటు, ఈ గూడెం వారికే సంక్రమిస్తారు కదా న్యాయంగా? ఈ ఆడవాళ్లను తమ గూడెంలోని పెద్దలు పంచుకొనేవారు గొర్రెలను, గింజలను పంచుకున్నట్టు.

ఈ ఆడవాళ్ళు పనిపాట్లు చేస్తూ ఉండేవారు. జతకట్టడానికి పనికివచ్చేవారు. పిల్లలను కంటూ ఉండేవారు. అవసరం లేనప్పుడు ఎవరికైనా అమ్మడానికి ఉపకరించేవారు.

మొదట మొదట పెళ్ళిళ్ళు ఇలాంటివే అని చెప్పడానికి చాలా నిదర్శనా లున్నాయి. ఇప్పటికీ ఈ ఆచారం అన్ని దేశాలలోనూ ఉంది. పురాణాలనిండా ఈ సంప్రదాయానికి ఉదాహరణ లున్నాయి.

పెళ్ళిచేసుకోవడం అంటే, ఎవరితోనో పోట్లాడి వారి ఆడపడుచును ఎత్తుకురావడం కింద పరిణమించింది. ఎందుచేత, ఎంత పరస్పర సమ్మతితో రెండు కుటుంబాలు సంబంధం చేసుకున్నా, పెళ్ళిలో వరుడుగాని, వరుడి స్నేహితుడుగాని, చుట్టంగాని వధువును ఎత్తుకొని-బలవంతంగా-వచ్చినట్టు నటించడం ఆచారం అయిపోయింది.

దీని కంతటికీ కారణం ఏమిటంటే, ఆడదాని సాయం మగవాడికి ఇల్లు నడపడానికి కావాలి. ఆడది ఒకర్తె ఇంటికి వచ్చిందంటే, అన్ని చాకిరీలకూ పనికివస్తుంది. అప్పటి లెక్కనుచూస్తే, ఒక ఆడది పది గొర్రెలతో, అయిదు పందులతో సమానంగా విలువకలదిగా ఉండేది.

జతకట్టడంకోసం అని ఎవ్వడూ పెళ్ళికి ప్రాకులాడేవాడుకాదు. ఆ రోజులలో జతకట్టడానికి కావలసినంత స్వేచ్ఛ ఉండేది. దానికోసం తహతహపడడం అంతా ఇటీవల కలిగిన విషయమే. ఆ రోజులలో లేదు.

అప్పుడు కావలసినదంతా ఇంటిపని. దానికి అనుకూలంగా ఉండే ఆడదానిని తెచ్చుకొనేవారు. అందం చందంకన్నా, పనిపాట్లు ఎక్కువగా

చూచేవారు. ఒకరిద్దరు పిల్లలున్న ఆడదైతే మరీ మంచిది. అంటే, ఆడదానికి అంగడిలో విలువ ఒకటి ఏర్పడ్డది.

గూడెంతో గూడెం పోట్లాడడం రానురాను తగ్గింది. పోట్లాటలున్నా స్త్రీలను పట్టుకొని రావడం అంతగా ఉండేదికాదు. తెచ్చినా అందరికీ సరిపడినట్టు దొరకడం దుర్లభమయేది. అందుచేత ఎత్తుకొనివచ్చే పద్ధతికి బదులుగా మరొక పద్ధతి అవలంబించారు. ఈ పద్ధతిలోగూడా ఆడదాని విలువను అంగీకరించారు.

తండ్రి దగ్గరనో, గూడెంలోనో ఉంటూ పనిపాట్లుచేస్తూ ఉన్న ఒక ఆడదానిని ఇంకొకరు తీసుకోవాలి. అంటే, ఆ గూడానికీ, ఆ కుటుంబానికీ నష్టం కలుగుతుంది. కాబట్టి పిల్లను తెచ్చుకోవాలని ఆశ కలిగినవాడు ఆ పిల్లకు బదులుగా కొంత ధనం ఇవ్వాలి అని నియమం పెట్టుకున్నారు. న్యాయంగూడాను. ధనం అంటే ఆ రోజులలో ఇన్ని పశువులో, ఇన్ని జంతువుల చర్మాలో అని ఉండేది. అల్లుడు మామకు ఆ కట్నం సమర్పించుకోవాలి. అది మొదలు పిల్ల వీడిసొత్తు. తనకు ఇష్టం లేకపోతే, ఆ పిల్లను ఇంకొకడికి ఇచ్చివేయవచ్చును. ఇచ్చి ధనం పుచ్చుకున్నా తప్పులేదు. అవతలివాడి పెళ్ళాన్ని బదిలీ చేసుకున్నా తప్పులేదు.

ఇదీ అదీకాక, పిల్లకుగాని, పిల్ల తండ్రికిగాని ఈ సంబంధం ఇష్టం లేకపోతే, అల్లుడు మొదట ఇచ్చిన కట్నం అల్లుడికి వాపసు చేసి, ఆ పిల్లను ఇంటికి తీసుకొని పోవచ్చును. ఇంకొకడికి ఆ తరవాత పెళ్ళి చేయవచ్చును.

ఎత్తుకువచ్చిన పెళ్ళిళ్ళయినా, కట్నాల పెళ్ళిళ్ళయినా శాశ్వతమైన సంబంధాలు కావు. పులిమీద పుట్ర అన్నట్టు ఒకడినిమించిన వాడొకడు రానంతసేపే ఈ సంబంధం. ఏ క్షణంలోనయినా సంబంధం తెగిపోవచ్చును. ఎవరికి ఇష్టం లేకపోయినా సంబంధం తెగుతుంది. సంబంధం కలియడంలో గొప్పతనంగాని, సంబంధం తెగడంలో చిన్నతనంగాని ఆ రోజుల్లో లేదు.

ఈ రోజుల్లో గూడా కొన్ని జాతులలో-కొండజాతులే కావు, నాగరక జాతులలో గూడా ఈ పద్ధతులున్నాయి. మనువులన్న పేరుతో,

నాలుగు మనువులు, ఐదు మనువులు పెళ్ళి, గౌరవంగా బతుకుతూ ఉన్న కాపురాలు ప్రత్యక్షంగా చూడవచ్చును.

ఈ విషయంలో ఒక్క సత్యం గ్రహించాలి. ఏమిటంటే, పెళ్ళి అన్నది సృష్టికి కావలసిన ఆవశ్యకత కాదు. సృష్టి అవిచ్ఛిన్నంగా కొనసాగడానికి జతకట్టడం ఉంటే చాలును. పెళ్ళి అని షరాకులు పడనక్కరలేదు.

ఇకను వ్యక్తిగతంగా ఆలోచించినా, పెళ్ళి అన్నది ఎక్కువ బాధ్యతలను తెచ్చిపెట్టేది కాబట్టి, వ్యక్తి స్వేచ్ఛకు విరుద్ధం అనే చెప్పాలి. పెళ్ళివల్ల కొన్ని నిర్బంధాలు ఏర్పడతాయి కాబట్టి పెళ్ళిని తనంతట ఏ వ్యక్తిగాని కోరడు.

అయితే మరేమిటి? పనిపాట్లు చూచుకోడానికీ, వ్యవహారాలు నడుపుకోడానికీ చేసుకున్న ఒక ఏర్పాటు. ఇద్దరు పురుషులే అయినట్టయితే ఉమ్మడి వ్యవహారం చేస్తున్నారన్నారు. ఒక ఆడదీ ఒక మగవాడూ కలిసి చేసిన ఈ వ్యవహారానికి అప్పుడు పెళ్ళి అన్నారు.

ఈ సంబంధానికి–ఈ వ్యవహారానికి – పిల్లా జెల్లా అంటూ ఒక లంపటం కలిగింది కాబట్టి, దీనికి సంఘ ప్రాధాన్యం కూడా కలిగింది. ఏమయినా ఇది ఒక వ్యవహారమే.

ఈ మాట బోధపడితే తక్కిన అన్ని చిక్కులూ తీరిపోతాయి. పెళ్ళికి ముందు ఈ పిల్ల ఏమి చేసింది? ఎందరితో జతకట్టింది? అన్న ప్రశ్నరాదు. పెళ్ళిముందే పిల్లలను కని ఉంటే మరింత గౌరవం. అందంగా ఉందా లేదా అన్నది అనవసరం. తనమీద ఇష్టం–ప్రేమవుందా లేదా అని గూడా చూడడానికి అవసరం లేదు. కావలసింది అంతా పనిపాట్లు చేయడం. వాటిని బాగా చేయగలదా లేదా? ఒళ్ళు వంచి పశువులాగా పని చేయగలదా లేదా? – పశువులను ఇచ్చే కదా ఈ పిల్లను తెచ్చుకున్నాడు? ఇవే ప్రధానమయిన విషయాలు.

ఇందులో దేనికి కొరత కలిగినా, ఈ వ్యవహార సంబంధం ప్రయోజనం లేనిదవుతుంది. ఈ జోడీ పనిచెయ్యదు. ఈ వుమ్మడి వ్యవహారం ముగించుకుంటేనే మేలు. అంటే, పెళ్ళి సంబంధం తెగిపోతుంది. చేయవలసిన ఏర్పాట్లు చేసుకునేవారు. సంబంధం తెంచుకొనేవారు.

దీనిలో సిగ్గుపడవలసిందేమిటి? విచారించవలసిందేమిటి? వాడిని మించినవాడు దీనికీ, దీనిని మించినది వాడికీ దొరకకపోతారా? దేశం గొడ్డుపోలేదే అని వారి ఆలోచన.

ఈ తెగతెంపులు తరవాత కలవడం ఎందుకు? ఏదో పెళ్ళి అన్న తరవాత నాలుగురోజులు దానిని నిల్వనియ్యడం మంచిది అన్న ఉద్దేశంతోనే మచ్చు పెళ్ళిళ్ళు అంటూ పెట్టారు. మగడూ పెళ్ళాంగానే వ్యవహరిస్తారు. సంవత్సరాల తరబడిని అనుకూలంగా తోచిన తరువాతనే పెళ్ళి. లేకపోతే తెగిపోతే, తెగిపోతుంది. పదిమందితో మచ్చు పెళ్ళిళ్ళు చేసుకున్న ఆడదానికిగూడా చిన్నతనం ఏమీలేదు.

ఏలాంటి పెళ్ళి అయినాసరే, దానిలో శాశ్వత గుణం ఏదీలేదు అన్న మాట ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవాలి. అటువంటి స్థితిలోనుంచి ఇప్పటి పెళ్ళిళ్ళ అభిప్రాయాలను పుట్టించారు-నీటిలో అగ్గి పుట్టించినట్టు. కన్యాత్వం, పాతివ్రత్యం, మతం, జన్మజన్మాలకు శాశ్వతత్వం-ఇలాంటివన్నీ దీనిలో ప్రవేశపెట్టారు. అది చిత్ర చరిత్ర.

# శవ వివాహాలు

ఎందుకోసమో ఆరంభమయింది, ఎందుకోసమో అభివృద్ధి చెందింది ఈ పెళ్ళి అన్న ఆచారం. దీనివల్ల కలిగిన మేలు తేటగా కనబడుతూ వుంది. ఇల్లు అన్న అధికారమూ, అర్హత అన్న గౌరవము, ఆస్తి అన్న సంతృప్తి-ఇలాంటివన్నీ ఈ ఆచారంలో కనబడుతున్నాయి. మగవాడికి ఆడది అండగా ఉంటుంది. ఆడదానికి మగవాడు సహాయంగా ఉంటాడు. ఇద్దరికీ ఒకవిధమైన ఉపకారమే. అందుచేత ఈ ఆచారం త్వరత్వరగా వ్యాపించిపోయింది.

ఆపాటి ఈపాటి అర్హత వున్నవాడంతా పెళ్ళిచేసుకోడానికే చూచేవాడు. అర్హతలు, పరీక్షలూ మొదలయినవాటి బిగువు తగ్గించు కునేవారు. పోట్లాటలవంటివాటిని లాంఛనాలుగామాత్రం పెట్టుకున్నారు. ఎవరినో ఓడించిన తరవాతనే ఆడదానిని పెళ్ళి చేసుకోవలసిన పని, లోపాయికారీ రాయబారాలతోనూ, నటన యుద్ధాలతోనూ సరిపుచ్చేవారు. ఆడదానికోసం చెల్లించవలసిన ధనం విషయంలో అరువు బేరాలు పెట్టి సదుపాయాలు కలిగించారు. ధనంలో కొంత బయణా ఇస్తే చాలు, అమ్మాయిని చేసుకోవచ్చును. తరువాత తక్కిన ధనం చెల్లించు కోవచ్చునన్నారు. ఇలాగా చాలా విధాల సదుపాయాలు చూపించారు. దానివల్లా, దీనివల్లా పెళ్ళి అన్న విషయం సర్వత్రా వ్యాపించిపోయింది.

గంతకు తగిన బొంత, ప్రతి మగవాడికీ ఒక ఆడదయినా ప్రతి ఆడదానికీ ఒక మగవాడయినా పెళ్ళాడడానికి దొరికేవారు. లేదా, దొరికించుకునేవారు. పెళ్ళి ఈడు వచ్చేసరికి ఎక్కడో ఒక జంటను కుదుర్చుకోవడం అలవాటయిపోయింది. జతకట్టడంలో ఎంత స్వేచ్ఛను అనుభవిస్తూవున్నా పెళ్ళికోసం అని ఒక వ్యక్తిని నిర్ణయం చేసుకునేవారు. సంబంధ బాంధవ్యాలనుబట్టి ఈ నిర్ణయాలు పెళ్ళి ఈడు రాకముందు గూడా జరుగుతూ ఉండేవి. వీటినే మనం ప్రధానాలు అంటాము.

ప్రధానాలూ, నిశ్చితార్థాలూ అంటూ ఇలాంటి పూర్వ నిశ్చయాలు జరగడానికి గూడా అవకాశం కలిగింది. ఈ ప్రకారం పెళ్ళి అన్నది మామూలయిపోయింది. ఎంతవరకు మామూలయిందంటే-పెళ్ళి కాలేదు అని చెప్పుకోవడం సిగ్గుగా ఉండేటంత మామూలయిపోయింది.

సిగ్గెందుకంటారు కాబోలు! మగవాడయితే వట్టి అప్రయోజకుడు, అర్హతలేనివాడు, యౌవన పరీక్షలో తేరలేకపోయాడు. అసమర్థుడు-చవట-అని లోకులు అనుకుంటారని సిగ్గు. మీసాలు, గడ్డాలు బలిసినా కూడా ఒక్క ఆడదాని నయినా కట్టుకోలేకపోయాడు -శుంఠ అని నవ్వుతారే అని సిగ్గు. ఇకను ఆడది అయితేనా - పనిపాట్లు చెయ్యడానికి తెలివిలేని మొద్దు అమ్మాయి కాబోలు; లేకపోతే, ఈపాటికి ఒక్కడైనా చేరదీయకపోయాడా అని ఆడిపోస్తారేమో అని సిగ్గు. ఇంతమంది పిల్లలు కన్నప్పటికీ దీనిని ఎవడూ పెళ్ళిచేసుకోలేదు, వట్టి పనిదొంగ అని అనిపోతారేమో అని సిగ్గు. అందుచేత ఉభయత్రా తొందరపడేవారు. గృహజీవనంలో వుండే స్వేచ్ఛా, అధికారమూ ఇలాంటివి గూడా పెళ్ళికి ఆకర్షణలుగా వుండేవి అని అంగీకరించాలి.

ఇలా అంతటా వ్యాపించిపోయింది పెళ్ళి ఆచారం. పెళ్ళి ఆడకుండా ఉండడం అపూర్వంగా కనబడేది. అలా ఎవరోగాని ఉండేవారు కారు. ఇప్పుడు పెళ్ళిలోనూ, దాంపత్యంలోనూ వున్న నిర్బంధాలూ సంకెళ్ళూ అప్పుడు లేవన్నమాట మరచిపోకూడదు. ఎప్పుడు వద్దనుకుంటే అప్పుడే పోతుంది. స్వేచ్ఛా వర్తనానికి లోపంలేదు. స్వసౌఖ్యానికి భంగంలేదు. పైగా కొన్ని మంచి సదుపాయాలున్నాయి ఈ పెళ్ళిలో. అందుచేత పెళ్ళి వద్దు అని నిలిచిపోవలసినంత అవసరం కనబడలేదు. ఆశ్చర్యం ఏమీలేదు. అందుచేత ఏమయింది? కొంత వయసు వచ్చినప్పటికి పెళ్ళి చేసుకోవడం పరిపాటి అయిపోయింది. అదే సాధారణ పద్ధతి అయిపోయింది. మగవాడు కొన్ని సంవత్సరాలకు "పెద్దవాడు" అయినట్లే, మరికొన్ని సంవత్సరాలకు పెళ్ళి చేసుకుంటాడు అని నిశ్చయం అయింది. ఆడది కొన్ని ఏళ్ళకు సమర్తాడటం ఎలాగా జరుగుతూవుందో, అలాగే కొన్నాళ్ళకు పెళ్ళి చేసుకుంటుంది అని నమ్మకం ఏర్పడ్డది. బాల్యం, యౌవనం,

వార్ధక్యం-ఇలాంటివి అంచీలుగా మనుష్యులకు వచ్చినట్టే, పెళ్ళి అన్నది గూడా ఒక అంచీలాగా వచ్చేదయింది. అభ్యాసబలం, ఆచారబలం అంత ఎక్కువ!

మన ప్రశ్న చూడండి: ఒక యువకుడిని చూచి "పెళ్ళి అయిందా నాయనా?" అనే అడుగుతాం. అంతేగాని, పెళ్ళిచేసుకుంటావా అని అడగం- ఎందుచేత? పెళ్ళిచేసుకుంటాడన్న మాట శిలాక్షరంగా మనం నమ్ముతాం. చేసుకోక ఏమిచేస్తాడు? ఎలాగా మానగలడు? ఆ అంచీ దాటకపోతే జీవయాత్ర సాగుతుందా? తప్పక పెళ్ళిచేసుకోవలసినవాడే. దానికి ఏలాంటి సందేహమూ లేదు. భోజనం చేస్తాడన్నది ఎంత నిశ్చయమో, ఎంత సందేహంలేని సంగతో, పెళ్ళి చేసుకుంటాడన్న సంగతిగూడా అంత నిస్సందేహమే. కాబట్టే, భోజనం అయిందా అని అడిగినట్టు పెళ్ళి అయిందా అని అడుగుతాం. ఆ భోజనం ఎంత నిత్యకృత్యం అయిందో ఈ పెళ్ళి అంత అవశ్య కార్యం అయింది. ఒక గ్రంథకర్త చెప్పినట్టు మనిషికి చావు ఎలాగా ఒకనాడు కాకపోతే మరొకనాడు వస్తుందో, అలాగే పెళ్ళిగూడా ఎప్పుడో ఒకప్పుడు జరగాలి అన్నంత నిశ్చయానికి వచ్చింది. తప్పించుకోడానికి వీలులేనంత ఆవశ్యక విషయం అయింది.

మనుషులు పుట్టడం, పెరగడం, చావడం సృష్టికి అవసరమయిన పనులు. మనకు ఇష్టం ఉన్నా లేకపోయినా, ఆ పనులు జరుగుతూ ఉండాలి. తప్పకూడదు. సృష్టి కోరేది అంతా జతకట్టడం అంతే. ఆ పని ఏరూపంగా జరిగినా, ఆ విధం మన దృష్టికి నీచమయినా, పవిత్రమయినా సృష్టికి అభ్యంతరంలేదు. రంకున పుట్టినవాడూ కొడుకే, దంపతులకు పుట్టినవాడూ కొడుకే. వ్యత్యాసం రవంతయినా లేదు. అంత సులభంగా సంతృప్తిపడే సృష్టికి ఈ పెళ్ళి నిబంధన అక్కరేలేదు. ఇదంతా మనలో మన ముచ్చట. అంతే. ఆ మాటమాత్రం మరచిపోవద్దు.

ఇంత అప్రధాన విషయం అయినా, దీని వ్యాప్తిని చూచి పెళ్ళి చేసుకోకపోతే తప్పు అన్నారు. తరువాత తరువాత పెద్దలంతా జమఅయి, అది పాపం అన్నారు. తప్పక పెళ్ళి చేయాలన్నారు. లేకపోతే నరకం

అన్నారు. దానికి ఏదో ఒక పేరు పెట్టలేకపోతారా? ఇలా అనడానికి కారణాలు చెప్పారు. పలవలూ చిలవలూ తీశారు. అంతా మేదర తడిక అల్లినట్లు అల్లారు - దట్టంగానూ, మట్టంగానూ.

పెళ్ళి ఒక పుణ్యకార్యం అన్న తరువాత, ఏముంది? పెళ్ళి కాకపోవడం మహాపాపం అయింది. పెళ్ళి కాకుండా చనిపోయినవారు మహాపాపులు అయిపోయారు అప్పటివారి దృష్టిలో. ఇక వారికి గతులు సున్న అనే చెప్పాలికదా! ఎలాగ? దీనికోసం కొన్ని జాతులు పడే అగచాట్లు చూస్తే చాలా చిత్రంగా ఉంటాయి. చిన్నపిల్లలు చచ్చిపోతే, వారికి పెళ్ళి చెయ్యలేదుకదా అన్న విచారంతో ఆ ఇంటివారు చచ్చిపోయిన ఆ బాలుని శవానికీ అంతకుముందు చచ్చిపోయిన ఒక బాలికకూ శ్మశానం పెళ్ళి చేస్తారు.

చచ్చిపోయిన ఇద్దరికీ ఇలాగా పెళ్లి చేసినట్టయితే, వారి సూక్ష్మదేహాలు పెళ్ళి చేసుకుంటాయనీ, ఆ రూపంగా వాటికి రానున్న పాపం పరిహారం అయిపోతుందనీ అనుకుంటారు ఆఫ్రికాలో. మార్కోపోలో అన్న ఇటాలియను సంచారి తార్తారు దేశంలో ఇప్పటికి 500 సంవత్సరాలకు పూర్వం, ఒక శవ వివాహాన్ని కళ్ళారా చూచాడు. ఒకడి కూతురు పెళ్ళి కాకుండా చచ్చిపోయిందట. అంతకుపూర్వము కొన్నాళ్ళ కిందట ఇంకొకడి కొడుకు పెళ్ళికాకుండా చచ్చిపోయాడు. ఇప్పుడు చచ్చిన ఆ కూతురికీ, అంతకుముందు చచ్చిన ఆ కొడుకుకీ పెళ్ళి నిర్ణయించారట. చాలా శోభస్కరంగా ఆహ్వానాలూ, వేడుకలూ, వినోదాలకు చాలా ధనం వ్యయం చేసి పెళ్ళి చేశారు. పెళ్ళిపత్రాలూ, లగ్నపత్రాలూ, కట్నపత్రాలూ అన్ని వ్రాతకోతలు తయారయాయి. ఆడపెళ్ళివారి పత్రాలు మగపెళ్ళివారు పుచ్చుకున్నారు. మగపెళ్ళివారి పత్రాలు ఆడపెళ్ళివారు పుచ్చుకున్నారు. తరవాత ఈ పత్రాలన్నీ నిప్పులో పడేశారట.

ఎందుకో తెలుసా? నాటకమంతా అయిపోయింది. ఇకనీ పత్రాలెందుకని కాదు. నిప్పులో పడేస్తే, ఆ శవ దంపతులకు అగ్నిదేవుడు రవాణా చేస్తాడు. అక్కడ ఫలానా ఆడశవం నా భార్య అని మగశవం

గ్రహించుకుంటుంది. ఆడదిగూడా తన మగడు ఎవరో తెలుసుకుంటుంది. తరువాత పెళ్ళిలేని పాపం ఎగిరిపోతుంది. ఆ రెండు జీవాలూ సుఖంగా ఉంటాయి.

శవ కల్యాణం ఇలా జరిగిన తరువాత కథ అంతమవుతుందా? లేదు. ఆడపెళ్ళివారి కుటుంబమూ మగపెళ్ళివారి కటుంబమూ వియ్యపువారిలాగానే-ఆ రెండు శవాలూ బతికి ఆలూమగడుగా ఉంటే ఏవిధంగా రాకపోకలూ విందులూ వియ్యాలూ జరుపుకుంటూ సంవత్సరాలుగా గడుపుకుంటూ ఉంటారో, అలాగానే బాంధవ్యం జరుపుకుంటూ ఉంటారు. పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ లేదన్న చింత ఉండదు. కుటుంబాలకు సంబంధం బాగా ఏర్పడుతుంది.

ఫిజీ నివాసులకు "నంగనంగ" అన్న దేవత ఒకటి ఉంది. పెళ్ళి కాకుండా చచ్చినవారి ఆత్మలను ఆ దేవత చాలా బాధలు పెడుతూ ఉంటుందట. కాఫర్ ప్రజలలోనూ, అమెరికాలోనూ, కొంతవరకు భారత వర్షంలోనూ, ఈ అభిప్రాయం - పెళ్ళికాకుండా ఉండడం దోషం అన్న అభిప్రాయం - బాగా ఉంది. సదుపాయంకోసం చేసుకునే పెళ్ళి ఈ విధంగా శాసనం అయి కూర్చుంది.

ఇలాంటి శవవివాహాలు చెయ్యడానికి కొందరు పురోహితులు గూడా బయలుదేరారు కొన్ని దేశాలలో. ఈ పురోహితులను చీనా దేశంలో "మధ్యవర్తులు" అంటారు. వీరే శవకల్యాణ సంధానకర్తలూ- పనికి తగిన పేరు. చచ్చిన పిల్లలకు వీరు పొంతనలు చూస్తారు; వియ్యపువారి అభిప్రాయాలు కనుక్కుంటారు. పురోహితుడి కట్నాలు నిర్ణయించు కుంటారని వేరే చెప్పాలా?

గుడ్డలతోను, తినుబండారాలతోనూ పురోహితులూ, ఆడపెళ్ళి వారూ, మగపెళ్ళివారూ బయలుదేరుతారు శవాలయానికి - అదే ఇప్పుడు కల్యాణవేదిక అవుతుంది. పెళ్ళికొడుకు సమాధి దగ్గరా పెళ్ళికూతురు సమాధి దగ్గరా రెండు పీటలు వేస్తారు. ఆ పీటదగ్గర ఒక జెండా, ఈ పీటదగ్గర ఒక జెండా నిలబెడతారు. తెచ్చిన వస్తువులు అన్నీ అక్కడ పెట్టి, చచ్చిన వధూవరులను పెళ్ళికి రండని పిలుస్తారు.

పీటదగ్గర ఉన్న జెండా కదులుతుంది-గాలిలో కదలక ఏమి చేస్తుంది-ఆ! పెళ్ళికొడుకు ఇష్టపడ్డాడని ఇక్కడ, పెళ్ళికూతురు ఇష్టపడ్డదని అక్కడ, చంకలు ఎగురవేసి ఆనందిస్తారు. దానితో పురోహితులు, బతికున్నవాళ్ళకు పెళ్ళి చేసినట్టే పెళ్ళితంతు అంతా నడుపుతారు. కట్నం పుచ్చుకొని ఇళ్ళకు పోతారు. తరువాత విందులూ వియ్యాలూ యథా రూపంగా సాగుతాయి. ఈలాంటి పౌరోహిత్యంతోనే కాలక్షేపం చేస్తూ బాగా డబ్బు సంపాదించే పురోహితులు చాలామంది ఉండేవారని "డి గ్రూట్" అన్న పరిశోధకుడు వ్రాశాడు. చచ్చిన పిల్లలకు పెళ్ళి జరిగినా లేకపోయినా, వాళ్ళకు పుణ్యం అబ్బినా అబ్బకపోయినా, పురోహితుడు ఇల్లు మాత్రం నిండుతుంది.

# బాల్య వివాహాలు

పెళ్ళి శవాలకయినా చేయవలసిందే అన్నంత ముఖ్యం అయింది కదా అని చూచి, చచ్చినతరువాత ఈ అగచాట్లు పడడంకంటే, పిల్లలు బతికి వుండగానే ఎందుకు ఈ రవంతపనీ చేయకూడదు అన్న ఆలోచన కలిగింది. పెళ్ళి ఒక ముక్కుబడికింద తయారయింది. ఎంతవేగం ఈ పని చేసివేస్తే అంత మంచిది, తంటా తీరిపోతుంది అన్న అభిప్రాయం కలిగింది. చిన్న చిన్న పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యడం ఆరంభించారు.

ముక్కుపచ్చలారని పిల్లలకు పెళ్ళి చెయ్యడం మొదలుపెట్టారు. ఒక్కదేశంలో కాదు, చాలా దేశాలలో, చాలా చాలా ఖండాలలో ఇలాంటి ఆచారం పుట్టింది. పిల్లలకు ప్రధానాలని బయాణాలు ఇచ్చేవారు. పుట్టబోయే పిల్ల-ఆడపిల్ల అయితే ఫలానావాడికిచ్చి పెళ్ళిచేస్తామని నిర్ణయాలు జరిగిపోయేవి. ఒక్కొక్కప్పుడు నాలుగేళ్ళ పిల్లకు నలభైయేళ్ళ మొగుడు దొరికేవాడు.

అయితే, ఒక మెరుగు ఉండేది. ఆ రోజులలో. ఒకవేళ ఈ బాల్యవివాహంలో భర్త చచ్చిపోయాడనుకోండి. పెళ్ళాం విధవ అయిపోయి యావజ్జీవమూ ఉసూరుమని ఉండవలసిన అవసరం లేదు. ఈ వైధవ్య దుఃఖం దానికి లేదు. వాడు పోతే మరొకడు, వాడి తరవాత యింకొకడు ఈ పిల్లను పెళ్ళిచేసుకునేవారు. తప్పులేదు-చేసుకొని తీరాలి గూడాను. అందుచేత ఆ రోజులలో బాల్యవివాహాలవల్ల అంతగా ప్రమాదం ఉండేది కాదు. చింతలేని పెళ్ళిళ్ళు.

ఈ పిల్ల పెళ్ళిళ్ళ ఆచారం ఎంతవరకు వెళ్ళిందంటే - పెళ్ళికాని పిల్ల ఇంట్లో ఉందంటే, ఇంటి కంతటికి అవమానం కిందికి వచ్చింది. ఆ ఇంటివారు చేతకానివారనీ, పెళ్ళిచేసే యోగ్యత లేనివారనీ అనుకోవడం గూడా వుండేది. అటువంటివారి ఇళ్ళకు పెద్దలు వెళ్ళేవారు కారు.

వెళ్ళినా వాళ్ళ ఇంట మంచినీళ్ళయినా నోటిలో వేసుకోరు. అంత నీచంగా చూచేవారు.

మన కథలలో ఇలాంటివి ఎన్నో సూచనలున్నాయి. ఒక ఋషి, లేకపోతే ఒక సాధు ఇంటికి వస్తాడు. ఇంటివాళ్లు ఎంతో ఆదరంతో ఆ అతిథికి భోజనం పెడతారు. ఇంతలో ఆ అతిథికి - ఎలాగో ఒకలాగా - ఆ ఇంటిలో పెళ్ళికాని పిల్ల ఉందన్న సంగతి తెలిసిపోతుంది. 'అయిసిరి బొజ్జా!' అని లేస్తాడు విస్తరి దగ్గరనుంచి - గుడ్లురుముతాడు. పళ్ళు కొరుకుతాడు. ఛీ అని చేయి కడుక్కొని పోతాడు. పంటలు పండకపోయినా, మహామారి వూరివారిని చంపుతున్నా-దానికి కారణం పెళ్ళికాని పిల్లలు ఊరిలో ఉండడమే అని నిర్ణయించేవారు. అంత అవమానం పెళ్ళి చేయకుండా పిల్లను ఇంటిలో ఉంచుకుంటే. బాల్యవివాహాలు ఇలాగా వ్యాప్తిలోనికి వచ్చాయి - ఇంకొకలాగా కాదు.

ఈ బాల్యవివాహాలకు మనవారు ఒక కారణం చెప్పుతారు. కన్యాదానం వల్ల పుణ్యం కలుగుతుందనీ, కన్య అంటే 8 ఏళ్ళ పిల్ల కాబట్టి, ఆ వయసులోనే పెళ్ళి చెయ్యాలని చెప్పుతారు. కాదు, కన్య అంటే 10 ఏళ్ళని చెప్పిన శాస్త్రకారులు గూడా ఈ బాల్యవివాహాన్ని అంగీకరించారు.

పిల్ల రజస్వల అయినప్పటికే ఒక భర్త తయారుగా ఉంటే, దాని యవ్వనం, ఒక్క రోజయినా, అడవి గాసిన వెన్నెల కాదని బాల్యవివాహాలు చేసేవారంటారు కొందరు. మహమ్మదీయ ప్రభువులు అందమైన పిల్లలను చూస్తే వాళ్ళని పెళ్ళి చేసుకోడానికి కోరవచ్చు. అప్పుడు ఆ పిల్లకు పెళ్ళి అయిపోయిందని చెప్పితే, వారా ప్రయత్నం మానుకుంటారని ఆలోచన అంటారు మరికొందరు. ఇవన్నీ కుంటి సమాధానాలే అని వేరుగా చెప్పనక్కరలేదు. పెళ్ళయిన పిల్ల అయితే నవాబు గారికి పనికి రాదా?

# పాతివ్రత్యం

పెళ్ళికి ముందు ఆడది ఎంత స్వేచ్ఛగా వున్నా, పెళ్ళితో అన్నీ సంకెళ్ళే ఏర్పడతాయి. ఆ చెట్టున ఈ చెట్టున విహరిస్తూ ఉండిన చిలుకను పంజరంలో పెట్టినట్టవుతుంది. మగవాడికి ఒక అధికారమూ, ఆడదానికి ఒక పారతంత్ర్యమూ పెళ్ళితో కలుగుతాయి.

మొదటి రోజులలో పెళ్ళికి ముఖ్యమయినది పోట్లాట. పోట్లాడి శత్రువును ఓడించి, వాడి గొర్రెలతోపాటు వాడి ఆడవాళ్ళను గూడా తెచ్చుకొనేవారు. ఆ ఆడవాళ్ళనే పెళ్ళాలన్నారు. గెలిచి తెచ్చిన సరుకుకి స్వాతంత్ర్యం ఎక్కడుంటుంది? ఆ గొర్రెలు ఎంతో, ఈ ఆడవాళ్ళూ అంతే అన్న దృష్టి కలుగుతుంది.

తరవాత, మంచితనంతో చేసుకున్న పెళ్ళిళ్ళలోనా? మొదట ఆడదాని కోసం బేరం సాగుతూ ఉండేది; 5 గొర్రెలు, 6 గొర్రెలు అని. లేదా 3 పందులు, 4 పందులు అని. ఏవో అస్వతంత్ర వస్తువుల మారుబేరం - నాలుగు వందల మామిడి పళ్ళకూ, మణుగు చింతపండుకూ మారుబేరం చేసినట్టు.

ఆ మారుబేరం పద్ధతే చాలును, ఆడవారికి అధికారం లేదని, వాళ్లు వట్టి వస్తువులతోనూ, అల్ప జంతువులతోనూ సమానులు అని రుజువు చేయడానికి. దీనికితోడు బేరం జరిగిన తరువాత మరొక పనికూడా జరుగుతుంది. పెళ్ళి లాంఛనాలు అంటూ, ఆడపెళ్ళివారిని ఓడించినట్టు, ఆడదానిని గెలిచి తీసుకొని పోయినట్టు నటించేవారు.

ఈ నటన అంతటివల్ల ప్రపంచానికే కాక పెళ్ళికూతురికి గూడా ఆడది ఒక సాధారణ అస్వతంత్ర జంతువు అన్న సంగతి స్పష్టం చేసేవారు. చేతికీ కాళ్ళకీ గొలుసులు వేసేవారు; మెడలో తాడువేసి ఈడ్చేవారు. ఆ ప్రకారంగా మగవాడు తనకులేని అధికారాన్ని నడిపించాడు. దానికి పెద్ద కంచుకోట ఒకటి కట్టాడు. నేను అధికారిని, నువ్వు నా సొత్తువు అని

ఆడదానికి చాటి చెప్పాడు. సమానస్థాయిలో తోడుగా ఉన్నదానిని బానిసగా చేశాడు.

పెళ్ళి తరువాత, కూర్చుంటే మారోమేఖ్, నిల్చుంటే మారోమేఖ్ అన్నాడు. చచ్చినట్టు పడి ఉండమన్నాడు. ఇంటి బానిసపనేగాని, అందమూ ఆనందమూ ఆడదానికి అక్కరలేదన్నాడు. పెళ్ళి అయిన తరువాత ఆడవారిని కురూపులుగా చేసే వాడుకగూడా కొన్ని జాతులలో వుంది. అలా చేస్తే వారి నెవరూ కోరరనీ, చిల్లర తిరుగుడు లుండవనీ, కురూపి అయిన ఆ భార్యలతో తానున్నట్టే, ఇంకొకడెందుకుండకూడదు అన్న ప్రశ్న వాడికి ఉండదు. కొట్టేవాడు, తిట్టేవాడు, ఇంటినుండి తరిమి వేసేవాడు. అక్కడక్కడ చంపివేసేవాడు గూడా. ఈ ప్రకారం మగ అధికారాన్ని, అప్పుడప్పుడు మరచిపోకుండా, జ్ఞాపకానికి తెచ్చుకుంటూ ఉండేవాడు.

స్త్రీకి గర్భదారణం అనీ, ప్రసవం అనీ, చంటిబిడ్డ అనీ, కొన్ని ప్రతిబంధకా లున్నాయి. ఆడదానికి అవి సహజం. తప్పవు. వీటివల్ల కొంత ఆయాసం, కొంత అస్వాధీనత, ఆడదానికి కలగక తప్పదుగదా? ఇతరుల మీద కొంతయినా ఆధారపడక తీరదు. అలాంటి అవసరం మగవాడికి గూడా ఒకప్పుడు రావచ్చు. కాని మగవాడు, అదే పెద్ద సాకుగా చేసి, ఆడదానిమీద అధికారిని అన్నాడు.

అంతేకాదు, దూరాబారం పోయేవాడు మగవాడయ్యాడు. కత్తి, కొయ్యా పట్టుకొని పోట్లాడేవాడూ మగవాడే అయ్యాడు. అట్టహాసాలు చేసేవాడూ మగవాడే అయ్యాడు. మగవాడి గొప్ప దానితో మరింత స్థిరపడ్డది. ఆడదిగూడా ఆ అధికారాన్ని అంగీకరించినట్టు కనిపించింది.

అక్కడనుంచి నియమాలూ, సూత్రాలూ ఆరంభించాడు. మగవాడు ఎవరితో పోయినా తప్పులేదు; ఆడది (పెళ్ళి అయినది) మరెవరిని చూడరాదు అన్నాడు. మగవాడు ఆ పని చేస్తే లీవి-ఆడది ఆ పనే చేస్తే రంకుతనము. ఇలా విభజించి సూత్రాలు అల్లాడు. కొట్టినా, తిట్టినా, న్యాయమయినా, అన్యాయమయినా, ఏమిచేసినా మాట్లాడ కూడదన్నాడు. లక్షలకొలదీ కట్టడులు చేశాడు.

దీని కంతటికీ పాతివ్రత్యం అనే పరమ పవిత్రమయిన పేరు పెట్టాడు. పాతివ్రత్యాన్ని పొగిడాడు, వర్ణించాడు. కట్టుకథలూ; పురాణాలూ కల్పించాడు. ఆకాశానికి ఎక్కించాడు. అదే మహాభాగ్యం అని ఆడది గూడా అనుకుంది-అమాయకురాలు. దీనికోసమే తన జీవితాన్ని అంతటినీ ధారపోసింది. సరే, పాతివ్రత్యానికి భంగం రాకుండా ఉండేటట్టు చూస్తూ వచ్చింది.

కాని, పాతివ్రత్యం మీద మగవాడికి అంత గౌరవం లేదు. వాడి దృష్టిని అది పవిత్రమూ కాదు. ఒక ఉపాయము. ఆడదానిని అదుపులో ఉంచడానికి వేసిన ఒక వల; అంతే. ఇంత గట్టిగా చెప్పడానికి కారణాలున్నాయి. నిజంగా పాతివ్రత్యం అంత గొప్పదే అయితే-గొప్పదని మగవాడు తలచి ఉంటే....ఇంటి ఆడదానిని ఇతరులతో జతకట్టడానికి ఎందుకు పంపుతాడు? అప్పుడు అన్య పురుష సంపర్కం కలగదా? అది పాతివ్రత్యానికి భంగం కాదా?

అతిథి ఇంటికివస్తే ఇంటి ఆడదానిని అతనితో జతకట్టడానికి పంపించేవాడు. చీనాలో, గ్రీసులో, అమెరికాలో, ఆస్ట్రేలియాలో ఈ అతిథి సేవ జరుగుతూ ఉండేది.

మన "ఆంధ్ర నైషధకర్త" శ్రీనాథ మహాకవి రోజులలో గూడా ఇలాంటి ఆతిథ్యం జరిగినట్టు వింటున్నాం.

అతిథి వచ్చినప్పటికి ఇంటి మగవాడు లేకపోయినా, ఇంటిలోని పతివ్రత ఆ అతిథికి చేయవలసిన సత్కారాలన్నీ చేసి, అతనితో జతకట్టాలి. అది చేస్తేనే పతివ్రత అంటాడు, లేకపోతే కాదు.

ఇంకా ఒక చిత్రమయిన పతివ్రతా లక్షణం ఉంది. మగవారికి ఇష్టమయితే, భార్యలను బదలాయించుకునేవారు-కులాసా కోసమో పనిపాటుల కోసమో-ఏదయితే మన కెందుకు? వాడి పెళ్ళాం వీడికి, వీడి పెళ్ళాం వాడికి బదిలీ చేసేవారు. ఈ బదలాయింపు నాలుగయిదు రోజులే ఉండవచ్చును. నెలలుండ వచ్చును. సంవత్సరా లుండవచ్చును. శాశ్వతంగా ఉండవచ్చును. ఏదయినా పాతివ్రత్యమే.

"నేను ఇతరులతో జతకట్టడానికి పోను, నిన్ను పెళ్ళిచేసుకున్నాను. నీ దగ్గరే ఉంటాను" అని ఏదయినా అంటే-ఆ రోజులలో అది పాతకి, పతివ్రత కాదు. అమెరికాలో ఒక పెద్ద నాయకుడు తన కష్టసుఖాలను చెప్పుకుంటూ "నా పెళ్ళాం చాలా బుద్ధిమంతురాలు. గొప్ప పతివ్రత. కాని ఒక్క చిక్కు వచ్చింది. ఎవరి దగ్గరకయినా పంపుతానంటే వద్దంటుంది; వెళ్ళదు" అని ఏడ్చాడు.

మగవాడు ఈ పతివ్రతలను ఇతర మగలకు అమ్ముకోవచ్చును. ఐస్‌లాండులోనూ, జర్మనీలోనూ గూడా ఈ భార్యల అమ్మకం మొన్న మొన్నటిదాకా ఉండేది. ఈ అమ్మకాల ద్వారా ఇంకొకడితో పోవడానికి ఇష్టంలేక కొందరు "పాపిష్టి స్త్రీలు" ఆత్మహత్యలుగూడా చేసుకున్నారు.

ఆడవారిని ఇలాగా పశువులలాగా, వస్తువులలాగా చూచేవారికి పాతివ్రత్యం అంటే గౌరవం ఉంటుందని అనగలమా? అలాంటి సూత్రాలు అల్లినవారు నిజంగా వాటిని పవిత్ర సూత్రాలు అనే అనుకున్నారంటారా? ఆడదానిని తన ఉపయోగం కోసం కట్టుసంకెళ్ళలో పెట్టడానికి ఆనాడు చేసిన పన్నాగంకాక మరేదయినా అవుతుందా?

ಙಙಙ

# కీడు తీయడం అంటే?

ఏకయి రావడం, మేకయి కూర్చోవడం మగజాతికి-మనుష్యులలో - ఒక లక్షణమయింది. సమానంగా ఉండే ఆడదానిని మెల్లగా బుట్టలో వేశాడు. పెళ్ళి అన్నాడు. మెడకు తాడు బిగించాడు-మంగళసూత్రం అన్న పెద్దపేరుతో. ఇకను నువ్వు ఎవ్వరినీ కన్నెత్తి చూడకూడదన్నాడు. పాతివ్రత్యం అని నీతి పన్నాలు వ్రాశాడు.

తానుమాత్రం స్వేచ్ఛగా తిరగవచ్చునట. తన భార్యను ఇంకొకరికి పంపించవచ్చునట. అతిథికీ, అభ్యాగతుడికీ భార్యను ఎరువు ఇవ్వవచ్చునట. పెళ్ళాలను బదలాయించుకొనవచ్చునట. అంత చక్కగా ఉండేది ఆ న్యాయం.

అప్పుడయినా-పాతివ్రత్యమంతా ఆ పెళ్ళి నిలిచినంతవరకే. ఆ ఇద్దరూ ఆలూ మగడూ అన్న సంబంధంతో ఉన్నంతవరకే. పెళ్ళి ఏకారణంచేతనయినా తెగిపోయిందా, అయ్యదారి అయ్యదే, అమ్మదారి అమ్మదే. మరి కొన్నినాళ్ళు స్వేచ్ఛగా తిరుగుతుంది ఆడది. ఆ రోజులలోనే బిడ్డలనుగూడా కనవచ్చును. తరువాత ఎవడయినా కోరితే వాడిని పెళ్ళి చేసుకుంటుంది. మళ్ళీ పెళ్ళితో పతివ్రత అయిపోతుంది-అయిపోవాలి. ఇతరులకు అందగూడదు. అంత చిత్రంగా ఉండేది ఆ పాతివ్రత్యం.

పెళ్ళి అన్న తరువాత ఈలాగా గొంతుకు ఉరివేసే మగవాడు, పెళ్ళి అవడానికి ముందుగూడా ఏవో పన్నాగాలు అల్లకుండా ఊరు కుంటాడా? అలా ఊరుకోవడం ఆ జాతికి లేదే! ఆదిలో హక్కులూ, అధికారమూ అంతా ఆడవారిది. తల్లిదే రాజ్యం - ఎంచేతనంటే, పిల్ల తల్లిదే. తండ్రి ఎవడో తెలియదు. ఆ రోజులలో బాధ్యత అంతా తల్లిది. ఆడదానిది. మగవాడికి బాధ్యతే లేదు. అలాంటి తల్లి రాజ్యాన్ని మెల్ల మెల్లగా తండ్రి రాజ్యంగా మార్చాడు మగవాడు. అందుకే అది మగజాతి

గుణం అంటున్నాను. తమ స్వేచ్ఛ కోసం, తమ సౌఖ్యం కోసం ఆడదానిని ఏమయినా చేస్తుంది ఆ జాతి. మనిషిని పశువుగా మారుస్తుంది ఆ మగజాతి.

అందుచేత ముందుకాళ్ళకుగూడా బంధం వేశాడు. పెళ్ళి అయిన తరువాత ఎవరినీ చేరకూడదు అన్నట్లే, పెళ్ళికి ముందు కన్యాత్వం కాపాడాలి అని సూత్రం పెట్టాడు.

అసలు కన్యాత్వంలో ఉండే మొదటి అభిప్రాయాలు మనవి చేస్తాను. ఆ రోజులలో ఆడది సమర్తాడిందంటే, దానిని ఒక మహామారి లాగా చూసేవారు. ఆ ఆడదానిని ఆశ్రయించుకొని ఎన్నో భూతాలూ దయ్యాలూ ఉంటాయని అనుకునేవారు. ఆ ఆడదానిని ముట్టుకుంటే ఆ భూతాలు పట్టుకుంటాయట. దాని కాలు భూమికి తగిలితే పచ్చిక మొలవదు, పంటలు వుండవు. దాని గాలి సోకితే చెట్టు కాయదు. అందుచేత రజస్వల కాగానే ఆడదానిని ఆకులమీదనో-ఇప్పుడు చాపలమీద అనుకోండి-విడిగా ఉండే రాతిమీదనో కూర్చోపెట్టేవారు. ఈ పాడు భూతాలు ఆడదాని అవయవాలు పాడుచేయకుండా ఉండడానికి ఏమేమో అగచాట్లు పడేవారు-ఇప్పుడు చిమ్మిలి పంచిపెట్టినట్టు ఆ భూతాలను మోసంచేసి ఎలాగయినా తప్పించుకోవడానికి ఈ ఆడదానిచేత మారువేషాలు వేయించేవారు. ఇప్పటికీ ఈ ఆచారం అరవదేశంలో ఉంది. ఈ పనంతా చాలా ముసలివారు చేయిస్తూ ఉండేవారు-చచ్చినా ఫర్వాలేదన్న ముసలివారు. చిన్న వయసువారు దగ్గరకు పోయేవారు కారు. ఆ రోజులలో అంత భయం ఉండేది.

ఇంత శ్రద్ధ తీసుకున్నా, ఆ పాడు భూతాలు వదిలిపెడతాయా? వదిలి పెట్టకుండానే ఉన్నట్టయితే, ఆ ఆడదానితో మొదట జతకట్టినవాడి గతి ఏమికావలసింది? భూతాలు వాడిని చించి చెండాడవా? ముక్కలుగా కొరికి తినవా? అబ్బో వద్దు! అమ్మో వద్దు! ఆ మొదటి జతకట్టడానికి ఎవ్వడూ సాహసించేవాడు కాదు. ముట్టుకోడానికే భయం.

అందుచేత ఒక ఉపాయం పన్నారు. రజస్వల అయిన పిల్లను మొదట ఎవడో ఒక ముసలివాడి దగ్గరకు పంపి, శోభనం చేసేవారు.

భూతాలు పట్టుకున్నాయా - ఆ ముసలిమంకు చస్తాడు. దానితోపాటు భూతమూ పోతుంది. తరువాత ఏ మగవాడయినా జతకట్టవచ్చు- రెండో కన్నెరికం.

లేదా, ఒక చెట్టును శోభనపు పెళ్ళికొడుకును చేసి ఆ చెట్టుతో ఈ పిల్లకు శోభనం చేస్తారు. తెల్లవారిన తరువాత ఆ చెట్టును నరికివేస్తారు. అంటే - భూతాలు చెట్టు పెళ్ళికొడుకును చంపివేశాయి అని అర్థం. తరువాత ఆ పిల్లతో జతకట్టడానికి భయం ఉండదు.

మనలో ఈనాడుగూడా కొన్ని దోషాలనుంచి తప్పించుకోవడానికి పెళ్ళికొడుకును అరటిచెట్టుతో పెళ్ళిచేయడము ఉంది.*

మరికొన్నాళ్ళకు-రాజులు, ఆచార్యులు, బ్రాహ్మణులు - ఇలాంటి పేరులు సంఘంలో ప్రవేశించిన తరువాత-వాళ్ళలో కొంత మహత్తు ఉందన్న భావాలు కలిగిన తరువాత-ఈ మొదటి శోభనాలకు ఆ పెద్దలు తాంబూలం పుచ్చుకునేవారు. సమర్తాడిన పిల్లను మొదట నాయకుడితోనో, రాజుతోనో, ఆచార్యుడితోనో, బ్రాహ్మడితోనో జతకట్టించేవారు. ఆ పాపాల భైరవులను భూతాలు ఏమీ చెయ్యలేవట! చచ్చినట్లు పిల్లను వదిలిపెట్టేవి. తరువాత ఏ మగవాడయినా జతకట్టవచ్చు-చావడు.

ఇలాగా భూతాలబారినుండి సమర్తాడిన పిల్లని తప్పించే ఏర్పాటునే కీడుతియ్యడం అంటారు. ఈ అలవాటు ఇప్పటికీ ఉంది. ఇతర దేశాలతోపాటు, ఇతర జాతులతోపాటు, మనదేశంలోగూడా ఉంది. మొదటి నిద్ర అన్న పేరుతో జాతి పెద్ద జతకడతాడు. కీడు తియ్యడం అన్న పేరుతో బ్రాహ్మడు శోభనపు పెళ్ళికొడుకవుతాడు. తిక్కన కవి తండ్రి గూడా ఇలాగా కీడుతీసినవాడే అంటారు. ఇప్పటికీ కొన్ని గ్రామాలలో అమాయకులు అలా కీడుతీయించుకుంటూనే ఉన్నారు. రజస్వల అయిన నక్షత్రం చాలా దుష్టనక్షత్రం అయితే చాలు-భయం. ఆ పిల్లకి కీడు పోవడానికీ, ఈ అగ్రజాతి మహానుభావుడి కామానికీ ఒక దారి ఏర్పడి పోతుంది. భూతాలు ఎంత పని చేస్తాయి?

---

* ''సమర్త ఏమిటి? చిమ్మిలి ఎందుకు?'' అన్న నా వ్యాసంలో ఈ వివరాలు చూడవచ్చు.

దేవతారాధనలో ఆడవాళ్ళు జతకట్టడంగూడా ఒక ఆరాధనగా ఉండేది. ఆ రోజుల్లో-ఇప్పుడుగూడాను-ప్రతి మగవాడు తన సంతాన శక్తిని దేవతకు అర్పణ చేస్తుండాలి. ఈ జతకట్టేపని అంతా కోవెలలోనే జరగాలి; అక్కడ ఏమయినా ఆర్జనచేస్తే ఆడది ఆ దేవతకు ఆ ధనం అంతా సమర్పించాలి-అలాంటి సూత్రాలు చాలా ఉండేవి. వాటి విషయం నా "దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు" అన్న పుస్తకంలో నివేదించుకున్నాను.[1] సంఘంలో ప్రతివాడికిగూడా ఉపకరించడం ప్రతి ఆడదానికి నియమంగా ఉండేది......

అలాగా, బుద్ధిపూర్వకంగా మగవాడు స్త్రీని ధారపోశాడు. ప్రథమ హక్కు కోసం కక్కుర్తి పడలేదు. తరవాత తెలివి కలిగింది కాబోలు. 'ఛీ! ఈ హక్కూ నాకే వుండాలి' అని బిరబిగిసి కూర్చున్నాడు. కన్యాత్వం పోకుండానే ఇంటికి రావాలన్నాడు. "అక్షతయోని"నే పెళ్ళిచేసుకుంటా నన్నాడు. ఒకరు ముట్టినదానిని పెళ్ళి చేసుకోను అన్నాడు.

బాగానే వుంది. కాని కన్యాత్వం ఉందో పోయిందో తెలుసుకోవడం ఎలాగా? దానికోసం కొన్ని కన్యాత్వ పరీక్షలు ఏర్పాటు చేశాడు. కచ్చడాలు కల్పించాడు. ఘోరమయిన హింసా విధానానికి పూనుకున్నాడు.[2]

---

1. "దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు?" అన్న నా గ్రంథం చూడండి.
2. "ఇనుప కచ్చడాలు" అన్న నా పుస్తకము చూడండి.

# పిల్లేళ్లూ ఉంగరాలూ

దేశదిమ్మరిగా తిరుగుతూ ఉండే మనిషికి ఒకచోట నిలకడ ఏర్పడేసరికి కలిగిన పెద్ద మార్పు ఏమిటంటే-మనిషికి ఆస్తి అన్న ఆలోచన కలిగింది. ఆ ఆస్తిని చక్కగా కాపాడుకోడానికి తోడు కావలసి వచ్చింది. దానికోసం విచ్చలవిడిగా సంచరిస్తూ ఉన్న ఆడదానిని పెళ్ళి అన్నపేరుతో భార్యగా చేసుకున్నాడు. భార్య అన్నతరవాత దానికి కొన్ని నీతులు నేర్పాడు. పతివ్రతగా ఉండాలన్నాడు. పెళ్ళయిన తరవాత ఆడది అందంగా ఉండడానికి ప్రయత్నం చెయ్యకూడదన్నాడు. ఎంత అందవికారంగా ఉంటే, ఎంత 'యాబ్రాసి'లాగా కనబడితే అంత పతివ్రత అని అనుకునేవారు. భార్యా రూపవతీ శత్రు వన్నారు.

ఇప్పటికైనా అందంగా ఉండడానికి ప్రయత్నం చేసేవారంతా షోకిల్లాలు అన్న అభిప్రాయం పల్లెటూళ్ళలో వుంది. అలాంటివారిని వన్నెల విసనకర్రలని ఎగతాళిగా మాటలాడుకుంటారు. 'ఏమమ్మా తలదువ్వుకోలేదేం?' అని ఒక అమ్మ అడిగితే, "ఉండనియ్యమ్మ. ఎలాగుంటేనేం, సంసారులం" అని జవాబివ్వడం కద్దు-అదీ సగర్వంగానూ.... ఏదో పాతివ్రత్యం అంతా తన చింపిరితనంమీదనే తాండవిస్తూ ఉందన్నట్టు.

కొన్ని దేశాలలో పెళ్ళి అయిన తరవాత ఆడది మరెవరినీ ఆకర్షించకుండా చెయ్యటానికి పెద్ద ప్రయత్నం చేస్తారు. ముఖాన్ని అంద వికారంగా తయారుచేస్తారు. ముక్కు కోస్తారు. చెవులు తెగనరుకుతారు. పళ్ళు ఊడగొడతారు. అలాంటి సూత్రాలే మనవారు కూడా ఉంచారు. అయితే ఒక్క చిన్న మార్పు పెట్టారు. భర్త దగ్గరనే ఉన్నప్పుడు ఈ నియమాలు అంతగా ఉండనక్కరలేదు. భర్త కొంచెం దూరంగాపోతే.... ఆడది పక్కా 'యాబ్రాసి' లాగా ఉండాలని శాస్త్రాలు వ్రాసి కుప్పలు వేశారు.

**అలకలు దువ్వరాదు; సరసాన్నములన్ భుజియింపరాదు; మై**
**కలప మలందరాదు; తిలకంబు రకంబుగ దిద్దరాదు;**
**భూషలు కై సేయరాదు......**

అని భర్తకు దూరముగ ఉన్న భార్యకు నియమాలు పెట్టారు. దీనికంతటికీ అర్థం ఒక్కటే - ఆ ఆడదానిమీద మరెవ్వడి కన్నూ పడకూడదు అని. ఈ సూత్రమే ఆనాటి నాగరిక జాతులవారికి గూడా ఉండేది. ఆడదిగూడా ఒక ఆస్తి అన్న అభిప్రాయమే అప్పుడూ, ఇప్పుడూ గూడాను. నా ఆస్తి ఇంకొకడు అనుభవించడమా అన్న ఈసే మగవాడికి.

అందుచేత ఈ ఆడదానికి పెళ్ళి అయింది అని - చూచినంత మాత్రంచేతనే, తెలిసేటట్లు చెయ్యడం ముఖ్యం అయింది. పెళ్ళి చేసుకున్నవాడు అందరికీ ఆ సంగతి తెలియపరుస్తాడు. పోట్లాటలో జయించి తెచ్చుకున్నా అంతే; పశువులను గొడ్లను ఇచ్చి తెచ్చుకున్నా అంతే. అందరికీ తెలియపరచాలి. అయ్యో, నాకు తెలిసిందికాదు అని ఎవ్వడూ తరవాత అనడానికి వీలు లేకుండా చెయ్యాలి. అలాగా జాతి వారికందరికీ ముందుకాళ్ళకు బంధాలు వెయ్యాలి. ఈ 'దండోరా' చాటింపు పద్ధతే ఇప్పటికీ ప్రచారంలో ఉంది. బాజాభజంత్రీలతో గూడా టముకువేస్తారు. ఒకడు ఒకర్తెను పెళ్ళిచేసుకుంటే ఇంత హడావుడి ఎందుకో! అని అనిపిస్తుంది. (అలాగానే ఒక పిల్ల సమర్త ఆడిందంటే - ఆ సంగతి ప్రపంచాని కంతటికి తెలియజేసే పద్ధతి ఎందుకు? అని చదువరులలో అనేకులు అడిగే ఉంటారు. కారణాలు గూడా వారిలో కొందరికి తోచే ఉంటాయి) ఈ హడావుడి అంతా ఒక రిజిస్ట్రేషన్ లాంటిది; ఒక గజెట్ ప్రకటన వంటిది.

పెళ్ళి అయిన ఆడది అని తెలియడానికి కొన్ని గుర్తులు గూడా ఉంచేవారు. పచ్చబొట్టు గుర్తు ఒకటి ముఖ్యం. మంగళసూత్రం అన్న పేరుతో మెడలో వేసేతాడు ఒక గుర్తు. గాజులు అన్న పేరుతో చేతులకు వేసే సంకెళ్ళు ఒక గుర్తు. తాళిబొట్టు ఒక గుర్తు. సందిటి కడియాలు ఒక గుర్తు. కాలిగొలుసు ఒక గుర్తు. ఇవి లోహంతో చేసినా, గవ్వలతో చేసినా, తిమింగిలం ఎముకలతో చేసినా - అన్నీ గుర్తులే.

"బసూటో" అన్న జాతివారిలో పెళ్ళినాడు ఒక ఎద్దును చంపి, దాని గంగడోలునుంచి రెండు సన్ననిముక్కలు కోస్తారు. ఒక ముక్కను పెళ్ళికొడుకు చేతికీ, మరొకదానిని పెళ్ళికూతురు చేతికీ కంకణాలుగా కడతారు. మెడలో తాడు మంగళసూత్రం అంటే, దీనిని మంగళ కంకణం అని అంటారా?

ఉంగరాలు ఉంచడం గూడా చాలా పురాతనమయిన అలవాటు. పరిశోధకులు చాలమంది ఈ ఉంగరాలకూ, జతకట్టే పద్ధతికీ కొంత సంబంధం ఉంది అని నిశ్చయించారు. ఆలుమగలు కార్యానికి ఈ ఉంగరం ఒక నిదర్శనం అన్న అభిప్రాయం ఇప్పటికీ ఆఫ్రికా మధ్యభాగంలోనూ, అమెరికా ఇండియనుల్లోనూ ఉందంటారు. దీని నిర్మాణంలో ఒక చిత్రం ఉంది. ఆడదాని వేలు కొలత తీసుకోకుండానే ఉంగరం చేయిస్తాడు పెళ్ళికొడుకు. తాను చేయించిన ఉంగరాన్ని పెళ్ళిలో ఆడదానిచేతికి తగిలిస్తాడు. ఏ వేలుకి సరిపోతుందో, దానికయినా వదులుగా ఉంటుందో, బిగువుగా ఉంటుందో, ఇలాంటివాటినిబట్టి ఆ కాపురం ఎలాగుంటుందో గ్రహిస్తారు. ఈ ఉంగరం తొడుగులు కొంత మోటు హాస్యానికి గూడా అవకాశం ఇస్తాయి.

ఇప్పటికీ మనలో కాలికిచుట్లూ, మట్టెలు, పిల్లాణులూ ఇవ్వడం ఉంది. (పిల్లాణి, పిల్లాడి, పిల్లేళ్ళు అని అనేక రూపాలున్నాయి ఈ వస్తువుకు.) ఇవికూడా ఈ ఉంగరాల పద్ధతికే గుర్తులు. వీటిని పట్టి కూడా దాంపత్యం ఎలాగ వెలుగుతుందో చెప్పుకొనేవారు. ఆనాటి హాస్యం మాత్రం ఈనాడు లేదు- దాని భావం మరిచిపోయాం కాబట్టి.

ఆడదీ మగవాడూ కలిసిపోయారు అన్న సంగతి అందరికీ తెలియచేయడానికి మరికొన్ని లాంఛనాలు జరుపుతారు. చేతులు కలుపుతారు-పాణిగ్రహణం అన్న పేరుతో. అమెరికాలో పెళ్ళికొడుకు కాల్చిన చుట్టను పెళ్ళికూతురు కాలుస్తుంది. ఒక్క కంచంలోనే తింటారు- ఒక్కొక్క దగ్గర, ఒక్కముద్ద అన్నంలో సగం పెళ్ళికొడుకు కొరుక్కొని తింటే, మరొక సగం పెళ్ళికూతురు తింటుంది. ఇదే ఇప్పటికీ "బ్రయిడల్ కేక్" అన్న పేరుతో క్రిస్టియనులు జరుపుతున్నారు. మన బువ్వంబంతి

ఈలాంటిదే. మరికొన్ని చోట్ల ఒక గిన్నెలో సారాయిపోసి, వధూవరులు పంచుకొని తాగుతారు. ఇదికూడా కొంత మార్పుతో ఇప్పుడు చాలా దేశాలలో ఉంది.

మనలో "వదనేత తాంబూల దానం" అని పెద్దలు అంటారు. అనగా నోటితో తాంబూల మందివ్వ మన్నారు పెద్దలు. అంతటితో తీరక "ప్రతి యాచితైః" మళ్ళా పెళ్ళికూతురుని అడిగి ఆమె ముఖ తాంబూలం పుచ్చుకోమన్నారు. ఇవన్నీ ఏకమయారు అనడానికి లాంఛనాలు. తరవాత మరెవ్వరూ మాకు తెలియదని అనకుండా కట్టుమంత్రాలు.

ꕥꕥꕥ

# పెళ్లిలో పురోహితుడు!

జయించో, దొంగిలించో ఒక ఆడదానిని ఎత్తుకురావడం; దానిని భార్యగా ఉంచుకోవడం ఒక పద్ధతి. తండ్రితోనో, భర్తతోనో బేరంచేసుకొని వాడికింత ధనం-పశువులో పందులో ఏవో-ఇచ్చి ఆడదాన్ని తెచ్చుకొని దానితో కాపురం చెయ్యడం మరొక పద్ధతి. ఈ రెండు పద్ధతుల మీదనే వివాహాలు జరుగుతూ ఉండేవని స్పష్టపడింది.

తప్పితే-మరొక్క చిన్న పద్ధతి గూడా ఉండేదని అంగీకరించవచ్చు. అదేమిటంటే, ఒక ఆడదీ ఒక మగవాడూ ఒకరినొకరు పసందు చేసుకుంటారు. దీనిని ప్రేమ అని అనడానికి సాహసం చాలదు. చరిత్ర లోనూ, పురాణాలలోనూ ఉన్న విషయాలను బట్టిచూస్తే, ఇలాంటి పసందులలో బాగా కనబడేదంతా వట్టి కామమే అని తేటపడుతుంది. అవయవాల బింకం చూసి ఆడదాన్ని మగవాడు కోరతాడు; కండా, కైవారమూ చూచి ఆడది మగవాడిని కోరుతుంది. వీరిద్దరూ జతకడతారు. మరెవ్వరితోనూ చెప్పకుండా సన్నసన్నగ ఒకనాడు పరారీ అవుతే అవుతారు లేదా భార్యాభర్తలయి అక్కడనే ఉంటారు.

దీనికి గాంధర్వం అని పెద్ద ముద్దుపేరు పెట్టారు, ఏదో పై లోకంలో నుంచి ఊడి ఈ లోకంలో పడ్డట్టు. వీటికి దొంగ పెళ్ళిళ్ళు, స్వేచ్ఛా వివాహాలు అంటే మన కథకు సరిపోతుందేమో! శాస్త్రాల ప్రకారం ప్రేమతోనే ఈ పెళ్ళిళ్ళు జతపడేవని అంటారు. కాని నిజానికి ఇవి చాలావరకు కామంవల్ల కలిగినవే.

**తస్యా స్తనౌ యది ఘనౌ జఘనం చ హారి......**

స్తనములను చూచి, జఘనం చూచి, వలచిన వలపు ప్రేమ అనిపించుకో నేరదు కదా!

ఏమయితే నేమి-అప్పటికీ, ఇప్పటికీ గూడా వాడుకలో ఉన్న వివాహాలు ఇలాంటివే. ఇందులో ప్రమేయం కలవారు; ఆ ఇంటివారూ

ఈ ఇంటివారూ-వీరి అంగీకారమో ఆదరమో ఉండాలి. అది ఉంటే, పెళ్ళి అనడానికి ఆటంకం ఉండదు. ఆ అంగీకారం కలిగిన తరవాత, నాలుగు లాంఛనాలుంటాయి. వాటిని పాటిస్తారు. ఆలూ మగడూ అయి ఒక ఇంటి వారవుతారు. కుల పెద్దలంతా భోజన భాజనాలతో సంతోషిస్తారు.*

దీనిలో పురోహితుడికి స్థానం ఎక్కడా కనబడదు. మతానికీ, ఆచార్యులవారికీ ప్రమేయం ఉండదు. ఉండకూడదు గూడాను. ఇది కేవలం ఒక ఆర్థిక సమావేశం. ఇంటి వ్యవహారాలు నడపడానికి ఒక వాటాదారుల కూడిక. దీనిలో పురోహితుడికి అవసరం ఏముంది? మతానికి జోక్యం ఎలా వచ్చింది? ఏ జాతివారు పెళ్ళి చేసుకున్నా, ఆచార్యులజాతివారు రావడం ఎందుకు? తెలిసీతెలియని మంత్రాలగోల ఎందుకు? ఇదంతా అనవసరం అనీ చాల విధాల అక్రమం అనీ గూడా కనబడక తప్పదు.

ఇలాగు మతం పేరున కొందరు అధికారం చెలాయించడానికి చూడడం ఒక్క మనదేశంలోనే కాదు; యూరపులో గూడా వుంది. సాధారణంగా అన్ని మతాలలోనూ వుంది ఈ ఆచార్యుల ఆర్భాటం. చర్చి అంగీకరిస్తేనేగాని అది పెళ్ళి అనిపించుకునేది కాదు. అయ్యవారు వచ్చి ఆశీర్వదిస్తేనేగాని అది కల్యాణం కిందకు వచ్చేది కాదు. అన్ని ఏర్పాట్లూ ఆ ఇంటివారూ ఈ ఇంటివారూ చేసి అమర్చియిస్తే, అయ్యవారువచ్చి చెయ్యి వెయ్యాలి. లేకపోతే అది పెళ్ళే కాదు అన్నంతవరకు వచ్చింది.

నీటిలో నిప్పు పుట్టినట్టు కేవలం వ్యవహార విషయంలో మత సంపర్కం కలిగించారు. రాను రాను అన్నిటినీ అదే మింగివేసింది. ఇప్పటికీ ఈ మత అధికారాన్ని తోసిరాజు చేయలేకుండా ఉన్నారు ప్రజలు.

* సంతోషం ఎన్ని చిత్ర విచిత్రమయిన పద్ధతులలో ఉండేదో ''దేవాలయాలమీద బూతు బొమ్మలెందుకు?'' అన్న నా గ్రంథంలో చూడండి.

కాని మనము "తక్కువ జాతివారు" అంటూ వుంటామే - ఆ జాతుల వారు మాత్రం ఇంకా ఆత్మగౌరవంతో మెలుగుతున్నారు. అర్థంలేని ఈ ఆచార్యుల అగచాట్లకు వారి పెళ్ళిళ్ళలో తావేలేదు. పురోహితుడు లేకుండానే పెళ్ళిళ్ళు చేసుకొని పిల్లలను కంటున్నారు. సుఖంగా కాపురాలు చేసుకుంటున్నారు.

వారి పెళ్ళిళ్ళు సనాతన పద్ధతిని జరుగుతాయి. అంటే-మాటలూ బేరాలూ అయిన తరవాత అందరూ చక్కగా భోజనాలు, విందులూ చేసుకుంటారు. ఏవో చిన్న చిన్న లాంఛనాలు జరుపుకుంటారు-ఇకను చక్కగా కాపురం చేసుకోండి అని వారిని విడిచి పెడతారు. మంత్రాలూ, మాయలూ 'సువర్ణ పుష్పం సమర్పయామీ'లు లేవు. కల్తీలేని-నిజాయితీ పెళ్ళి. వారి ఆచారాలు గూడా కల్తీలేనివి. అలాంటి వారిని తక్కువ జాతివారని అన్నారు.

ఎందుచేత? ఈ పౌరోహిత వర్యులను పిలవరు కనుక; పేర్లు పెట్టే పాటి చదువూ అధికారమూ వీళ్ళకే వుంది కనుక. వీరు ఎక్కువ జాతివారున్నూ వారు తక్కువ జాతివారున్నూ అయ్యారుకాని, చరిత్ర దృష్టినీ, విమర్శక దృష్టినీ వారే సనాతన ఆచార సంపన్నులు; ఆత్మగౌరవం కలిగిన వీరులు; ఉబలాటానికి లొంగిపోని బుద్ధిమంతులు. నిజంగా, వారే ఎక్కువ జాతివారు కావాలి. వారి జీవితంలోనే మానవ సనాతన ఆచారాలు కనబడతాయి. తక్కిన వారిది అంతా మాయ బతుకు వేషం.

సరిసమానంగా వుండే ఆడదానిని స్వాధీనం చేసుకొని బానిసగా చేశాడు మగవాడు. ఆడదాని అధికారాన్ని అంతటినీ తనది చేసుకున్నాడు. ఆడదానికి అధికారం వుండకూడదని శాసనాలు చెక్కించాడు మగవాడు. ఆ దోషానికి ఫలితమా అన్నట్లు జరిగింది - ఆ మగవాడి మగడుగా వచ్చాడు మన పురోహితుడు. టట్! పనికిరాదు. నేను చెప్పినట్టంతా నువ్వు చెయ్యాలి; లేకపోతే శపిస్తానని గుడ్లురిమాడు. పనికిమాలిన కోతిలాగా అనుకరణ చేష్టలన్నిటినీ చేయించాడు. అప్పటికీ ఇప్పటికీ నేను అధికారిని అని డబ్బా వాయించాడు. కాదు అన్నవాడిని కడజాతివా డన్నాడు. అవును అన్నవాడిని అందలం ఎక్కించాడు.

అది పురోహితుడు చేసిన సంఘసేవ. అతడు ముట్టుకుంటేనే అది మంగళసూత్రం అవుతుంది; లేకపోతే తాడుముక్క. అతడికి దక్షిణ ఇస్తేనే సాక్షాత్తు అగ్నిసాక్షి వివాహం అవుతుంది. లేకపోతే అది ఒట్టి రంకు చేష్టకిందనే లెక్క. అతడి అర్థంలేని మంత్రాలుంటేనే అది వివాహము; లేకపోతే వారి సంతానానికి హక్కు వుండదు.

ఎంత అధికారం సంపాదించారు? ఎంత అకారణం? దీనివల్ల పెళ్ళి అన్న సంస్థ రూపే మారిపోయింది. తోడూ, జోడూ అన్న అభిప్రాయం ఎగిరిపోయింది. వ్యవహారదృష్టి అంతరించిపోయింది. మత సంబంధం అన్నమాట స్థిరపడ్డది. మతానికీ పెళ్ళికీ మంగళసూత్రం కట్టారు. అప్పటినుంచే కుటుంబ దుఃఖం ఆరంభమయింది. అప్పటినుంచే హృదయావేదన మొదలయింది. నిజానికి అప్పటినుంచే పడుపువృత్తి అంకురించింది.

# ఏకులే మేకులు!

ఆచార్యుడనండి; పురోహితుడనండి, ప్రీస్టు అనండి-ఏమన్నాసరే ఈ వ్యక్తి అసాధ్యుడు. ఏకై వచ్చాడు సంఘంలోనికి, మేకయి కూర్చున్నాడు. ఆ సింహాసనం నుంచి దిగనంటాడు. తన అధికారమే చెల్లాలంటాడు. శపిస్తానంటాడు. నరకం అని భయపెడతాడు.

పిలవని పేరంటంగా వచ్చాడు పెళ్ళి తంతులోనికి. ఏదో తెలిసీ తెలియని సూత్రాలు మంత్రాలూ అల్లాడు. అర్థంలేని అబద్ధాలు ఆడించాడు. నాలుగు అక్షతలు నెత్తిని వేశాడు. అవి పడకపోతే అది పెళ్ళికాదన్నాడు. తాను లేకపోతే ఆ పెళ్ళికి అధికారమే లేదన్నాడు. అసాధ్యుడు కాడూ!

మొదట పెళ్ళిలో ఇతడిని అడగవలసిన అవసరం ఏమీలేదు. ఇతని అనుమతి అంతకంటే అక్కరలేదు. ఒక మగవాడు ఒక ఆడదానిని తనకు భార్యగా, తన గొర్రెలు కాయడానికి, తనకు వంటచేసి పెట్టడానికి, భార్యగా చేసుకోబోతాడు. దాని జీవితంలో వా డెన్నోవాడో? దాని తండ్రితో బేరమాడుకుంటాడు. బేరం షరతులన్నీ జరిగినంతకాలం వీరిద్దరూ ఆలూమగలు. అది తప్పిందా, ఎవరిదారి వారిదే. అలాంటి పెళ్ళిలో పురోహితుడికి జాగా ఎక్కడుంది?

యుద్ధంలో జయించితెచ్చినదానిని భార్య అని ఉంచుకుంటాడు-ఇంకెవడో కొట్టి ఈడ్చుకొనిపోయినంతవరకు-ఆచార్యులవారి అవసరం ఎక్కడ వచ్చింది?

పిల్లనుచూచి భ్రమపడతాడు-సమయం చూచుకొని ఏమంటావు అని అడుగుతాడు. పిల్ల ఊ అంటుంది. మామకు కట్నం చెల్లించడానికి శక్తిలేదు. ఏదో ఒక రాత్రి ఎవరితోనూ చెప్పకుండా లేచిపోతారు భార్యాభర్తలు. ప్రీస్టుగారికి దీనిలో ప్రమేయం ఏముంది?

అయినా, ఇప్పుడు "నాగరిక" లోకంలో, ఎక్కడ చూచినా వీళ్ళ అట్టహాసమే ఎక్కువ. ఘోరమయిన పెళ్ళిళ్ళు చెయ్యించడానికీ, మంచి పెళ్ళిళ్ళు పాడుచెయ్యడానికీ వీరే పెద్దలు. రౌరవ నరకానికి దారి చూపిస్తూ తొంభయి యేళ్ళ తొక్కుకు ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డనుకట్టి, దానిని 'శుభకార్యం' అనీ, అదీ ఒక "శోభనం" అని ఆశీర్వదించిన మహా పాపానికిగూడా వీళ్ళు ఒడికడతారు. ఉరితాడుగా గళానికి సూత్రంకట్టి, దానిని మంగళసూత్రం అని పొగిడారు. ఆ పెళ్ళికొడుకు ఎంత దుష్టుడయినా, ఎంత నీచుడయినా యావజ్జీవమూ ఆడది వాడినే దైవంలాగా చూడాలన్నారు. అంతేకాదు, చచ్చిన తరవాత గూడా ఈ సంబంధం ఉండాలన్నారు. మళ్ళా పెళ్ళిమాట తలపెడితే, మహాపాప మన్నారు.

మహా పవిత్రమయిన భావాలతో, ప్రేమనే దైవతంగా భావించి, దానికి పట్టాభిషేకం కట్టగలిగిన ఇద్దరిని "టట్! పనికిరాదు; ఇది రంకు సంబంధమేగాని పెళ్ళికాదు" అని ఆడంబరం చేస్తారు; ఆంక్షలు పెడతారు. జందెప్పోగులు పెనవేస్తారు.

ఎవరు వీరు? వీరికి అధికారం ఎవ్వరిచ్చారు? ఎప్పుడిచ్చారు; ఎందుకిచ్చారు? అని అడిగినవారు లేరు. ఆ ప్రశ్న ఎవరయినా అడుగుతారేమో అని ముందుగా వీరే జాగ్రత్తపడ్డారు. శ్లోకాలూ, మంత్రాలు అన్నీ వ్రాసి ఒక దగ్గర పెట్టారు. ఏమని? ప్రశ్నించినవాడు పాపి, నాస్తికుడు; బ్రహ్మద్రోహి;....అని వాడికి ఈ తరవాత కలిగే మహాపాపి శిక్షలన్నీ శ్లోకాలతో, బొమ్మలతో బాగా సృష్టి చేశారు. అందుచేత ఎవ్వడూ అడగలేదు. ఇప్పుడు గూడా అడగడు.

ఈలాగా జరగడానికి, అంటే, అధికారం సక్రమంగా లేకుండా ఇంత ఎక్కువగా సాధించడానికి వీలుందా అని కొందరు శంకించవచ్చును. అలా సందేహించడంలో తప్పులేదు. ఈ సందర్భంలో ఒక చిన్న విశేషం చెప్పుకుంటారు: అది వినవలసిందే.

ఒక ఊరిలో ఒక మహారాజు పరిపాలన చేస్తూ ఉన్నాడట-న్యాయపరిపాలనమే. సమర్థులయినవారు అంతా పెద్ద పెద్ద ఉద్యోగాలలో

ఉన్నారు. ఆ ఊరిలోనే తల ఉన్నవాడొకడు ఉద్యోగం లేకుండా ఉండడం తటస్థించింది. తల ఉన్నవాడు కాబట్టి ఊరుకోలేకపోయాడు.

ఒకనాడు ఉదయం ఒక బల్ల తీసుకొని వెళ్ళి, కోట సింహ ద్వారానికి ఒక ఇరవై గజాల ఇవతలనే ఆ బల్ల వేసి దానిమీద కూర్చున్నాడు- ఒక సిరాబుడ్డి, కలం పట్టుకొని.

కోటలోనికి ఎవరయినా పనిమీద వస్తూ ఉన్నప్పుడు-ఓయ్! ఎవరు నువ్వు? ఏంకావాలి? అని నాలుగు ప్రశ్నలడిగేవాడు. అయ్యా! మా దరఖాస్తు, మా మనవి...అని వారు ఏదో జవాబు చెప్పేవారు సహజంగా.

ఏదీ, పిటీషన్ అని తీసుకొని, చూచి, దానిమీద ఒక మూలను తన సిరాకలంతో ఒక గుర్తు పెట్టేవాడు ఈవల ఉన్న నిరుద్యోగి. గుర్తు మాత్రం ధాటీగా పెట్టేవాడు.

ఈ గుర్తుచూచి అధికారముద్ర దానిమీద పడినట్లే భావిస్తూ ఉండేవారు కావలివారూ, ఉద్యోగస్థులూనూ. దివాణం ఉద్యోగులు వస్తూ పోతూ ఉన్నప్పుడంతా ఈ నిరుద్యోగిని చూస్తూనే ఉండేవారు. రాజుగారు నియమించారేమో అని ఉద్యోగు లనుకొనేవారు; ఉద్యోగులే నియమించా రేమో అని రాజుగా రనుకొనేవారు.

దివాణంలోనికి రావలసిన వారంతా మొదట ఆ నిరుద్యోగి దగ్గరకు రావడం ఆచారమయిపోయింది. సదుపాయాలు చెయ్యండి అని లంచాలు గూడా నిరుద్యోగికి కడుతూ ఉండేవారు. కోరికలు ఫలించినవారు సంతోషంవల్ల ఇతనికి ఏదయినా కానుక సమర్పించేవారు. నిరుద్యోగ బాధ ఈలాగా పోగొట్టుకున్నాడు.

కోటలోనుండి జీతంగాని, భత్యంగాని లేదు. ఎవ్వరూ వీడిమాటే ఎత్తేవారుకారు. నిరుద్యోగి ఉద్యోగం అవిచ్ఛన్నంగా సాగుతూనే ఉండేది.

ఇంతలో ఒకనాడు నిరుద్యోగికి తీవ్రమయిన జ్వరం వచ్చింది. పాపం! తన బల్ల దగ్గర కూచోడానికి కూడా వీలులేకపోయింది. ఆ వేళ ఆబ్సెంటు అయాడు-అంటే పనికిపోలేదు.

మనవులు చెప్పుకోవలసినవారూ, ముడుపులు చెల్లించుకునేవారూ, దరఖాస్తులు పెట్టుకోవలసినవారూ ఎప్పటిలాగా వచ్చారు. సంతకాలకు వీలులేకపోయింది.

నిరుద్యోగి సంతకం కనబడదు. గేటు దగ్గర పహరా జవాను లోపలికి వదలడు. లంచమిచ్చుకొని లోపలికి వెళ్ళినా గుమాస్తా కాగితం పుచ్చుకోడు. ఏదీ ఆ గుర్తు? అని అడుగుతాడు.

ఆ బాధ తప్పించుకొని లోనికివెళ్ళి అధికారి దగ్గర ఆ దరఖాస్తు పెట్టినా, మొదటి హజారం సంతకం లేనిది ఉత్తరువు ఇవ్వడానికి వీలులేదు అని కొట్టివేసేవారు.

వచ్చిన ప్రజలు మొఱ్ఱో అని గోలపెడుతూవున్నారు. రాజుకి ఈ సంగతి తెలిసింది. ఎవరయ్యా ఇతడు? అన్న ప్రశ్న అప్పుడు వచ్చింది; అదేమో అంటే అదేమో అనుకున్నారు. మేము నియమించ లేదంటే, మేము నియమించ లేదండీ అనుకున్నారు.

సంగతి బోధపడ్డది-ఇదంతా స్వయందత్త ఉద్యోగమే అని. అయినా, అప్పటికి అలవాటు పడివున్నారు కాబట్టి, ఒక ఉద్యోగంగానే అంగీకరించారు రాజుగారు.

మన పురోహితుడిది గూడా ఈలాంటి ఉద్యోగమే-స్వయందత్త ఉద్యోగం. పనిలేనిచోట, ఏదో పని ఉన్నట్లు నటించాడు. తలకాయ ఉన్నవాడు; స్వలాభ చింత తప్ప ధర్మాధర్మ విచక్షణ లేనివాడు. కాబట్టి మెల్లగా నేనే పెద్దను అని కొర్రెక్కి కూర్చున్నాడు. దిగనంటాడు. శపిస్తానంటాడు.

ప్రవేశించింది మొదలు పన్నాగాలు ఆరంభించాడు. తన అధికారం శిలాక్షరం అయిపోవాలి. తన్ను ఎప్పుడు వదలకూడదు కదామరి! అటు ప్రీస్టూ, ఇటు పురోహితుడూ అందరు ఒక్కలాగే పన్నాగాలు పూనారు.

తాము కన్ను గీటినవి ఎలాంటి ఘోర దురాచారాలయినా మంచివే అన్నారు. తాము కన్ను గీటనివి ఎంత మంచి పనులయినా, దురాచారాలన్నారు.

వ్యవహార రూపంగా, ఆర్థికంగా చేసుకున్న పెళ్ళి ఏర్పాటులో అంతరార్థం ఉందన్నారు. మీకు తెలియదు అన్నారు. సూత్రాలు శ్లోకాల రూపంగా దీర్ఘాలు తీసి చదువుతూ వినిపించేవారు.

అర్థంలేని మాటలన్నీ ఆడించేవారు. అనగూడని ప్రమాణాలన్నీ అనిపించేవారు. పెళ్ళిచేసుకున్న ఉత్తరక్షణం మరొక ఆడదానితో పోవడానికి సిద్ధంగా ఉన్నవాడి చేతను గూడా "నాతి చరామి" అని అసత్యం పలికించారు.

పలికించినప్పుడు వాడు అతిచరించడు అన్న భావమే పురోహితుడికి లేదు. తప్పకుండా అతిచరిస్తాడన్న నమ్మకం కూడ ఆ ప్రీస్టుకి ఉంటుంది. అయినా ఈ ప్రమాణం చేయిస్తారు.

ఎందుకు? ఆడదానిని ఆ మాటతో కట్టిపడవేయడానికి, దానికి రౌరవ నరకం కళ్ళకు కట్టి చూపించడానికి.

మగవాడి సంగతో అంటేనా? "మగ మారాజు!"

**"ఎన్ని పూవులన్**

**వ్రాలదు తేటి? యట్లు మగవాడనువానికి దోసమున్నదే?"**

అతనికి దోస ముంటుందా? అని పురాణాలు, శాస్త్రాలు చూపిస్తారు.

ఇలాగా చేసి, ఈ ప్రీస్టులూ, ఈ పురోహితులూ, ఒక పెద్ద అధికారానికి ఎసరు పెట్టారు. అక్కరకు మాలిన వీరు ఉంటేనేగాని అది సనాతన వివాహం కాదట! ఇంతకంటే విడ్డూరం ఉంటుందా? ఏమంటే- అసలు అనాదినుంచి వస్తూన్న సనాతన వివాహానికి పురోహితుడితో సంబంధమే లేదుగదా?

స్వార్థంకోసం మగవాడు ఆడదానిని అన్యాయంచేసి, దాని అధికారం అంతా హస్తగతం చేసుకున్నాడు. మతం పేరుతో పురోహితుడు తన స్వార్థంకోసం ఆ మగవాడిపక్షం చేరాడు. ఇద్దరూకలిసి ఆడదానికి 'పతియే దైవం' అని పాతివ్రత్యం అన్న మాటను సృష్టించారు. దానితో వాళ్ళ అధికారం నిర్భేద్యంగా చేసుకున్నారు. ఆడవాళ్ళకుమాత్రం నియమాలు, లక్షలు పెట్టి బంధించారు.

పాతివ్రత్యం అంటే సత్ప్రవర్తన, నీతి నియమాలతోటి జీవనము అని అర్థం చేసుకుంటే, ఎవరికీ ఏ ఆక్షేపణా వుండదు. అది అందరూ కోరేదే. సంఘానికి కావలసిందే. కాని పతి ఎలాంటివాడయినా, ఆడదానికి దేవుడు అని అర్థం చెప్పుతేనే, మనం అంగీకరించలేము. లోకంలో ఉన్న రకరకాల భర్తలందరినీ దేవుళ్ళు చేస్తే వచ్చే ప్రమాదం చూడండి; హంతకులూ, రంకువారూ, తాగుమోతులూ - వీళ్ళంతా దేవుళ్ళనవలసి వస్తుంది. అసలు దేవుడిని కిందికి ఈడ్చినట్టవుతుంది. ఆడదానిని అగౌరవపరచడం కాదు - దేవుడినే అవమాన పరచినట్టు!

దీనిలోని అనర్థకం ఏమిటంటే, ఆడదానిని మోసపుచ్చి బానిసగా చేసుకోడానికి కల్పించిన ఈ మాట పట్టుకున్నాడు. తాను నిజంగా దేవుడినే అని ప్రవర్తించాడు; తన అధికారాన్ని ఘోరంగా చెలాయించాడు. పురోహితుడి సాయం తీసుకొని ఆడదానికి బుద్ధీ, జ్ఞానం లేదని, దానికి స్వాతంత్ర్యం వుండకూడదనీ, హక్కులు ఏమీ లేవనీ, అది చదవకూడదు, పర పురుషునితో మాటలాడకూడదు అంటూ శాస్త్రాలు పెట్టించాడు. తాను చచ్చిన తరువాతగూడా తనకది భార్యగానే జీవించాలట. మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదట. ఈ అధికారంతో మగవాడు ఆడదానిని పెట్టిన హింసలు ఘోరాతి ఘోరాలు. న్యాయమయిన శిక్షాస్మృతే మనకుంటే ఈ మగవాడిని కండలు నరికి కాకులకు వేయవలసే ఉంటుంది.

కాలం మారింది. సత్యం బయటపడ్డది. ఆడది మేలుకొన్నది. తన స్థానం, తన సమానత్వం నిలబెట్టుకుంటూ ఉంది. మగవాడికి జ్ఞానోదయం కలిగిస్తూ ఉంది. మన సంఘ జీవితంలో ఉన్న కుళ్ళుని తొలగించడానికి కంకణం కట్టుకుంది. భారత భూమిని ధర్మభూమిగా తయారుచేస్తూంది. అనేక దురాచారాలతోపాటు ఈ పెళ్ళిసూత్రాలను గూడా నిర్మలం చేస్తుంది. సందేహం లేదు.

# అనుబంధాలు

## కన్యాదానం

మన సమాజంలో వివాహాలకు కన్యాదానా లంటాము. ఆ మాటలోనే మన సమాజంలోని గుట్టు బట్టబయ లవుతుంది. స్త్రీలను ఎంత గౌరవంగా చూచేవారో తేటపడుతుంది.

దానం అంటే-గోదానం, భూదానం అన్నప్పుడు దాతకు ఆ గోవు మీదనూ, భూమి మీదనూ ఉన్న అన్ని హక్కులను దానం పుచ్చుకున్న వాడికి ఇచ్చివేస్తాడు. ఆ దాన వస్తువును వాడు ఏమి చేసినా అడగలేము. అనుభవించవచ్చు. ఇంకొకరికి ఇచ్చివేయవచ్చు. నాశనం చేయవచ్చు.

అలాంటి అధికారమే కన్యాదాన పద్ధతిలో వరునికి కలుగుతుంది. అంటే ఆ ఆవుతో సమానంగా చూస్తారన్నమాట! అందుచేతనే కొన్ని జాతులలో వరుడు వధువు మెడలో ఒక తాడువేసి, పశువును తోలుకొని వచ్చినట్లుగా, ఆ తాడు పట్టుకొని వస్తాడు. ఈ గళ సూత్రాన్నే తరువాత తరువాత మంగళసూత్రం చేశామని మరొకసారి మనవి చేస్తున్నాను. గళ సూత్రాన్ని మంగళసూత్రం చేసినప్పుడు ఈ సూత్రానికొక గౌరవం కలిగించటానికి, దానియందు స్త్రీలకు కొంత ఆసక్తి కలిగించడానికీ, ఆ తాడున పుస్తెలు 'తాళిబొట్టు' గుచ్చి, అదంతా ఒక అలంకారంగా భావించమన్నారు. ఇప్పుడు విశ్వకర్మ ఇంటినుంచి ముత్తైదువలు ఉల్లబాలతోనూ, మంగళ వాయిద్యాలతోనూ తీసుకొని వచ్చిన 'మంగళ సూత్రాలు' ఈ పుస్తెలే, తాడు కాదు.

ఇక్కడొక్కమాట మనవి చేయాలి. మన పురోహితులవారు చెప్పే మంత్రాలలో ఎక్కడా ఈ పుస్తెల సంగతే లేదు. ఇప్పుడు మన వారింత ప్రాధాన్యం చూపుతున్న ఈ తాళిబొట్టులు ఉత్తరాదివారికి లేనేలేవు. ఇంతేకాదు; వారి మంత్రాలలో తలంబరాలు (తల్రబాలు)

బియ్యమో, అక్షతలో ఒకరి నెత్తిని ఒకరు కుమ్మరించుకోవడంగూడా లేదు. ఇదే ప్రమాణం చేయడమని ఈ తలంబ్రాల ఘట్టం పెళ్ళిలో ఎంతో ఉత్సాహంగా పాటిస్తుంటారు. ఈ పుస్తెలు ఎంత బంగారంతో (చాలా స్వల్పమేలెండి) చేయాలో మన పురోహితులు నిర్ణయించారు. ఈ పుస్తె గుండ్రంగా ఉండాలా లేక రావాకు ఆకారంలో ఉండాలా అని కొన్ని కుటుంబాలలో గుద్దులాటకూడా కలుగుతుంటుంది. అరవవారికి ఈ ఆకారం కనపడదు. ఈ విధంగా మనవారికి ఈ పుస్తెలు వివాహమయినట్టు గుర్తుగా ఉండడమే కాక, మహాపవిత్రమయి, పూజల కర్హంగూడా అయ్యాయి.

## మహామోసం

ఇంత నికృష్ట భావంతో గొడ్డును తోలుకొని యింటికి తెచ్చిగూడా వరుడు పెళ్ళికూతురితో చెప్పిన (పురోహితుడు చెప్పించిన) మాటలు చూచారా, "నామీద నీదే అధికారం; అత్తమామల మీద నీదే అధికారం; తోడికోడండ్ర మీద నీదే అధికారం; సంతానం మీద నీదే అధికారం" అని చెప్పుతూ ఇంటికి తెచ్చి ఈ ఇల్లు నీది; ఇవిగో నా పశువులు, ధనము, వస్తువులు ఇవన్నీ నీకే" అని మంత్రముతో చూపిస్తాడు.

అమాయకురాలైన ఆ వధువు చేత "నే నీ యిల్లు జాగ్రత్తగా చూస్తాను; మంచి మనస్సుతో పిల్లలను పెంచుతాను," అని మంత్రాలతో అప్పగింత చేసుకుంటుంది. అంతకంటే మహా మోసం ఏదయినా ఉంటుందా?

## పెళ్ళిగుర్తులు

మెడలో మంగళసూత్రం చూస్తే ఆ స్త్రీకి పెళ్ళయిందని తెలుసుకుంటాం. అది పెళ్ళికి గుర్తు. అలాగనే నుదుట బొట్టు కనిపించకపోతే అవివాహితో లేక విధవో అని గ్రహిస్తాం. ఆ లక్షణాలు

పుణ్యస్త్రీ ల లక్షణాలు. వీటిలో నల్లపూసలు, నల్లగాజులు కూడా కలపవచ్చును. కొన్ని జాతులలో పచ్చబొట్టు ఒక మాదిరిగా పొడిపించు కుంటే పెళ్ళయినట్టే ఊహించాలి.

ఇలాగే ఇంకా ఈ స్త్రీకి పెళ్ళికాలేదు అని తెలుసుకోడానికి కొన్ని గుర్తులున్నాయి. ఒక సంఘంలో ఆడది తన జుట్టును జతగా-పందితోక(Pig tail)లాగా వేసుకుంటే ఆమె పెళ్ళి తలపెట్టలేదని గ్రహిస్తారు. అలా కాకుండా రెండు జడలు - పందితోకలు - వేసి ఉంటే ఆమె పెండ్లి కోరుతున్నదని తెలుసుకొని యువకులు ఎవరైనా పరిచయం చేసుకోడానికి ప్రయత్నించవచ్చునన్నమాట. మన ఆంధ్రలో గూడా అలాగే అవివాహితులకు గుర్తుంది. అది మెడలో-కుత్తిక కంటుకొని ఉన్నట్టు కనబడితే ఆమె కన్యయని గ్రహించవచ్చును ఈ కుత్తిగంటు చిన్న బంగారంతో చేసిన మద్దెల ఆకారంలో అరంగుళం విడివి కలిగిన ఒక పూస. దీని పేరు "రూపు". ఈ పేరు మనలో కొన్ని ప్రదేశాలలో ఇప్పటికీ ఉంది. దీన్ని చూడగానే ఆమె కన్య అనీ, వివాహప్రయత్నం - ఇష్టముంటే, చేయవచ్చునని గ్రహిస్తారు.

ఈ సంగతి తెలిసినవాడు కాబట్టి మన వసుచరిత్ర వ్రాసిన రామరాజభూషణుడు ఆ మహాకావ్యంలో ఒక పద్యంలో:

**.........లతాంగి రూపు క**

**న్నారగ జూచి వచ్చితి న**

**వాంబురుహాంబక నీక తెల్పగన్**

అని పద్యం వ్రాశాడు. ఈ శబ్దం సంగతి తెలియనందున ఆ చక్కని పద్యానికి చాలినంత అర్థం చెప్పలేక, కేవలం ఆ కాంత శరీర సౌందర్యాన్నే చెప్పారు. వసుమహారాజు ప్రాణమిత్రుడు, మహారాజుతో సమానమైన ఉత్తమ భావాలు కలిగిన వాడుగా వుండాలి. లేకపోతే ఔచిత్యానికి భంగం కలుగుతుంది.

ఆ నర్మసఖుడు చూచినది ఆమె సౌందర్యం మాత్రం కాక, ఆమె మెడనున్న "రూపు" అన్న పెళ్ళికాని కన్య గుర్తును గూడా చూచాడు అందుచేతనే ఆమె శరీర సౌష్ఠవాన్ని వివరించి వర్ణించాడు. ఈ అర్థం

చెప్పకపోతే ఆ సఖుడు కనిపించిన అందగత్తెల కచ కుచాదులు, వివాహితలయి ఉంటారేమో అన్న వివక్షణ లేకుండా వర్ణించే "పోకిరీ" తార్పుగాడవుతాడు. అటువంటి వాని మిత్రుడు-వసురాజుగూడా అలాంటి పోకిరియే కావలసి వస్తుంది.

కొన్ని జాతులలో వివాహంలో కాలికి మెట్టెలూ, పిల్లేళ్ళూ వధువు కిస్తారు. అదే గుర్తు పెళ్ళయిందనటానికి. మరే గుర్తూ ఉండదు. మనలో గూడా కొన్ని వర్ణాలవారు ఈ మట్టెలకూ చుట్లుకూ ప్రాధాన్య మిస్తారు. పెళ్ళిలో మంగళసూత్రాన్ని విశ్వకర్మ దగ్గరనుంచి తేవడానికి ఎంత హంగామా చేస్తుంటారో, అంత హడావిడితోనే ఈ చుట్లూ మట్టెలూ తీసుకువస్తారు. వైధవ్యం రాగానే ఆ చుట్లు తీసివేస్తారు.

ఈ రహస్యం తెలియకుండానే ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దనామాత్యుడు మనుచరిత్రలో కన్నెపిల్ల మనోరమ అడవిలో పరుగెత్తడం వర్ణిస్తూ:

**మట్టెల్ మ్రోయగ గబ్బిచన్నుగవ**

**కంపంబంద.......**

**......మీనాక్షి దీనాకృతిన్.**

అని ఆ కన్యకు మట్టెలు పెట్టి వాటితో ఆ అడవిలో మోత పుట్టించాడు.

## సమర్త - చిమ్మిలి

ప్రపంచంలో, దాదాపు అన్ని దేశాలలోనూ, అన్ని జాతులలోనూ పిల్ల సమర్తాడిందనగానే, బంధువులు కొన్ని జాగ్రత్తలు తీసుకుంటారు. కొన్ని నిషేధాలూ-అది చేయకూడదు, ఇది తినకూడదు-పాటించేలాగ చేస్తారు. వాటిలో ముఖ్యమైనవి: ఎవరికంటా పడకుండా ఒక చీకటి గుహలోనో, గొందెలోనో ఆ పిల్లనుంచడం; చాలా మితమైన పథ్య ఆహారం తినడం; పచ్చని ఆకులతో అల్లిన చాపమీదనే ఉండడం-ఇలాంటివి, సర్వసాధారణంగా అన్ని దేశాలలోనూ ఉండేవి. ఇప్పటికీ కొన్ని దేశాలలోనూ జాతులలోనూ, ఈ ఆచారాలు కనబడుతుంటాయి.

ఎందుకింత గొడవ అంటే వారుచెప్పేది ఇలాగుంటుంది; రజస్వల అయినప్పుడు ఆ రక్తాన్ని ఆశ్రయించుకొని అనేక దుష్టశక్తులు-భూతాలన్నా తప్పలేదు-మెలగుతుంటాయి. ఆ రక్తస్పర్శగాని, దృష్టిగానిభూదేవి మీదపడితే; ఆ భూమి దగ్ధమయిపోయి నిస్సారమై పోతుందని గట్టి నమ్మకం. ఆ దుష్టశక్తులు ఆ పిల్ల గోప్యాంగాలను ఆశ్రయించి ఆ పిల్లనే కాకుండా ఆ సమాజాన్నంతటినీ పాడుచేసివేస్తాయని భయము.

ఈ భయం నివారించుకోడానికి గ్రీసుదేశంలో ఒక సంస్థ ఏమిచేస్తుందంటే-నూవులూ తేనె కలిపి దంచి, ఆ ముద్దలో గారెల లాగానూ, బూరెలలాగాను చేసి, వాటిని ఊరిలో కొందరికి పంచిపెట్టేవారు. అలా గోప్యాంగాల ఆకారంలో గారెలూ, బూరెలు చేసి పంచిపెడితే ఆ పిల్ల అంగాలకున్న దుష్టలక్షణాలూ, దోషాలు మాయమవుతాయని విశ్వాసం.

మనలో గూడా చాలా స్థలాలలో సమర్తాడినప్పుడు చిమ్మిలి దంచి పంచి పెడతారు. గ్రీసుభాషలో నూవులకు 'సినేం' అంటారు. తేనెకు 'మిలాయ్' అంటారు. ఈ రెండు కలిపి ఉచ్చరిస్తే "సి సెమ్మిలాయ్" అవుతుంది. మనము తేనెకు బదులు బెల్లం ఉపయోగించి నూవులు బెల్లము కలిపి "చిమ్మిలి" చేస్తాము.

సి సెమ్మిలాయ్‌లో మొదటి 'సి' విడిచి ద్విరుక్తం క్రింద విడిచిపెడితే సెమ్మిలాయ్ అని చిమ్మిలికి దగ్గరవుతుంది. ఉపయోగించే వస్తువులూ, తయారుచేసిన కాలము, పంచిపెట్టడమూ వీటినిబట్టి చూస్తే ఆ సి సెమ్మిలాయ్ ఆచారమే మన చిమ్మిలి ఆచారమయిందని అంగీకరించక తప్పదు. కాని పంచిపెట్టునప్పుడు దృష్టిలో నుంచుకోవలసిన గోప్యాంగాల ఆకారము మాత్రం జారిపోయింది. ఈ విధంగా అనేక విషయాలలో మనం కేవలం ఆచారాన్ని మాత్రం జ్ఞాపకముంచుకొని పాటిస్తూ, వాటి అంతరార్థాలనూ, ఉద్దేశాలనూ-ఆ ఆచారాలకు కారణాలయిన వాటిని మరచిపోయాము. ఈలాంటిదే అరివేణి శబము.

## అరివేణి

రంగులు పూసిన కుండలకు మనవారి పెళ్ళిళ్ళలో ఒక గౌరవ స్థానం వుంది. పెళ్ళి సమయంలో మంగళ సూత్రాలూ (పుస్తెలతో సహా), చుట్లూ, పిల్లేళ్ళూ స్వర్ణకారుడి ఇంటినుంచి తీసుకువచ్చినట్టే ఈ రంగులు పూసిన కుండలను కుంభకారుల ఇంటినుంచి ముత్తైదువలు తీసుకువస్తారు పాటలు పాడుతూ!

**ఐరేణి గొనివచ్చి రైదువుల్ పాటలు**

**పాడుచు శుభవేళ వేడుకలర.....**

అని చేమకూరకవి వర్ణించాడు. అది సుభద్ర పెళ్ళి వర్ణనకాదనీ తంజావూరునాయక శ్రేష్ఠుడు రఘునాథుడి పెళ్ళే అని వేరుగా చెప్పనక్కరలేదు.

ఈ కుండలను ఐరేని అనీ, అయిరేణి అనీ, అరివేణి అనీ, అరిమన కుండలనీ రకరకాలుగా అంటారు. ఇన్ని రూపాంతరాలు ఉండడంబట్టి, ఆ మాట మన భాషలోనిది కాదని రుజువవుతుంది-ఏ ఇరాన్ దేశీయుల మాటో అయి వుంటుంది. ఎందుకంటే, ఆ ప్రాంతాల తవ్వకాలలో ఈలాంటి రంగులు పూసిన కుండపెంకులు ఇప్పటికీ కనిపిస్తుంటాయి. కులదేవతలూ, పితృదేవతలూ అన్నభావంతో వారు ఆ దేశాలలో చాలాభక్తితో గౌరవిస్తుంటారు. మనకు ఆ ఆచారమే ఉందిగాని ఆ భక్తి కానరాదు. ఇలాంటి అర్థాలు తెలియని ఆచారాలు ఎంత వేగంగా మనం మానుకుంటే అంత మంచిది కదా?

## ఎనిమిది రకాల పెళ్ళిళ్ళు

మన పెళ్ళిళ్ళు అన్నీ ఎనిమిది రకాలుగా ఉంటాయని శాస్త్రకారులు నిర్ణయించి, వాటిలో జరిగే ప్రధాన విషయాలను వివరించారు:

1. బ్రాహ్మ వివాహము: పిల్ల నడగడానికి వరుడు రాకముందే కన్యాదాత తానే ప్రయత్నించి కన్య నివ్వడం.
2. దైవ వివాహము: కన్యాదాత యజ్ఞం చేయిస్తున్నప్పుడు ఆ రుత్విక్కుడికి (దక్షిణ పుచ్చుకొని యజ్ఞం చేయించేవాడికి) కన్య నలంకరించి దానం చేస్తే అది దైవ వివాహం అవుతుందట.
3. ఆర్ష వివాహము: వరుడి దగ్గర ఒకటి రెండు జతల గోవులను పుచ్చుకొని కన్యనివ్వడం ఆర్షం అవుతుందట.
4. ప్రాజాపత్య వివాహము: కన్యను వరుడు అడగడానికి వచ్చిన తరువాత నీవు దీనిని ధర్మపత్నిగా చేసుకోవాలని చెప్పి కన్య నివ్వడం ప్రాజాపత్యం.
5. అసుర వివాహము: డబ్బుయిచ్చి కన్యను కొనుక్కోవడం అసుర వివాహం.
6. గాంధర్వ వివాహము: వధూవరు లిద్దరూ ఒకరినొకరు కామించి (ప్రేమించి) పెద్దల అనుమతి లేకపోయినా జతగూడితే అది గాంధర్వం అవుతుందట.
7. రాక్షస వివాహము: పిల్ల బంధువులతో పోట్లాడి, దానిని బలత్కారంగా తీసుకోవటం రాక్షసం అవుతుందట.
8. పైశాచి వివాహము: నిద్రలో నున్నపుడూ, నిషామీదున్నప్పుడూ ఎవరికీ తెలియకుండా పైనపడి జతగూడటం పైశాచి అవుతుందట.

ఈ ఎనిమిదింటిలో ఏ ఒకటో ఇప్పటి పెళ్ళిళ్ళకు సదురుకొని ఉపయోగించవచ్చును; ఆ మాత్రం కోసం అష్టవిధ వివాహాలని ఊగులాడడం ఎంత అర్థంలేని పనో ఆలోచించండి.

ఇప్పుడు మనలో జరుగుతున్న పెళ్ళిళ్ళు శాస్త్రాల ననుసరించి జరిగేవిగాక దేశ కాల పరిస్థితుల ననుసరించి జరుగుతున్నాయి. కోవెలలో పేర్లు చెప్పుకొని ప్రసాదం ఇద్దరూ తీసుకోవడం ఉంది. ఉంగరాలు మార్చుకోవడం ఒకటి. నలుగురి సమక్షంలో పూలదండలు ఒకరికొకరు వేయడం ఉంది. పెళ్ళిళ్ళ రిజిష్ట్రార్ ఆఫీసులలో సంతకాలు చేయడం ఉంది. బంధుమిత్రుల నిండుసభలో వధూవరు లిద్దరు పరస్పరం

ప్రేమించుకొని, పెళ్ళి చేసుకుంటున్నామని, వారి ఆశయాలను ప్రతిజ్ఞాపూర్వకంగా చెప్తూ వివాహ పత్రిక మీద సంతకాలు చేయడం ఉంది.

ఇంతేగాక, శాఖాంతర వివాహాలూ, కులాంతర వివాహాలూ, మతాంతర వివాహాలూ, రాష్ట్రాంతర వివాహాలూ.... ఇలాంటివి చాలా వున్నాయి. వీటిని ప్రపంచమంతటా ఇప్పుడు గౌరవిస్తున్నారు. దేశ సమైక్యతకూ, ప్రపంచ శాంతికీ ఈ రకం ఎంతవరకూ ఉపయోగ పడతాయో గుర్తించి, వాటి ననుసరించడం చాలా అవసరం.